

# خلفائے راشدین

## حصہ اول

ఖులఫాయెరాషిదీన్

# ఇస్లాము మతప్రభువులు

## మొదటి భాగము

---


గ్రంథకర్త :

మౌల్వీ మున్షీఫాజిల్

( కర్నూలు జిల్లా కంబము నివాసి )

ముహమ్మద్ అబ్దుల్ గఫూర్

వైస్‌ప్రిన్సిపాల్ అరబీకాలేజి,

కర్నూలు.



కాపీరైటు **1952** వెల రూ. 2—0—0

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్. హామిదన్ వముసల్లియన్

# మనవి

పరమదయాళువగు అల్లాః కృపవలన ఇస్లామ్ మత ప్రభువుల చరిత్రములో మొదటి భాగము ముద్రించి ప్రక టించునట్టి భాగ్యము నాకు లభించినందులకు దేవునికి చాల కృతజ్ఞత సలుపుచున్నాను. మొదటి భాగములో హజ్రత్ అబూబకరు, హజ్రత్ ఉమరువారి చరిత్రముగలదు. ఇఁక రెండవ భాగము వ్రాయుచున్నాను. అందు హజ్రత్ఉస్మాను, హజ్రత్ అలీవారి చరిత్రముగలదు. దేవుని యనుగ్రహము వలన కొలఁది కాలములోనే వ్రాఁతపని పూర్తి చేయఁదలఁచు కొన్నాను. చదువరులు దానిఁగూర్చి దేవుని ప్రార్థింపవలెనని మనవి. ఇస్లామ్మతప్రభువుల వ్రాఁతపనిపూర్తియైన పిదప దేవుని కృపయే ఉన్నచో హజ్రత్ ముహమ్మదు రసూలు వారి యుపదేశము (హదీసు)ల గ్రంథములలో చాల ముఖ్య మైన మిష్కాతెషరీఫు గ్రంథమును తెనిఁగించుటకు ప్రారం భించెదను. (ఇన్షాఅల్లాః)

6—4—52
కర్నూలు

ఇట్లు
ముహమ్మద్ అబ్దుల్ గఫూర్

# పీఠిక

పరమదయాళువగు అల్లాః కృపవలన ఇస్లాము మత గ్రంథమగు ఖురానెషరీఫునకు తెనుఁగు తర్జుమా (వ్యాఖ్యాన సహితము) చేసి ముద్రించి తెనుఁగులోకమునకు సేవచేయునట్టి భాగ్యము నాకులభించినందులకు నేను దేవునికి చాల కృతజ్ఞుఁడను. ఖురానెషరీఫును దేవునివలన పొందిజగత్తునకంతయు కట్టకడపటి ప్రవక్తగా దేవునిచే నియమింపఁబడిన హజ్రత్ మహమ్మద్ రసూలువారి దివ్యచరిత్రముకూడ తెనుఁగులో వ్రాసి ప్రకటించునట్టి అవకాశము నాకులభించినందులకు దేవుని యెడ నేను సదాకృతజ్ఞుఁడను. హజ్రత్ పైగంబరులవారి శిష్యులు (సహాబా) ఖురానెషరీఫులోని ధర్మములను హజ్రత్ ముహమ్మద్ రసూలు వారి యుపదేశములను వారి యాచారములను అనుసరించి మానవకోటికి మార్గదర్శకులైరి. అందు ముఖ్యముగా హజ్రత్ రసూలువారి పిదప ఇస్లామ్ మత ప్రభువులుగా నేర్పడి ధర్మముగా లోకమును పరిపాలించిన వారలగు హజ్రత్ అబూబకరు హజ్రత్ ఉమరు, హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అలీవారి చరిత్రములు తెనుఁగు లోకమునకుఁ దెలియఁబఱచుట చాలఅవసరము. అందులకే వారిచరిత్రము వ్రాయుటకు పరమదాతయగు అల్లాః పైభారము వైచిప్రారంభించితిని. వారి చరిత్రముచదువుటకు పూర్వము ఖిలాఫత్, అనఁగా నేమి? ఖిలాఫత్ వహించిన ఖలీఫాయొక్క ధర్మములెవ్వి? అను విషయములు పాఠకులు తెలిసికొనుట చాల అవసరము. కావున చరిత్ర వ్రాయుటకుఁ బూర్వము ఆ విషయములను వ్రాయుచున్నాను. ఖిలాఫత్ అనఁగా ప్రతినిధిత్వము. ఒకరికి బదులుగానుండుట. ఖిలాఫత్ వహించిన యాతఁడు ఖలీఫా. హజ్రత్ ముహమ్మద్ రసూలువారు పరలోకముచేరిన పిదప

వారి స్థానముననియమింపబడిన యాతడుఖలీఫా. ఖలీఫా ఇస్లాముమతప్రభువు అని చెప్పఁబడిరె. హజ్రత్ ముహమ్మద్ వారు దేవుని సందేశముపొంది దాని ప్రకారమునడచుకొనుచు ప్రజలకు ఆత్మజ్ఞానమును ధర్మమును బోధించుచు వారి మధ్య న్యాయమును నెలకొల్పిరి. అటులేవారి పిదపవచ్చిన ఇస్లామ్ మతప్రభువు (ఖలీఫా)లు దేవుని ధర్మముల (ఖురాను)ను అనుసరించి మతసేవచేయుచు ప్రజలను న్యాయముగా పరిపాలించుచు లోకమునుండి అధర్మమును అన్యాయమును, అశాంతమును తొలఁగించి, దేశములో ధర్మమును న్యాయమును శాంతమును నెలకొల్పుట వారివిధిగా వర్తించుచుండిరి. మత ధర్మములనుబట్టి ఖలీఫాను ఎన్నుకొనుట ముసల్మానుల విధియైయున్నది. ఇస్లాముమతములోని అనేకధర్మముల నెఱవేర్చుటకు ఖలీఫా (మతప్రభువు) చాలఅవసరము. మత ప్రభువు లేనిచో ఆధర్మములు అమలునకురాలేవు. వ్యభిచారమునకును హత్యలకును దొంగతనము మొదలగు వానికిఁగల శిక్షలను విధించుట మతప్రభువుపని. ఆతఁడు లేక యిట్టి శిక్షలు సామాన్యప్రజలు విధింపలేరు. కావున ముసల్మానుల మత సాంఘికాది విషయములు కొఱఁతలేకుండ పూర్తిఅగుటకు ఖలీఫాను నియమించుట తప్పనివిధిగా నున్నది.

### ఖిలాఫత్ యొక్క షరతులు

లోకములోని ప్రతిదేశమువారును ప్రతి జాతివారును దేశమును పరిపాలించునట్టి ప్రభువు బుద్ధిమంతుఁడును జ్ఞానముగలవాఁడును యుక్తవయస్సు (పొందినవాఁడును) స్వాతంత్ర్యముగలవాఁడును పురుషుఁడును ధైర్యశాలియును పలుకుబడిగలవాఁడునుగా నుండవలెను అని సమ్మతించియున్నారు. ముసల్మా

నుల ఖలీఫా, పై గుణములతోఁబాటు ఈదిగువ వివరింపఁబడు గుణములును గలిగియుండవలెను.

(1) ఇస్లామమతమును స్వీకరించియుండవలెను.

(2) ఇస్లామఃమత విద్య తెలిసి యుండవలెను. ఖురాను ధర్మములను హాజ్రత్ రసూలువారి యుపదేశములను గ్రహించి దాని ప్రకారము తీర్మానించునట్టి మత విద్య ఉఁడవలెను.

(౩) న్యాయముచేయువాఁడుగా నుండవలెను.

(4) ఖురైషువంశమునకు చేరియుండవలెను. ఒక వేళ పై గుణములుగల ఖురైషీల భింపనిచో ముసల్మానులు ఖురైషీ వంశమునకు చేరని యాతనినెన్ను కొనినను దోషములేదు. ఒక వేళ ఎవఁడైన ముసల్మానుఁడు తన బలముచే బలాత్కారముగా ఖురైషువంశమునకు చేరనియాతఁడు ప్రభుత్వమునకు వచ్చినచో ముసల్మానులు ఆతనిసమ్మతింపవలెను. ఆతనికి విరోధముగ మఱొకని నెన్నుకొని అంతః కలహములకు చోటీయరాదు.

### ఖలీఫాను ఎన్నుకొను పద్ధతి

ఖలాఫత్ లో వారసత్వములేదు. కావున పైని వివరింపఁబడిన గుణములుగలవానిని ముసల్మానులు ఎన్నుకొనవలెను. లేక ముసల్మానులలో పలుకుబడిగల నాయకులు ఎన్నుకొనవలెను. నాయకులలో మతవిద్వాంసులు, ప్రభుత్వమునకు చేరిన అమీరు (అధికారు)లు సేనాధిపతులు మొదలగు పెద్దలుచేరుదురు. ఈ నాయకులు బుద్ధిజ్ఞానములును మతాభిమానమునుగలిగి దేశక్షేమము కోరువారలుగా నుండవలెను.

## ఖలీఫా సలహా గైకొనుట

ముసల్మానులచే ఖలీఫా ఎన్నుకొనఁబడిన పిదప ఆతఁడు రాజ్యాంగ విషయములలో నాయకుల సలహా తీసికొనవలెను. గొప్పగొప్ప విషయములలో నాయకులసభగావించి యందఱి అభిప్రాయములు తీసికొనవలెను. సలహానిచ్చువారు స్వార్థపరులుగానుండక ప్రజల మేలుకోరువారలుగా నుండవలెను. ఖలీఫాతోఁబాటు అందఱు నాయకులు(సభ్యులు) ఏకగ్రీవముగా తీర్మానించినచో దాని ప్రకారము ఖలీఫా చేయవలెను. ఒక వేళ సభ్యులలో అభిప్రాయ భేదముగలిగినచో అధికసంఖ్యాకులు ఇచ్చిన సలహాయందు సత్యముమేలున్నది అని ఖలీఫా నిశ్చయించుకొన్నచో దాని ప్రకారముచేయవలెను. ఒక వేళ అధికసంఖ్యాకు లిచ్చిన అభిప్రాయము పొరపాటు అని ఖలీఫా నిశ్చయించుకొన్నచో అల్పసంఖ్యాకు లిచ్చిన అభిప్రాయమును అనుసరింపవలెను. సలహా నిచ్చుసభ్యులుమంచి బుద్ధితో దేశక్షేమముకోరి యియ్యవలెను. అందు నేలాంటి ద్వేషముగాని కపటముగాని వహింపరాదు.

## నల్గురు ఖలీఫాలు

హాజ్రత్ రసూలువారి పిదపవరుసగా హ్రజత్ అబూబకరు హ్రజత్ ఉమరు హ్రజత్ ఉస్మాను హ్రజత్ అలీ అనునల్గురు ఖలీఫాలుగానై లోకమునకు మార్గదర్శకులైరి. ఆ నల్గురిలో మొదటి ఖలీఫాఅయిన హాజ్రత్ అబూబకరుగారు అన్ని విధముల ఎక్కువ ఘనతగలవారు. వారితరువాత హాజ్రత్ ఉమరు వారును హాజ్రత్ ఉస్మాను వారును హ్రజత్ అలీవారును వరుసగ ఘనతగలవారు.

---

# విషయసూచిక

పుట.



---

శివాజీ ప్రెస్, గంజ్ బజార్, శికింద్రాబాదు.

# ఇస్లాము మతప్రభువులు

మొదటి ఖలీఫా

## హ|జత్ అబూబకరుగారి వంశావళి

మొదటి ఖలీఫాగారి పేరు అబ్దులాః. అబూబకరు అనునది కునీయత్, (అనగా కుమారులు మొదలగు బంధువుల సంబంధమునుబట్టి పిలువఁబడు పేరు. అబూ అనగా తండ్రి అబూబకరు అనగా బకరు తండ్రి.) సిద్దీఖు (సత్యవంతుఁడు.) అతీఖు (ముక్తిపొందిన యాతఁడు) అనునవి బిరుదములు. తండ్రిపేరు ఉస్మాను. ఈతని కునీయత్ అబూఖహాఫా. తల్లి పేరు సల్మా. ఈమె కునీయత్ ఉమ్ముల్ ఖైర్. వీరుఖురైషులకు చెందిన బనీతమీము అను శాఖకు చేరినవారు. వీరివంశము గోత్రమును హ|జత్ ముహమ్మదురసూలువారి వంశమును ముర్రా అను నాతనితో కలియుచున్నది. అట్లు ఉభయులును ఒక గోత్రమునకు చేరిన వారలగుచున్నారు. హజ్రత్ పైగంబరులవారు జననమొందిన రెండేండ్ల పిమ్మట హజ్రత్ అబూబకరుగారు మక్కాపురములో పుట్టిరి.

—: ఇస్లామునకు పూర్వము :—

హ|జత్ అబూబకరుగారు ఇస్లామ్ మతములో చేరక మునుపు వ్యాపారము చేయుచు చాల ధనము నార్జించియుండిరి. ఇస్లామునకు పూర్వము అరేబియా దేశములోనున్న స్థితి 'జగత్ ప్రవక్త' చదివిన వారికి తెలిసియుండును. అట్టి కాలములోకూడ హ|జత్ అబూబకరుగారు మంచి గుణశీలములు

---

శివాజీ ప్రెస్, గంజ్ బజార్, శికింద్రాబాదు.

# ఇస్లాము మతప్రభువులు

మొదటి ఖలీఫా

## హజ్రత్ అబూబకరుగారి వంశావళి

మొదటి ఖలీఫాగారి పేరు అబ్దుల్లాః. అబూబకరు అనునది కునీయత్, (అనగా కుమారులు మొదలగు బంధువుల సంబంధమునుబట్టి పిలువఁబడు పేరు. అబూ అనగా తండ్రి అబూబకరు అనగా బకరు తండ్రి.) సిద్దీఖు (సత్యవంతుఁడు.) అతీఖు (ముక్తిపొందిన యాతఁడు) అనునవి బిరుదములు. తండ్రిపేరు ఉస్మాను. ఈతని కునీయత్ అబూఖహాఫా. తల్లి పేరు సల్మా. ఈమె కునీయత్ ఉమ్ముల్ ఖైర్. వీరుఖురైషులకు చెందిన బనీతమీము అను శాఖకుచేరినవారు. వీరివంశము గోత్రమును హజ్రత్ ముహమ్మదురసూలువారి వంశమును ముర్రా అను నాతనితో కలియుచున్నది. అట్లు ఉభయులును ఒక గోత్రమునకు చేరిన వారలగుచున్నారు. హజ్రత్ పైగంబరులవారు జననమొందిన రెండేండ్ల పిమ్మట హజ్రత్ అబూబకరుగారు మక్కాపురములో పుట్టిరి.

—: ఇస్లామునకు పూర్వము :—

హజ్రత్ అబూబకరుగారు ఇస్లామ్ మతములో చేరక మునుపు వ్యాపారము చేయుచు చాల ధనము నార్జించియుండిరి. ఇస్లామునకు పూర్వము అరేబియా దేశములోనున్న స్థితి 'జగత్ ప్రవక్త' చదివిన వారికి తెలిసియుండును. అట్టి కాలములోకూడ హజ్రత్ అబూబకరుగారు మంచి గుణశీలములు

గలిగి సత్యము పలుకుచు నమ్మకగల వారలుగ నుండిరి. అం దులకే వారిని అరబ్బులు చాల గౌరవించుచు వారి యందు నమ్మకగలిగి హత్యలకు పరిహారముగ తీసికొనఁబడు ధనము (ఖూన్ బహా) వారి యొద్ద అమానతుగా నుంచుచుండిరి. వారు తమ ధనమును నిజముపేదలకును అక్కఱగలవారికిని దానము చేసి యుపకారము చేయుచుండిరి. వీరికి బాల్యమునుండియు హాజ్రత్ మహమ్మదు పైగంబరుల వారితో చాల స్నేహ ముండెను. పెక్కుసార్లు వారు పైగంబరులవారివెంట వ్యాపా రమునకై పరదేశములకు పోవుచుండిరి. హాజ్రత్ అబూబకరు గారు ఇస్లామునకు పూర్వముకూడ సారాయి మొదలగు మత్తుపదార్థములు సేవించి యెఱుంగరు.

—: హజ్రత్ అబూబకరుగారు ఇస్లామ్‌లో చేరుట :—

హాజ్రత్ మహమ్మదురసూలు వారికి ప్రవక్తపదవి లభించిన తరువాత వారు రహస్యముగా తమస్నేహితులలో ఇస్లామ్ మతప్రచారము చేయసాగిరి. హాజ్రత్ రసూలువారు ఇస్లామునుగూర్చి అబూబకరు గారికిఁ దెలుపఁగా ఏలాటి సంస యమువహింపక తత్క్షణమే వారు తమస్వభావమునుబట్టి దేవుని యనుగ్రహము వలన ఇస్లామును స్వీకరించిరి. పురుషులలో వీరే మొట్టమొదట ఇస్లాములో చేరినవారు.

—: ఇస్లామ్ మతప్రచారము :—

హజ్రత్ అబూబకరుగారు ఇస్లాము నవలంబించిన తత్క్షణమే దానిఁగూర్చి ప్రచారముచేయసాగిరి. వారు వ్యాపా రము చేయువారు. మక్కా పట్టణములో వారి గుడ్డల దుకా

ణములుండెను. వారి యొద్దకు జనులు ఎక్కువగా వచ్చుచుం డిరి. వారి ప్రచారము వలన ఉస్మానుగనీ, జుబైరు, అబ్దుల్ రహ్మాన్ బిన్ ఔఫ్, తలహా, సాద్ బీన్ అబీవఖాస్, అబూ ఉబైదా, అబ్దుల్ అసద్, ఉస్మాన్ బిన్ మజ్ఊన్, ఆమిరుబిన్ ఫుహైరా అబూహుజైఫా మొదలైన వారు ఇస్లాము మతము నవలంబించిరి. మఱియు ఇస్లామ్ మత ప్రచారములో హజ్రత్ రసూలు వారికి సంపూర్ణముగ తోడుపడు చుండిరి. హజ్రత్ రసూలు వారు ప్రచారమునకై ఎచ్చటెచ్చటకు పోవుచుం డిరో వారుకూడ వారివెంబడి పోవుచుండిరి. చుట్టుపట్ల గ్రామ ములకును జాతరులు జరుగు స్థలములకును హజ్రత్ రసూలు వారితోబాటు పోవుచు ప్రచారము సాగించుచుండిరి.

—: మక్కాపుర నివాసము :—

హజ్రత్ రసూలు వారికి ప్రవక్తపదవి లభించిన పిదప పదమూడు సంవత్సరముల వఱకు దుష్టులు వారికి పెట్టుకష్ట ములను సహించుచు అచ్చట ప్రచారము చేయుచుండిరి. ఇట్టి కష్టకాలములో హజ్రత్ అబూబకరుగారు సంపూర్ణముగా తమ ధనము, బలము సర్వము హజ్రత్ పైగంబరుల వారికి వినియోగించుచు సేవచేయుచుండిరి. హజ్రత్ రసూలువారు కూడ ఉదయము సాయంకాలము హజ్రత్ అబూబకరుగారి యింటికిపోవుచు మతప్రచార విషయములో సలహా పుచ్చు కొనుచుండిరి. హజ్రత్ అబూబకరుగారు తమ స్నేహితులను గూర్చి పైగంబరులవారికిఁ దెలుపుచు వారి మధ్య పరిచయ మగునట్లు చేయుచుండిరి.

మొట్టమొదట మక్కాపురములో ఇస్లాము స్వీకరించిన వారిలో పెక్కుమంది బానిస పురుషులును, స్త్రీలు నుండిరి. ఈబానిసలు మక్కా కాఫిర్లకుఁ జెందినవారు. వారిదుష్ట యజమానులు వారు ఇస్లామును వదలవలెనని వారికి పెట్టరాని బాధలు, హింసలు పెట్టుచుండిరి. ఆహింసలు చూడలేక కనికిరించి హజ్రత్ అబూబకరుగారు ఆబానిసలను వెలకుఁ దీసికొని స్వేచ్ఛాపరులుగ(ఆజాద్)చేయుచుండిరి. అట్లు స్వేచ్ఛ (ఆజాదీ) పొందిన బానిసలలో హజ్రత్ బిలాల్ ఆమిరుబిన్ ఫుహైరా, నజీరా, నహాదియా, జారియా బనీమూమిల్, బిన్తె నహాదియా, అనువారుగలరు. మక్కాకాఫిర్లు, హజ్రత్ రసూలు వారిని చాల హింసించుచుండిరి. కొన్ని సమయములలో హజ్రత్ అబూబకరుగారు తమ ప్రాణమునుకూడ లెక్కచేయక హజ్రత్ రసూలు వారికి తోడుపడుచుండిరి.

ఒక దినము హజ్రత్ పైగంబరులవారు కాబామసీదులో ప్రార్థన (నమాజు) చేయుచుండిరి. "ఉఖ్బాబిన్ అబీముయీతు" అను దుష్టుఁడు వచ్చి తన దుప్పటిని త్రాడువలె పేని పైగంబరుల వారు సజ్దా (సాష్టాంగ నమస్కారము) చేయుచున్నపుడు వారి మెడకు వేసి చుట్టసాగెను. పైగంబరుల వారి మెడ నలిగి చాల బాధకలుగు చుండినను వారు ప్రార్థనలోనే యుండిరి. అంతలో దైవికముగా హజ్రత్ అబూబకరుగారువచ్చి యాదుష్టుని త్రోసివేసి యాదుప్పటిని పైగంబరులవారి మెడనుండి తీసివేసి ఏమి, మీరొయొద్దకు దేవుని సూచనలు తీసికొని వచ్చి, నాప్రభువు అల్లాః అని పలుకునట్టి వానిని మీరు వధింతురా! అని పలికిరి. అపుడు కొందఱు

దుష్టులు హ్రజత్ అబూబకరును పట్టుకొని కొట్టి చాల బాధించిరి. ఒక దినము హజ్రత్ పైగంబరులవారు కాబామసీదులో ఉపన్యాసమిచ్చుచుండిరి. మక్కా కాఫర్లు దానిని విని మండిపడి హజ్రత్ వారిని పట్టుకొని సొమ్మసిల్లి పడిపోవునట్లుగ కొట్టిరి. అపుడు హ్రజత్ అబూబకరుగారు, ఆదుష్టులతో "మీ తెలివిపాడుగాను! ఈరసూలువారు "దేవుడుఒక్కడు" అని పలికిన మాత్రమున మీరు ఆతనిని వధింతురా" అని పలికిరి.

హజ్రత్ అబూబకరుగారు తమ ముద్దుల కుమార్తె బీబీఆయిషాను పైగంబరుల వారికిచ్చి మక్కాపురములో నున్నపుడు వివాహము చేసిరి. ఇట్లు హ్రజత్ రసూలు వారికిని హజ్రత్ అబూబకరు గారికిని బంధుత్వరీతిగాను సంబంధము గలిగెను.

—: అబూబకరుగారు అబిసీనియాకు పయనమగుట :—

మక్కా ఖురైషులు ఇస్లాములో చేరిన బలహీనులను మాత్రమే బాధించుట లేదు. గొప్పకుటుంబ సహాయముగల వారినికూడ బాధించుచుండిరి. అందు హ్రజత్ అబూబకరు గారి కుటుంబము చాల బలమైనది. వారికి సహాయులు పెక్కురు గలరు. అయినను ఖురైషుల దౌర్జన్యము వారిపై అమిత మాయెను. అందుచే వారు హజ్రత్ రసూలువారి సెలవు పొంది మక్కాపురమును విడిచి అబిసీనియాకు పయనమై బిర్కుల్ గమాదు అను ప్రదేశము చేరిరి. అచట ఇబ్నుదగినా అను సర్దారు కలిసి మీరెక్కడికి పోవుచున్నారు అని అబూబకరును అడిగెను. అప్పుడు "నాకులము వారు నన్ను మక్కాలో

శాంతముగా నుండనీయరు. కావున ఎచటికైనపోయి నెమ్మదితో దేవుని ప్రార్థింపవలెనని పోవుచున్నాను”అని అబూబకరుగారు బదులు చెప్పిరి. అప్పుడా సర్దారు “అట్లు కానేరదు. మీవంటివారు మక్కావిడిచి పోవుట సరికాదు. నేను మీకు అభయమొసంగుచున్నాను”అని తిరిగి వారిని మక్కాపురమునకు పిలిచికొని వచ్చెను. ఆసర్దారు ఖురైషులతో కలిసి “ఏమి!మీరు, నిఱుపేదలకుతోడు పడునట్టియు, అతిథులకాతిథ్యము చేయునట్టియు, బంధువులను పోషించునట్టియు ‘అబూబకరు’ను వెళ్ళఁగొట్టుచున్నారు అని యడుగఁగాఖురైషులిట్లనిరి. “అబూబకరు నిశ్శబ్దముగా తనయింటిలో ప్రార్థన (నమాజు) చేసికొనవలెను. ఎందుకన అతఁడు పఠించు ఖురాను వాక్యములు విని మాస్త్రీలు బిడ్డలు దానికి లోఁబడు చున్నారు. కావున అతఁడు మేము చెప్పినట్లు ఇంటిలో శబ్దము లేకుండ చదువవలెను. హజ్రత్ అబూబకరు ఖురైషులమరతు ప్రకారము కొన్నిదినములు చేసిరి. పిదప తమ ఇంటి ముంగిటిలో నొకమసీదు కట్టుకొని దానిలో శబ్దముతోనే నమాజు చేయ సాగిరి. వారి పఠన చాల సారవంతముగా నుండెను. అందుచే స్త్రీలు బిడ్డలు ఖురానువిని పరవశులగుచుండిరి. అది ఖురైషులుచూచి ఇబ్నుదగ్నాతో చెప్పిరి. ‘అతఁడు వచ్చి అబూబకరుతో నిట్లు చెప్పెను. “నేను మీకిచ్చిన అభయము రద్దు చేయుచున్నాను. ఇఁకమీఁద మీయిష్టము” అపుడు హజ్రత్ అబూబకరుగారు“నీఅభయమునాకక్కఱలేదు. దేవుని రక్షణయే నాకు చాలును”అని చెప్పి తమ యిష్టప్రకారము నమాజు చేయసాగిరి.

## —: అబూబకరుగారు మదీనాపురమునకు వలస పోవుట :—

మక్కాఖురైషుల దౌర్జన్యము దినదినము హెచ్చసాగెను. ముసల్మానులకు దుష్టులు పెట్టుకష్టములు మితిమీఱిపోవుచుండెను. ధర్మరక్షణార్థము కొందఱు ముసల్మానులు అబీసీనియాకు వలస పోయియుండిరి. మఱికొందఱు మదీనాపురము చేరియుండిరి. అప్పటికి మదీనాపురములో ఇస్లామ్ చాలవఱకు ప్రబలియుండెను. అందులకు హజ్రత్ అబూబకరుగారు కూడ రెండవతూరి మక్కాపురము వదలి మదీనాపురము పోయిచేరవలెనని యుద్దేశించుకొనిరి. దానికి ఏర్పాటులుచేసి కొనుచుండిరి. కాని హజ్రత్ పైగంబరుల వారు "ఓ అబూబకరు! మీరు తొందఱపడనక్కఱలేదు. నేను కూడ మక్కాపురము వదలి పోవునట్లు దేవుఁడునాకు సెలవు నొసంగునని నాకు ఆశయముగలదు." అనిసెలవిచ్చిరి. అది వినిమహాశ్చర్యముతో "ఏమి అట్లు మీకుఁగూడ దేవుని సెలవగునా" అని విన్నవింపఁగా అవును అని హజ్రత్ వారు సెలవిచ్చిరి. అపుడు అబూబకరుగారు "మీ వెంటవచ్చుటకు నాకుఁగూడ సెలవుకావలెను" అని విన్నవింపఁగా మీరుకూడ నావెంట వత్తురు అని సెలవిచ్చిరి. ఈ సంతోషవార్తవిని అబూబకరుగారు నాలుగు నెలలవఱకు తమ పయనము ఆపి యుంచిరి.

హజ్రత్ రసూలువారు, సాధారణముగ ఉదయము సాయంకాలము, అబూబకరుగారి యింటికిపోవుచుండిరి. కాని ఒకదినము అకాలమున మిట్టమధ్యాహ్నము అబూబకరుగారి యింటికి పోయితలుపుతట్టిరి. అబూబకరుగారు తొందఱ

పాటుతోవచ్చితలుపు తెఱచి లోపలికిఁగొనిపోయిఎండలోదయ చేసితిరి. ఏమి సెలవుఅని విన్నవించిరి. అపుడు పైగంబరులవారు “ఇంటిలో నితరులెవరైన నుండినచో వారిని పంపివేయుఁడు. నేను ఒంటరిగా మాటలాడవలెను”అని అబూబకరుగారితో పలికిరి. అపుడు అబూబకరుగారు నాకుటుంబమువారు తప్ప వేఱుమనుష్యులెవరును లేరు అని పలికిరి. అపుడు హజ్రత్ రసూలువారు నేను మక్కాపురమువిడిచి మదీనాపురము పోవలెనని నాకు దేవుని యాజ్ఞఅయినది నేను పోవుదును అని బదులు చెప్పిరి. అపుడు మీ సేవకుఁడగు నాకు కూడ వచ్చుటకు సెలవున్నదా' అని అబూబకరుగారు అడిగిరి. “రావచ్చును” అని పైగంబరులవారు సెలవిచ్చిరి. అది విన్నంతనే మహాసంతోషముతో 'ఓమహానుభావా! యీపనికై రెండు ఒంటెలుకొని యున్నాను. అవి ప్రయాణమందు చాల వేగము గాపోఁగలవు. మీరు ఒకటికానుకగా తీసికోనవలెను.” అని అబూబకరుగారు చెప్పఁగా “అట్లువలదు. దాని వెలనిచ్చెదను”అనిపైగంబరులవారు పలికిరి. ఆరాత్రియేప్రయాణముగుదమని వారునిశ్చయించుకొనిరి. అబూబకరుగారి కుమార్తెయగు “బీబీఆస్మా” ప్రయాణము కొఱకుఆహార పదార్థములు సిద్ధపఱచెను. హజ్రత్ పైగంబరులవారును అబూబకరుగారును మక్కాపురమునుండి బయలుదేఱిరాత్రి చీఁకటిలో మార్గమందు ముండ్లు రాళ్లుతగులుచుండ మూఁడుమైళ్లదూరమున నుండిన 'సౌరు' అను కొండగుహలోదాఁగిరి.

—: సౌరుగుహలో బసచేయుట :—

ముందు అబూబకరుగారు సౌరుగుహలో ప్రవేశించి

అందున్న బిలములను రంధ్రములను మూసివేసిరి. ఆ పిదప హజ్రత్ రసూలువారు గుహాలో ప్రవేశించి అబూబకరుగారి తొడపై నానుకొని నిద్రపోయిరి. దైవికముగా గుహాలోని ఒక మూయక యుండిన బిలమునుండి ఒక పాము తల బయటికిఁదీసెను. హజ్రత్ వారినిద్రచెడిపోవునను భీతిచేతను ప్రాణమును లెక్క చేయక ఆ బిలముపై తమమడిమను ఉంచిరి. ఆసర్పము వారి కాలిని కఱచెను. దాని విషముచే వారికిచాల బాధకలుగుచుండినను హజ్రత్ రసూలువారి నిద్ర చెడునేమో అనిభీతిచే దేహమునుకదలింపక ఓపికతోనుండిరి. కానివారికన్నుల నుండికన్నీరు కాఱసాగెను. దైవికముగానొక కన్నీటి బిందువు హజ్రత్ రసూలువారి ముఖముపైఁబడఁగా పైగంబరులవారు నిద్రనుండి మేలుకొని అబూబకరుగారు కష్టపడుట చూచికారణము అడిగిరి. అపుడు అబూబకరుగారు "సర్పముకఱచెను" అని విన్నవింపఁగానే హజ్రత్ రసూలు వారు తమ దివ్యమైననోటి యుమ్మిని పాముకఱచినచోట తగిలించిరి. తత్క్షణమే విషముదిగి అబూబకరుగారికి స్వస్థత గలిగెను. పగలు మక్కాలోసంభవించు విషయములు రాత్రి వచ్చి తమ కు తెలుపవలెను అని తమ కుమారుడగు అబ్దుల్లాకును నియమించిరి. ఆతఁడు రాత్రిగుహాకు వచ్చి మక్కాలో జరుగునవి తెలుపుచుండెను. అబూబకరుగారి కుమార్తె బీబీఅస్మా రాత్రిచీఁకటిలో రొట్టె మొదలైన ఆహార పదార్థములను తీసికొనివచ్చి యిచ్చిపోవుచుండెను. ఆ మిరు కానిస అబూబకరు వారిమేఁకలమందను ఆ కొండ గుహా

చుట్టును మేఁపుచుఅక్కడపడినంత పాలువారికి నొసంగుచుం డెను. అట్లు వారు మూఁడుదినములు గుహలోనుండిరి.

హజ్రత్ పైగంబరులవారు మక్కావిడిచిన రాత్రియే మక్కాకాఫిర్లు, రసూలువారిని వధింపవలెనని గృహమునుముట్ట డించిరి. తెల్లవాఱగనే ఖురైషులు హజ్రత్ పైగంబరులవారు గృహములోలేనిది కనుగొని తమ కుట్రనిష్ఫలమాయెనే అని మండిపడి హజ్రత్ అబూబకరుగారి గృహమునకు పోయి తలుపుతట్టిరి. అబూబకరుగారి కుమార్తె అస్మాబయటికిరాఁగానే మీతండ్రి యెక్కడ అని అబూజెహాల్ గద్దించియడిగెను. నాకుఁదెలియదు అని ఆమెబదులు చెప్పెను. అది విని కఠినుఁడైన అబూజెహాల్ ఆమెనుచెంపకాయ వేసెను. ఆ దెబ్బచే ఆమెచెవికమ్మరాలిపడెను. అచటనుండి ఖురైషులు వెళ్లియూరిబయట వెదకుచు హజ్రత్ పైగంబరులవారు దాఁగి యున్నకొండ గుహనుసమీపించిరి. వారి చప్పుడువిని అబూ బకరుగారు చింతించిరి. అపుడుపైగంబరులవారుచింతింపకుఁడు. అల్లాః మనకుతోడు నున్నాఁడుఅని ధైర్యము చెప్పిరి. దేవు నాజ్ఞచేసాలెపురుగు ఆగుహమూతికి వలనల్లెను. పావురము గ్రుడ్లు పెట్టెను. ఖురైషులుగుహను సమీపించి అచటసాలె పురుగువలను గ్రుడ్లనుచూచి యెవరైన ప్రవేశించియుండినచో వలతెగి గ్రుడ్లుపగిలి యుండును గదా యనితలఁచి గుహలో ప్రవేశింపక వేఱుదారిని పోయిరి. దేవుఁడు రక్షింపఁదలచిన దుష్టులకుట్రసాగునే! అట్లాఖురైషులు వెతకివెతకి నిరాశులై ఎవఁడు ముహమ్మదునులేక అబూబకరును పట్టితెచ్చునో వానికి నూఱుఒంటెలు బహుమానమిచ్చెదము అని ప్రకటించిరి.

## —: గుహనుండి పయనమగుట :—

వారు మూడుదినములు గుహలోనుండి నాలుగవ దినము రాత్రి ఒంటెలనెక్కి మదీనాపురమునకు మఱుగు దారిని క్రీ. శ. 16-9-622 సోమవారము పయనమైరి. దారి చూపుటకు అబ్దుల్లాః బిన్ అరీఖతును ఏర్పఱచుకొనిరి. అతడు మార్గముచూపుచుండెను. అట్లుఒకదినము రాత్రి పయనమై పోవుచు ఒకచోట బసచేసిరి. అచ్చట పెద్దరాతిబండక్రింద నీడలో హజ్రత్ పైగంబరులవారుశయనించిరి. అంతలో అబూ బకరుగారు మేకపాలుతీసికొని పైగంబరులవారు మేలుకొనిన పిదపత్రాగనిచ్చిరి. అట్లువారు శత్రువుల తావులనుండితొలగి సురక్షితముగా మదీనాపురముచేరిరి. హజ్రత్ పైగంబరుల వారు అబూఅయ్యూబు అన్సారీగారి గృహములో అతిథిగా బసచేసిరి. హజ్రత్ అబూబకరుగారు హజ్రత్ ఖారిజాబిన్ జైదు గారి యింటిలోబసచేసిరి. మక్కానుండి మదీనాపురమునకు వచ్చినముసల్మానులకు అచ్చటినీరు గాలి సరిపడక కొందఱు జ్వర ముతో బాధపడిరి. వారిలో హజ్రత్ అబూబకరుగారికి జబ్బు అధికమయ్యెను. పైగంబరులవారు అదిచూచి దేవుని ప్రార్థిం పఁగా ఆ జ్వరము మదీనాలోలేకుండ పోయెను. హజ్రత్ అబూబకరుగారును ఇతర ముసల్మానులును స్వస్థతనొందిరి.

## —: సోదరత్వము :—

మక్కాపురమునుండి మదీనాపురమునకు వచ్చిన ముస ల్మానుల కొఱకు మదీనాలో నివసించుటకు గృహములును జీవ నోపాయములును కావలసియుండెను. దానికొఱకు పైగంబ

రులవారు మదీనాలోనుండు అన్సారీలను పిలిచి మక్కానుండి వచ్చిన ముహాజిర్లు మీసహోదరులు. మీరు వారిని భరింప వలెను. అనియుపదేశించి ఒక్కొక్క అన్సారికి ఒక్కొక్క ముహాజిరుని అప్పగించిరి. అందు హజ్రత్ అబూబకరుగారిని హజ్రత్ ఖారిజాబిన్ జహీరిగారికి అప్పగించిరి. అన్సార్లుఅనగా సహాయులు. ముహాజిర్లు అనగా జన్మదేశమును వదలిన వారు. మదీనావారు మక్కానుండివచ్చిన వారికితోడుపడి సహాయము చేసినందులకు వారికి అన్సారులు అనుబిరుదము గలిగెను.

## —: మసీదుకట్టడము :—

మదీనాపురములో దినదినము ముసల్మానుల సంఖ్యవృద్ధి పొందుచుండెను. అందఱుచేరికూడి నమాజుచేయుటకు ప్రత్యేక ముగ గృహములేకుండెను. పైగంబరులవారున్న గృహము సమీపమున ఒకబీడుస్థలముండెను. అదితండ్రిలేని యిద్దఱు బిడ్డలది. వారిద్దఱు భూమినిఉచితముగా నిత్తుమని విన్నవించిరి. కాని పైగంబరులవారు దానికి సమ్మతింపక వెలకు తీసికొనిరి. ఆవెల హజ్రత్ అబూబకరుగారు ఒసంగిరి. అట్లు మదీనాపుర ములోచేరిన తరువాత మొట్టమొదట ధనముఖర్చుచేసి ఇస్లామ్ సేవచేసి అబూబకరుగారు ధన్యులైరి. ఆ మసీదుకట్ట డములో హజ్రత్ అబూబకరును ఇతరులతోఁబాటుకలిసి చాల కృషిసలిపిరి.

## —: ధర్మయుద్ధములు :—

హజ్రత్ పైగంబరులవారును వారిశిష్యులును ఖురై షులు పెట్టుచున్న బాధలకు సహించితుదకు మున్నాఱు మైళ్ల

దూరముననున్న మదీనాపురమునకువచ్చి చేరి శాంతముతో నుండిరి. కాని మక్కాఖురైషులు తమ విరోధమును విడువక యెట్లైన ముసల్మానులను నాశముచేయవలెనని కుట్రలు చేయుచు ముసల్మానులతో ననేక యుద్ధములు సలిపిరి. ముస ల్మానులుకూడ విధిలేక ధర్మయుద్ధములుచేసిరి. అన్ని యుద్ధ ములలోను హజ్రత్ అబూబకరుగారు పాలుగొని తమ ధైర్య సాహసములను చూపిరి. హజ్రత్ అబూబకరుగారు పైగంబ రులవారి వెంట అన్ని యుద్ధములో పాలుగొనిరి. ఆయుద్ధముల వివరము జగత్ ప్రవక్త అను పైగంబరులవారి దివ్యచరిత్ర ములో చదువునది. గ్రంథవిస్తరభీతిచే వదలు చున్నాము. కొన్ని కారణములచే ఒహుదు, హునైను యుద్ధములలో కొం దఱు ముసల్మానులు యుద్ధభూమి వదలవలసి వచ్చెను. కాని అట్టి స్థితిలోఁగూడ హజ్రత్ అబూబకరుగారు మహాధైర్య శౌర్యములతో యుద్ధరంగమందు హజ్రత్ పైగంబరుల వారికి బాసటగా నిలిచియుండిరి. హజ్రత్ పైగంబరులవారు గావించిన ధర్మయుద్ధములలో తబూకు యుద్ధము ఆఖరు యుద్ధము. అందులకు చాల ధనము, బలము కావలసి యుండెను. దానికి గూర్చి పైగంబరులవారు ప్రకటించిరి. హజ్రత్ అబూ బకరుగారు తమ యింటి సొత్తు అంతయు చందాగా నిచ్చిరి. అప్పుడు హజ్రత్ పైగంబరులవారు "ఓఅబూబకరు! మీరు మీ ఆలుబిడ్డలకుఁగాను ఏమి వదలినారు." అని ప్రశ్నింపఁగా "నాఆలు బిడ్డలకుఁగాను దేవుఁడును ఆతని ప్రవక్తయు చాలు ను"అని విన్నవించిరి. చూచితిరా! హజ్రత్ అబూబకరుగారి

యందున్న స్వార్థత్యాగ భావము! దేవునియందును పైగంబరులవారి యందును వారికిఁగల భక్తివిశ్వాసములు.

—: కాబాయాత్ర నాయకత్వము :—

హిజ్రీ యెనిమిదవయేఁట మక్కాపురము జయింపఁబడినను కాఫిర్లు కాబాయాత్ర (హజ్) చేయుచునే యుండిరి. ఇంకను దేశములో పూర్తిగా శాంతము కలుగక యుండెను. అందుచే ముసల్మానులును కాఫిర్లునుకలిసి కాబాయాత్రచేయుచుండిరి. హిజ్రీ తొమ్మిదవయేఁట దేశములో పూర్తి శాంతము గలిగెను. అందుచే హజ్రత్ పైగంబరులవారు తబూకునుండి మరలి వచ్చినపిదప మదీనానుండి 300 మంది శిష్యులను కాబాయాత్రకొఱకు జూఖాదా నెలలో హజ్రత్ అబూబకరుగారికి నాయకత్వము నొసంగి పంపిరి. వారి వెంబడి హజ్రత్ అలీగారిని ప్రకటన గావించుటకై నియమించి పంపిరి. హజ్రత్ అబూబకరుగారు మక్కాపురముచేరి కాబాయాత్ర (హజ్) యొక్క ఆచారములను ప్రజలకుఁ దెలిపిరి. అపుడు హజ్రత్ అలీగారు సూరయే బరాఅతు యొక్క నలువది వాక్యములు చదివి యాత్రికులకు వినిపించి "ఇప్పటినుండి కాఫిర్లు కాబామసీదులో ప్రవేశింపఁగూడదు. ఎవ్వరును దిగంబరులై కాబాయాత్ర చేయఁగూడదు. కాఫిర్లతో గావింపఁబడియున్న యొడంబడికలు 4 నెలల వఱకుండును. దాని పిదప నవి చెల్లవు" అని ప్రకటించిరి. హజ్రత్ అబూబకరుగారును ముసల్మానులును కాబాయాత్ర ముగిసిన పిదప మదీనాపురమునకు వచ్చి చేరిరి.

## హజ్రత్ పైగంబరులవారు పరలోకము చేరుట
## హజ్రత్ అబూబకరుగారిని ఖలీఫాగా నెన్నుకొనుట

హిజ్రి పదియవయేట హజ్రత్ పైగంబరులవారు కాబాయాత్రికుఁ బోయిరి. వారివెంట హజ్రత్ అబూబకరు గారు కూడ నుండిరి. ఆయాత్రనుండి మదీనాకు మరలివచ్చిన పిదప హజ్రత్ రసూలువారు వివరముగా నొకయుపన్యాసము (ఖుత్బా) చేసిరి. అందు హజ్రత్ రసూలువారు "దేవుఁడు ఒక సేవకునకు ఇహలోక సౌఖ్యమో పరలోకసౌఖ్యమో యొక దానినెన్నుకొనుటకై అనుజ్ఞ నిచ్చియున్నాఁడు. కాని ఆసేవకుఁడు దేవుని సన్నిధిని పరలోక సౌఖ్యమును సమ్మతించెను." అని పలికిరి. అది విని హజ్రత్ అబూబకరుగారు ఏడ్వసాగిరి. అది చూచి ఇది యేడ్చుటకు సమయమా అని ప్రజలు చాల ఆశ్చర్యపడిరి. కాని హజ్రత్ అబూబకరుగారు "ఆసేవకుఁడు" హజ్రత్ రసూలువారే అని గ్రహించి వారు శీఘ్రములో ఇహలోకము వీడిపోవుదురు అని దుఃఖముతో నేడ్చిరి. ఈభావము సామన్యజనులు గ్రహింపక ఆశ్చర్యపడిరి.

ఆయుపన్యాసము చేసిన పిదప తత్క్షణమే హజ్రత్ రసూలువారు జబ్బుపడిరి. జబ్బు దినదినము హెచ్చసాగెను. తుదకు పైగంబరులవారు మసీదునకుఁ గూడ రాఁజాలరైరి. అపుడు హజ్రత్ పైగంబరులవారు, నమాజు చేయించుటకై హజ్రత్ అబూబకరుగారికి సెలవిచ్చిరి. ఇమామత్ (నమాజు చేయించుట) చాలగొప్పపదవి. ఇతరులు ఈ గౌరవమును చూచిసహింపలేక అబూబకరుగారిని గూర్చి అసూయవహిం

తురేమో అనిబీబీఆయిషాగారికి భీతిగలిగి "మానాయనగారు చాల మెత్తని హృదయముగలవారు. కావున ఈ గొప్పపదవికి హజ్రత్ ఉమరుగారికి నియమించుట మంచిది"అని పైగంబరులవారితో విన్నవింపఁగా హజ్రత్ రసూలువారు అట్లుకానేరదు. అబూబకరే నమాజుచేయింపవలెనని నొక్కిపలికిరి. పైగంబరులవారి యుత్తరువు హజ్రత్ అబూబకరుగారికిఁ దెలియగానే వారు హజ్రత్ ఉమరుగారితో మీరు నమాజుచేయించుడు అని పలుకఁగా హజ్రత్ ఉమరుగారు "మీరు నాకంటె నెక్కువగా దీనికి అర్హులు. కావున మీరే నమాజుచేయించుఁడు అని పలికిరి. తుదకు విధిలేక హజ్రత్ అబూబకరుగారు అప్పటినుండి నమాజుచేయించుచుండిరి. ఒకదినము హజ్రత్ అబూబకరుగారు నమాజుచేయించుచుండఁగా హజ్రత్ రసూలువారు, హజ్రత్ అలీ హజ్రత్ ఫజల్ బిన్ అబ్బాస్ గారి సహాయమున మహాకష్టముతో మసీదునకువచ్చిరి. అది చూచి అబూబకరుగారు వెనుకకురాఁదలఁచిరి. కానిహజ్రత్ రసూలువారు అట్లువలదు అని సంజ్ఞచేసి హజ్రత్ అబూబకరుగారికుకు ప్రక్కనకూర్చుండి నమాజుచేసికొనిరి. రబీఉల్ అవ్వల్ నెల 12 వ తేది సోమవారమునాఁడు ప్రాతఃకాలమున హజ్రత్ అబూబకరుగారు నమాజుచేయించుచుండిరి. అపుడు పైగంబరులవారు తామున్నగృహములోని తెరనెత్తి ముసల్మానులు నమాజుచేయుట చూచి సంతోషముతో చిఱునవ్వు నవ్విరి. హజ్రత్ అబూబకరుగారు, అది చూచి పైగంబరులవారు నమాజునకు వత్తురేమోఅని తలఁచి వెనుకఁబోఁదలఁచిరి. కాని హజ్రత్ రసూలువారు "నమాజుపూర్తిచేయుఁడు అని తమ

చేతితో సైగచేసి మరల తెరవేసికొనిరి. హజ్రత్ రసూలు వారికి కొంచెము నెమ్మదిగానున్నందున నమాజుముగిసిన పిదప పైగంబరులవారి సెలవు తీసికొనితమగృహస్థులుండు 'సుఖ్' అను చోటికి అబూబకరుగారుపోయిరి. కాని అబూబకరుగారు 'సుఖ్' నుండి తిరిగివచ్చునంతలో పైగంబరులవారు పరలోకము చేరియుండిరి. ముసల్మానులందఱు దుఃఖసముద్రములో మునిఁగి మసీదునకు నెదుట గుమికూడియుండిరి. అబూబకరు గారికి హజ్రత్ రసూలువారివార్త తెలియఁగానే వారు మహా దుఃఖముతో నేరుగా నెవరితోనైన మాటలాడక బీబీఆయిషా గారి గృహమునకుఁబోయి పైగంబరులవారి ముఖముపైనున్న గుడ్డనుదీసి ఆదివ్యమైన ముఖమును దర్శించి నుసటిపై ముద్దిడి కొని మనశ్శాంతి గలిగినపిదప బయటికి వచ్చిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు పరవశులై పైగంబరులవారి మరణము గూర్చి నిశ్చయింపక ఖడ్గముదూసి "ఎవరు పైగంబరులవారు పరలోకము చెందిరి. అని చెప్పుదురో వారిని ఖడ్గముతో నఱుకు దును" అని పలుకుచుండిరి. హ్రజత్ అబూబకరుగారు ఈ స్థితిని చూచి "ఓఉమరు! మీరు కూర్చుండుఁడు" అని పలికిరి. కాని ఉమరుగారు తమపరవశత్వములో వారి మాటనుగమనించ లేదు. అపుడు హ్రజత్ అబూబకరు కొంచెముదూరముతొలఁగి దుఃఖసముద్రములో మునిఁగియున్నముసల్మానుల నుద్దేశించి యిట్లుబోధించిరి:–ఓజనులారా! ఎవరు పైగంబరులవారి నారాధించుచుండిరో వారిపుడు పైగంబరులవారు పరలోకము చెందిరని తెలిసికొనవలెను. మఱెవరు దేవునే యారాధించుచుండిరో వారు దేవుఁడు చావనివాఁడు, అని తెలిసికొనవలెను అని

పలికి ఖురానెషరీఫులోని వాక్యమునిట్లు పఠించిరి. [వ-మా-ము హమ్మదున్ ఇల్లారసూలున్-ఖద్ ఖలత్ - మిన్-ఖబ్-లిహిర్-రుసులు-అఫ-ఇమ్-మాత-ఔ-ఖతి-లన్-ఖలబ్ - తుమ్-అలా-అఖ్ఖాబికుమ్-వ-మన్-యన్-ఖలిబ్-అలా-అఖి-బైహి ఫలన్-యఝుర్-రల్లాహ-షైఅన్-వస-యజ్-జిల్లా హుష్-షాకిరీన్ [ఆలెఇమ్రాన్ కాండము 4.] "ముహమ్మద్ కూడ దేవుని ప్రవక్తయే. పూర్వముకూడ ననేక ప్రవక్తలుగడచిరి. ఆయన(ముహమ్మద్) మరణించినలేక వధింపఁబడిన మీరుమత భ్రష్టులగుదురా! ఎవరుమతభ్రష్టులగుదురోవారు రవంతయు దేవునికి హానిచేయలేరు. దేవుఁడుకృతజ్ఞతసలుపు వారికిపుణ్యా ములొసంగును"ఆపలుకులు విని ముసల్మానులు, ఉమరుగారును శాంతివహించిరి. ఆఖురాను వాక్యమునువిని అది అపుడేవచ్చి నట్లువారికితోచెను.

## —: బనీసాఇదాకూటము: —

హజ్రత్ పైగంబరులవారు పరలోకము చేరిన పిదప వారికి ప్రతినిధిగ నెవ్వరినెన్నుకొనవలెను అను ముఖ్యమైన సమస్యయేర్పడెను. మదీనా పురములోననేకులు వంచకులుం డిరి. కావున సమస్యఅతిశీఘ్రముగా పూర్తికావలసియుండెను. లేనిచో వంచకులు ముసల్మానుల యందున్న ఐకమత్యమును చెడగొట్టుదురనుభీతి యుండెను. దీనికిఁగాను అన్సారులు బనీసా ఇదాకూటములో కూడి ఖిలాఫతును గూర్చి చర్చింపసాగిరి. అన్సారులకు సాదుబిన్ ఉబాదాగారు సర్దారుగానుండిరి. మొట్ట మొదట సాదుగారునిలిచి అన్సారులు ఇస్లామునకు చేసినసేవను

గూర్చిపలికి హజ్రత్ పైగంబరులవారి ఖిలాఫతునకుఅన్సారులు ఎక్కువగా అర్హులుఅనిరి. అందుసభకూడిన వారందఱు "మీరు సత్యముపలికితిరి'' అని వారిమాటను సమ్మతించిరి. అందుఒకరు "ముహాజిర్లుదీనినిసమ్మతింపక తాము హజ్రత్ పైగంబరులవారి బంధువులు. కావున ఖిలాఫత్ మాకు చేరవలెను అని పలికినచో ఏమగును"అని పలుకఁగా"అన్సారులలోనొకఁడు ప్రతినిధిగాను ముహాజిరులలో నొకఁడు ప్రతినిధిగాను కావలెను."అని మఱొకరుపలికిరి. ఈ విషయము హజ్రత్ అబూబకరుగారికిఁదెలిసి హజ్రత్ ఉమరుగారిని వెంటతీసికొని బనీసాయీదాకూటమునకువచ్చిరి. హజ్రత్ ఉమరుగారు ఏదోచెప్పఁదలచిరి. కాని హజ్రత్ అబూబకరుగారు వారినివలదు అని ఆపివేసితాముచాల నెమ్మదిగా నొక యుపన్యాసమునిచ్చిరి. అందు మొట్టమొదట ముహాజిర్లు ఇస్లామునకుఁగాను గావించిన త్యాగములను సేవను వివరించి అన్సారుసహోదరులలోనుండు త్యాగభావమును భక్తి విశ్వాసములును చాల పొగడిరి. ఆపిదప ఘనతను సుగుణములను బట్టిచూచిన ఉభయులును ఒకరికొకరు తగ్గినవారుకారు. కాని హజ్రత్ రసూలువారు "అల్ అఇమ్మతు మిన్ ఖురైష్" ఇమామ్(నాయకులు) ఖురైషులుకావలెను అని యుపదేశించి యున్నారు కాఁబట్టి ఓఅన్సారులారా! ఖలీఫాముహాజిర్ల నుండి కావలెను. మఱి మంత్రులు మీనుండికావలెను. ఖిలాఫత్ యొక్క ముఖ్యకార్యములలో తప్పక మీఅభిప్రాయము (సలహా) గ్రహింపఁబడును అన్ని నిశ్చయించుఁడు అని పలికిరి. అపుడు ఖజ్రజ్ వంశమునకు చేరినవారు ఒక అన్సారీలేచి ముహాజిర్లకు మేముఖలీఫాఅగుట సమ్మతము కానిచో మీలో నొక

డును మాలోనొకండును ఖలీఫా కావలెను అని పలికెను. ఈ అభిప్రాయముచాల తప్పుగదా! ఇద్దఱు ఖలీఫాలు ఎట్లుకాఁ గలరు? కావున హజ్రత్ ఉమరుగారు దీనిని చాలకఠినముగా ఖండించిరి. ; ఆపిదప అబూఉబైదాబిన్ జర్రాహ "ఓ అన్సారు లారా! ప్రప్రథమమున మీరేఇస్లామునకు బలము నొసంగితిరి. ఇపుడు మీరేదాని బలహీనతకు కారకులు కాకుండుఁడు" అని పలికిరి. అదివిని ఖజ్రజ్ వంశమునకుచేరిన బషీరు బిన్ సాదు లేచి తమవంశమువారి నుద్దేశించి "ఓ అన్సారులారా! మేము ఇస్లామునకు సేవదేవుని ప్రీతిపడయుటకు పైగంబరులవారికి విధేయులై చేసితిమి. ఇందుఒకరికి ఉపకారము చేసితిమి అని పలుకుటకు అవకాశములేదు. ఇస్లామ్ సేవకు బదులుగ ఇహ లోక సౌఖ్యములను కోరుటసరికాదు. వినుఁడు: హజ్రత్ పైగంబరులవారు ఖురైషువంశమునకు చేరినవారు. కావున ఖురైషుసహోదరులు ఖిలాఫతునకు అర్హులు. దేవునిసాక్షి! ఈ విషయమందు వాదులాటయుక్తముకాదు. దేవునికి భయ పడుఁడు. ఖురైషులను విరోధింపకుఁడు"అని పలికెను. అన్సారు లలోనే కొందఱు ఖురైషుల పక్షమునమాటలాడిరి. కావున అన్సారులు మఱిమాటలాడక యూరకుండిరి. ఖురైషులలోనే యొకరిని ఖలీఫాగా నెన్నుకొనవలెనని తీర్మానమాయెను. కాని ఖురైషులలో నెవరిని ఎన్నుకొనవలెనను సమస్యయుండెను. అపుడు అబూబకరుగారు సహోదరులార! ఉమరుగారు లేదా అబూఉబైదాబిన్ జర్రాహగారు ఖలీఫాకావలెను. కావునవీరిద్ద ఱిలో మీరు కోరువారిని ఎన్నుకొనుఁడు అని పలికిరి. తత్క్షణమే వారిద్దఱులేచి ఏకగ్రీవముగా ఓసిద్దీఖు! (అబూబకరుగారి బిరు

దము) మీరుండఁగ మేమాలాటి ధైర్యము చేయఁగలమా! మీరు ముహాజిర్లందఱికంటెను చాల శ్రేష్ఠులును గొప్పవారును సౌరు గుహలో మీరు హజ్రత్ పైగంబరులవారి వెంటనుంటిరి. హజ్రత్ రసూలు వారి జీవితకాలములో మీరు నమాజు చేయించితిరి. ఇస్లాములో చాలముఖ్యమైనది నమాజు. దాని నాయకత్వము (ఇమామత్) మీరువహించితిరి. కావున ఇట్టి ఘనతగల వారగు మీరుండగా నితరులెవరును ఖిలాఫతునకు అర్హులుకానేరరు. కావున మీరుమీచేతిని చాచుఁడు. మొట్ట మొదట మేమే మీ ఖిలాఫతును సమ్మతించి మీచేతిలో చెయ్యి వేసిశపథము (బైఅత్) చేయుదముఅని పలికిరి. కాని హజ్రత్ అబూబకరుగారు తమ చేతినిచాచలేదు. ఇది చూచిహజ్రత్ అబూబకరుగారు సమ్మతింపనిచో కార్యము చెడిపోవునని భీతిల్లి తత్క్షణమే హజ్రత్ ఉమరుగారు తమ చేతిని హజ్రత్ అబూబకరుగారి చేతిలోవేసి శపథముచేసిరి. ఆసభలో హజ్రత్ అబూబకరుగారి కన్నవయస్సులోను ఘనతలోను ఎక్కువ గానున్నవారెవరు లేకుండిరి. కావునఅందఱు ఏకీభవించి హజ్రత్ అబూబకరుగారిని ఖలీఫాగాఎన్నుకొనుటకు తీర్మానించుకొని శపథము (బైఅత్) చేసిరి. ఇట్లు దేవుని యనుగ్రహము వలన ఏలాటి ఆందోళనము లేకుండ హజ్రత్ అబూబకరుగారు ఖలీఫాగానెన్నుకోఁబడిరి. ఆపిదపఅందఱును హజ్రత్ పైగం బరుల వారిని సమాధిగావించు పనులలోనిమగ్నులైరి.

హజ్రత్ రసూలువారి సమాధికార్యము ముగిసిన పిదప రెండవదినము అందఱు ముసల్మానులు మసీదులోసమావేశమై హజ్రత్ అబూబకరుగారి ఖిలాఫతునుసమ్మతించి(బైఅత్)చేసిరి.

ఆపిమ్మట హాజ్రత్ అబూబకరుగారు ఖలీఫాపదవి వహించి మసీదులోని మింబరు (మెట్లుగలతిన్నె) పైకూర్చుండి తాము ఇఁక మీఁదనెట్లు ఖిలాఫత్ కార్యమును నిర్వహింపఁగలరో వివరించుచునిట్లు ఉపదేశించిరి. "ఓజనులార! నేను మీకు అధికారిగా నియమింపఁబడితిని. కాని నేను మీకంటె శ్రేష్ఠుఁడను కాను. నేనుమంచి కార్యము చేసినచో మీరు నాకు తోడు పడుఁడు. మఱి నేను తప్పుచేసినచో మీరునన్ను దిద్దుఁడు (సవరించుఁడు.) చూడుఁడు సత్యము అమానత్ (నమ్మకము) నకు పాత్రము. అసత్యము నమ్మకద్రోహము. ఇన్షాఅల్లాః (దేవుఁడుకోరినచో) మీలోనెవఁడు బలహీనుఁడుగా నుండునో వారి హక్కు వానికి నేను ఇప్పించునంతవఱకు వాఁడు నాయొద్ద బలముగలవాఁడు. మఱెవఁడు మీలోబలముగలవాఁడో నేను వాని యొద్దనుండి పరులహక్కును తీసిఇప్పించునంత వఱకు వాఁడు నాయొద్దబలహీనుఁడు(ఇన్షాఅల్లాః). ఏజాతివారు దేవుని మార్గమందు ధర్మయుద్ధము (జిహాద్) చేయుటవదలి పెట్టుదురో వారిని దేవుఁడు అవమానపఱుచును. ఏజాతివారిలో అసహ్యకార్యములు వ్యాపించునో దేవుఁడు ఆజాతివారిలో ఆపదలు వ్యాపింపఁజేయును. వినుఁడు. నేను దేవుని యందును ఆతని పవిత్రయందును విధేయతగలిగి యున్నంతవఱకు మీరును నాకు విధేయులై యుండుఁడు. ఒకవేళ నేను దేవునికిని ఆతనిపవిత్రకును అవిధేయుఁడను అయితినేని మీరును నా మాటవినకుఁడు. మీరు నమాజునకు లెండు. దేవుఁడు మిమ్మును కరుణించుగాక!

## —: హజ్రత్ అలీగారు ఆలస్యము చేయుట :—

హజ్రత్ అలీగారును వారి కొందఱు బంధువులును బైఅత్ చేయుటలో ఆలస్యము చేసిరి. అందులకు కొన్ని కారణములు గలవు. హజ్రత్ పైగంబరులవారు పరలోకము చేరినందున వారి దుఃఖములోను వారి కఫనుదఫను (సమాధి) చేయుటలోను నిమగ్నులై ప్రిప్రిథమున బైఅత్ చేయలేక పోయిరి. మఱియు హాషిము వంశమువారు తాము హజ్రత్ పైగంబరుల వారికి సమీపబంధువులము. రసూలువారి పిదప ఖిలాఫత్ పదవి మాకులభింపవలెనని తలఁచియుండిరి. హజ్రత్ అలీకూడ అటులే భావించి వారితోఁబాటు బైఅత్ చేయకుండిరి. హజ్రత్ రసూలు వారి పిమ్మట హజ్రత్ అలీగారు ఖురాను గ్రంథమును సంపూర్ణముగ కంఠోక్తి చేయునంతవఱకు నమాజునకుఁదప్ప నితర పనులకుఁగాను తాను బయటికి రాను అని ప్రతిజ్ఞపూని యుండిరి. ఆ పిదప హజ్రత్ పైగంబరులవారి ఆస్తి పంచిపెట్టు విషయములో కొంత భేదాభిప్రాయము గలిగెను. హజ్రత్ రసూలు వారికిచేరిన తోఁటలు మదీనాలోను ఖైబరులోను ఉండెను. దానిఁగూర్చి హజ్రత్ రసూలువారి కుమార్తె బీబీఫాతిమాయును వారి పినతండ్రి హజ్రత్ అబ్బాసుగారును హజ్రత్ అబూబకరుగారితో విన్నవించిరి. అపుడు హజ్రత్ అబూబకరుగారు, పైగంబరుల వారి యాస్తి వారి బంధువులకు పంచిపెట్టఁబడదు. అది వఖఫు (దానము) అగును. అందు అందఱు ముసల్మానులకు హక్కు గలదు. మఱియు హజ్రత్ రసూలువారు "నహ్ను-మఆ్‌-షరుల్-అంబియాఇ-లా- నూరిసు మా-తరక్నహు-సేదఖేతున్

(మేము ప్రవక్తలము. మాయాస్తిలో వారసత్వము చెల్లదు. మేము వదలునది వఖఫు (దానము) అగును.) అని యుపదేశించి యున్నారు. కాఁబట్టి నేను మీకు పంచియియ్యలేను అని పలికిరి. దానివలన మానవ స్వభావముబట్టి బీబీఫాతిమాగారికి మనస్తాపముగలిగెను. కాని బీబీఫాతిమాగారు జబ్బుపడినపుడు హజ్రత్ అబూబకరుగారు వారింటికిఁబోయి మన్ననవేఁడగా బీబీఫాతిమాగారు మనస్తాపము వదలి వారిని మన్నించిరి. బీబీ ఫాతిమాగారి నోదార్చుటకు హజ్రత్ ఆలీగారు బైఅత్ చేయకుండిరి. కాని ఆఱు నెలలు గడచిన పిదప బీబీఫాతిమాగారు పరలోకము చేరిరి. అపుడు హజ్రత్ అలీగారు, హజ్రత్ అబూబకరుగారిని ఏకాంతమున రప్పించి "ఓసిద్దీఖు! మీఘనత మాకుఁదెలియును. మీరు మా అందఱికంటె శ్రేష్ఠులు. దేవుఁడు మీకొసంగిన ఖిలాఫత్ పదవిలో మాకు అసూయలేదు. మేము పైగంబరులవారి యింటివారము. సమీపబంధువులము. కావున ఖిలాఫత్ విషయములో మాహక్కు గలదు అని తలఁచి యుంటిమి. కాని మాహక్కు కొట్టఁబడినది అని పలికిరి. వారు పలుకుతీరు చాల సారవంతముగ నుండెను. అదివిని నంతనే హజ్రత్ అబూబకరుగారు కన్నీరు విడువసాగిరి. ఆపిదప హజ్రత్ అలీగారితో "దేవునియాన! నాబంధువుల కంటె హజ్రత్ రసూలువారి బంధువులు నాకు అధికప్రియులు. హజ్రత్ పైగంబరులవారి యాస్తివిషయము హజ్రత్ రసూలు వారి యుపదేశము ననుసరించి చేసితిని. అందు నేనేమియు స్వయముగాఁ జేయలేదు అని పలికిరి. అట్లు వారుభయులు పరస్పరము సంభాషించుకొన్న పిదప వారిద్దఱిలోనటి మనస్తా

పము లేకుండిరి. వారి మనస్సులు పరిశుభ్రములై ప్రేమతో నిండిపోయెను. ఆపిదప హజ్రత్ అలీగారు మసీదులో అందఱి సమక్షమున హజ్రత్ అబూబకరుగారి ఘనతనుగూర్చి పొగడుచు అబూబకరుగారి చేతిలో చెయ్యి వేసి శపథము(బైఅత్) చేసిరి. అపుడు హజ్రత్ అబూబకరుగారు కూడ హజ్రత్ అలీగారి విషయము ముసల్మానులందఱికిఁదెలిపి వారి తరఫున మన్నన వేఁడిరి.

—: హజ్రత్ అబూబకరుగారి ప్రభుత్వకాలము :—

హజ్రత్ అబూకరుగారు ఖలీఫాగా నియమింపఁబడిన పిదప వారు అనేక కఠిన సమస్యలను ఎదుర్కొన వలసివచ్చెను. అందు కొందఱు దుష్టులు తాము దేవునిప్రవక్తలమని అసత్య ప్రచారము చేయసాగిరి. మఱికొందఱు క్రొత్తగా ఇస్లాములో చేరి అందు స్థిరత్వము వహింపక మతభ్రష్టులై అల్లరికావించుచుండిరి. మఱికొందఱు జకాతు (విధిదానము) చేయక ఉపద్రవము చేయుచుండిరి. అందు ముఖ్యముగా ఉసామాగారి సైన్యమును సాగనంప వలసియుండెను. ఈసైన్యమునుగూర్చి కొందఱు దీనిని ఆపివేసి ముందు, దేశములో ఉపద్రవములు కావించుచున్న దుష్టులైన మతభ్రష్టులను, దొంగప్రవక్తలను దుండగీండ్రను అణఁచి వేయవలెనని అభిప్రాయ పడిరి. కాని హజ్రత్ అబూబకరుగారు దానిని సమ్మతింపక పైగంబరుల వారు నియమించినదానినేను రద్దుచేయలేను. అట్లు ఎన్నటికి కానేరదు. దేవునియాన! మదీనాపురము సంపూర్ణముగా ఖాలీ అయి మృగములువచ్చి నాకాళ్లను లాగుకొని పోవుచున్నను,

నేను ఈ సైన్యమునుపంపియే తీరెదను అని పలికియాసైన్యము సాగనంపుటకు నేర్పాటుచేసిరి.

## —: ఉసామాగారి సైన్యము :—

మూతాయుద్ధము(చూడుడుజగత్ ప్రవక్తపుట 174.)లో ఉసామాతండ్రిగారగు జైదుబిన్ హారిసుగారు వధింపఁబడి యుండిరి, వారినివధించిన వారికి ప్రతీకారము చేయుటకై హజ్రత్ పైగంబరులవారు హిజ్రీ 11—వ సం॥ సఫరునెల 26—వ తేదీన ఉసామాను సేనాధిపతిగా నియమించి సైన్యమునకు సిద్ధమగుటకై యాజ్ఞనిచ్చిరి. ఉసామాగారు సైన్యమును దీసికొని మదీనాపురమునకు బయట మఖాముచేసిరి. అపుడు వారి వయస్సు 17 సంవత్సరములు. అందుచేకొందఱు వారి సేనాధిపత్యమును గూర్చి సందేహించిరి. ఆవిషయము పైగంబరుల వారికిఁదెలిసి అతనితండ్రి యెట్లుసేనాధిపత్యమునకు యోగ్యుఁడై యుండెనో అటులే ఈతఁడు (ఉసామా)అర్హుఁడు అని ప్రజలను మందలించి సాగనంపిరి. కాని దానికిమఱునాఁడే పైగంబరుల వారుజబ్బుపడుటచే ఉసామాగారి దండయాత్రనిలిచి పోయెను. తుదకు హజ్రత్ రసూలువారి పిదప అబూబకరుగారు ఉసామాగారిసైన్యమును సాగనంపిరి. హజ్రత్ అబూబకరుగారు ఆ సైన్యమును సాగనంపుచు కొంత దూరమునడచి పోయిరి. ఉసామాగారు గుఱ్ఱముపై నెక్కిపోవుచు "ఓ ప్రవక్త వారి ఖలీఫా! మీరును గుఱ్ఱము నెక్కుఁడు. లేనిచో నాకుసెలవు నొసంగుఁడు. నేనుకూడనడతును"అని విన్నవింపఁగా దేవుని సాక్షి! ఆ రెండు మాటలలో నెద్దియును కానేరదు, యుద్ధవీరుఁడు

(గాజీ) దేవుని మార్గమందు పోవునపుడు ఒక్కొక్క అడుగు నకు ఏడువందలు పుణ్యములు లభించును. అట్లుండ నేనుకొంత దూరము దేవుని మార్గమందునడచి నాకాళ్లకు దుమ్ముతగిలిన నష్టమేమి! అని యుపదేశించినడచియే సైన్యమును సాగనంపిరి. చూడుఁడు ఖలీఫాగారు, పిన్నవయస్సులోనున్న సేనాధిపతికి నొసంగిన గౌరవమును తాము వహించినవియమును! ఉసామా గారి సైన్యములో హజ్రత్ ఉమరుగారు కూడ నుండిరి. వారు ఖలీఫాకు సలహానిచ్చుటకుఁగాను మదీనాలోనుండవలసి వచ్చె ను. అందులకు హజ్రత్ అబూబకరుగారు ఉసామాగారితో తమ అక్కఱను తెలిపి ఉమరుగారిని మదీనాలోనుండు నట్లు సెలవు నియ్యవలెనని విన్నవించిరి. అపుడు ఉసామాగారు దీనికి సమ్మతించి ఉమరుగారు సైన్యముపీడి మదీనాలోనుండు నట్లు సెలవిచ్చిరి. చూచితిరా! ఖలీఫాగారికిఅధికారముండియు హజ్రత్ రసూలువారు నియమించిన సేనాధిపతి అధికారములో వారి గౌరవార్థము పాలుగొనలేదు.

—: హజ్రత్ అబూబకరుగారి ఉపదేశరత్నములు :—

హజ్రత్ అబూబకరుగారు ఉసామాగారిని సాగనంపుచు అమూల్యమైన యుపదేశముగావించిరి. అందుకొన్నిటినిచ్చట వ్రాయుదుము.చూడుఁడునమ్మిక ద్రోహముచేయరాదు. మోస పుచ్చ కూడదు. విజయధనమును దాఁచరాదు. పట్టుబడినవాని యంగములను కోయరాదు. ముసలివాండ్రను స్త్రీలనుబిడ్డలను వధింపరాదు. ఆహారమునకు అక్కఱ గలిగినపుడుతప్ప మేఁక లను ఆవులను ఒంటెలను కోయకూడదు. మీరు పోవునపుడు

మధ్యమార్గమందు కొందఱు ఇహలోకసౌఖ్యములను త్యజించి సన్యాసులుగా మఠములలోనివసించుచుందురు. అట్టివారిజోలికి మీరుపోఁగూడదు. ఈ ఉపదేశరత్నములను యుద్ధసూత్రము లుగా గ్రహింపఁబడినచో ఇప్పుడుకూడ రాక్షసత్వము, అ శాంతము చాలవఱకులోకములో లేకుండపోవును. ఉసామా గారి సైన్యము హిజ్రి 11,వ సం, రబీవుల్ అవ్వల్ నెల మొదటి తేదీని, మదీనాపురమునుండి బయలుదేఱెను. సిరియాసరిహద్దు లలో నున్న ఖుజా ఆశతు్రవును నిర్మూలించి జయముపొందిన నలువది దినముల పిదపతిరిగి మదీనాపురము వచ్చిచేరిరి. ఉసా మాగారి' సైన్యము సిరియా సరిహద్దులవఱకు పోవుటవలన ఇస్లా మునకు చాలప్రయోజనము కలిగెను. వంచకులును మతభ్రష్టు లును ''ముసల్మానుల బలముతగ్గలేదు. బలములేనిచో అంత దూరము దండయాత్ర జరుగనేరదు'' అని భీతిల్లి తమ దుష్ట త్వము మానుకొని మతభ్రష్టులైన పెక్కు వంశములవారు తిరిగి ఇస్లాములోచేరి ధృఢవిశ్వాసులైరి.

## —: మతభ్రష్టత్వమునకు కారణములు :—

హజ్రత్ రసూలువారు పరలోకముచేరిన వెంటనే అరే బియా దేశములో కొన్ని చోట్ల విశ్వాసములో స్థిరత్వములేని కొందఱు ఇస్లామునువదలసాగిరి. దానికి కారణములుఇట్లున్నవి.

(1) ఇస్లామునకు పూర్వము అరబ్బులు పలుశాఖలుగా చీలి యుండిరి. ఒక కట్టుబాటులేకుండెను. తమ యిష్టానుసార ముగా నడుచుకొను చుండిరి. కాని ఇస్లాములో చేరినపిదప ఒక కట్టుబాటునకును నియమమునకును వారుబద్ధులై యుండవలసి

వచ్చెను. అది వారికి భారముగాతోచుచుండెను. ఇస్లామ్‌మత బంధనము నుండి విదిలించుకొని వారు పాఱిపోవయత్నించిరి.

(2) ఇస్లామ్‌మత ముఖ్యధర్మములలో విధిదానము(జకాతు) ఉన్నది. ప్రతి సంవత్సరము శక్తిగలవారి యొద్దను తీసికొని నిఱుపేదలకు నొసంగఁబడును. ఈ దానమువలన ధనముఒక చోటనేనిలిచియుండక అందఱకును ఉపయోగపడును. దేశమున బీదతనము చాలవఱకు తగ్గిపోవును. ఇట్టి ధర్మముకూడ క్రొత్తగా ఇస్లాములో చేరిన అరబ్బులకు భారముగాతోచి దానినుండి తప్పించుకొనుటకు వారు పూనిరి.

(3) మద్యపానము అరబ్బులకు ఉగ్గుపాలు వంటిది. జూదమాడుట వారికి చాల ప్రియమైనది. వ్యభిచారము ఒక వినోదముగా నుండెను. ఇవన్నియు ఇస్లామ్ మతములో చాల నిషిద్ధములు. అందులకు చాల కఠినశిక్షయును గలదు. ఈకట్టుబాట్లు అరబ్బులకు భారముగాతోఁచి పూర్వమువలె విచ్చలు విడిగా నుండవలెనని యత్నించిరి.

ఇస్లామునకు ముఖ్యస్థానములగు మక్కామదీనాపురముల నుండి చాల దూరములోనున్న యమను నజదు మొదలగు దేశస్థులు అట్లుచేసిరి. వారికి హజ్రత్ పైగంబరులవారి దర్శనమును వారి సాన్నిధ్యమున ఉండు అవకాశమును లభింపనందున వారికి ఇస్లాములో ధృఢవిశ్వాసము కలుగక యుండెను. కాని వారు ఇస్లాము ప్రభావమును బలమును చూచి ఇస్లాములో మాత్రము చేరియుండిరి. ఇంకను వారి హృదయము

లలో భక్తి నెలకొనక యుండెను. ఇట్టి వారిని గూర్చియే ఖురానె షరీఫులో నిట్లుగలదు:—

ఖాలతిల్-అ'త్-రాబు-ఆమన్నా - ఖుల్-లమ్-తూమి నూ-వ-లాకిన్-ఖూలూ-అస్-లమ్నా-వ - లమ్మా-యద్-ఖు లిల్-ఈమాను-ఫీ-ఖులూ-బికుమ్.

పల్లెటూర్ల అరబ్బులు "మేము విశ్వాసము వహించితిమి" అని పలుకుచున్నారు. "మీరువిశ్వాసము వహింపలేదు. కాఁబట్టి మీరు "మేము లోఁబడితిమి" అని పలుకుఁడు. మఱి మీ హృదయములలో నింకను విశ్వాసము చొరలేదు. అని ఓ ప్రవక్త! పలుకుము. పై కారణములకు తోడుగ కొందఱు హజ్రత్ పైగంబరులవారి జయమును చూచి ప్రవక్త పదవి, లోకవృద్ధికి ఒక వృత్తిగా నెంచుకొని తాము కూడ ప్రవక్తలమని అబద్ధము లాడుచు ప్రజలను మోసపుచ్చ సాగిరి. దృఢవిశ్వాసములేని ప్రజలు వారి మోసములకు గుఱియైరి.

—: ఖలీఫాగారి కృతనిశ్చయము :—

దేశములోని యుపద్రవములను అణఁచి సంపూర్ణముగ శాంతి గలుగఁ జేయుటకై హజ్రత్ అబూబకరుగారి ధైర్య కృతనిశ్చయమే కావలసి యుండెను. అట్టి స్థితిలో దాని గూర్చి అబూబకరుగారు ముసల్మానుల సలహా నడిగిరి. అందు కొందఱు "ఎవరు జకాతు ఇయ్యక తిరస్కరించుచున్నారో వారి విషయమున నెమ్మదిగా ప్రవర్తింప వలెను

అని సలహానిచ్చిరి. అపుడు అబూబకరుగారు "దేవునిసాక్షి! ఎవఁడైన తాను హజ్రత్ పైగంబరుల వారి కాలములో నిచ్చుచున్న ఒక మేఁకపిల్లనైనను ఇయ్యక తిరస్కరించినచో వానితో ధర్మయుద్ధము చేసి తీరెదను"అని వెల్లడించిరి. ఈ విషయము తెలిసి జకాతు ఇయ్యక తిరస్కరించుచున్న వారలు స్వయముగా ఖలీఫాసన్నిధికి వచ్చి మన్నన వేఁడి జకాతును యథాప్రకారముగా చెల్లింపసాగిరి. దీని వలన ఇతర దుష్టులకు బుద్ధిగలిగెను. ఆపిదప అందఱు సహాబా (పైగంబరులవారి శిష్యులు) హజ్రత్ అబూబకరుగారు నిశ్చయించుకొన్నది చాల ఉచితము అని యొప్పుకొనిరి.

దేశములో శాంతము నెలకొల్పి దుష్టులను శిక్షించుటకై కొంత సైన్యమును అచ్చటికి పంపిరి. సైన్యములు బయలుదేఱక పూర్వము దేశమంతటను మత భ్రష్టులను ఉద్దేశించి "ఎవరు తమ దుష్టత్వమును అల్లరిని మానుకొని తిరిగి ఇస్లామ్ మతములో చేరుదురో వారి తప్పిదము మన్నింపఁబడును. వారికేలాటి శిక్ష విధింపఁబడదు. వారు మతసహోదరులగుదురు" అని ప్రకటించిరి. అబూబకరుగారు తమ సైన్యనాయకులకిట్లు ఉత్తరువు జారీచేసిరి:

"ప్రతిస్థితిలోను యుద్ధవీరులు దేవునికి భయపడుచు దేవుని యాజ్ఞలను అనుసరింపవలెను. ఇస్లామ్ మతమును వదలి సైతాను వలలో చిక్కుకొన్న వారితో ధర్మయుద్ధము సలుపవలెను. యుద్ధము సలుపుటకు పూర్వము ఇస్లామునుగూర్చి మతభ్రష్టులకు బోధచేయవలెను. ఆపిదప వారు

ఇస్లాములో చేరినచో వారితో యుద్ధమాడ కూడదు. కాని వారు ఇస్లాములోచేరక తిరస్కరించినచో వారుతిరిగి ఇస్లాము స్వీకరించునంతవఱకు వారిని మార్కొనవలెను. మతభ్రష్టులు తిరిగి ఇస్లాములో చేరినచో సైన్యాధికారి వారికి మతధర్మము లను గూర్చియు వారిపై ముసల్మానులకుగల హక్కులను గూర్చియు వివరముగా తెలుపవలెను. వారికి చెందవలసిన హక్కులు పూర్తిచేయవలెను. సైన్యాధికారి తన సైనికులు ఆతురపడకుండ నిదానముగా ఏలాటి యుపద్రవము (ఫసాదు) లేకుండ నడచుకొనునట్లు చేయవలెను. శత్రువుల గ్రామము లలో యోచనలేకుండ ప్రవేశింపఁ గూడదు. బాగుగా యో చించి ప్రవేశింపవలెను. లేనిచో ముసల్మానులకు నష్టము గలుగును. సేనాధిపతి మఖాము చేయునపుడును ప్రయాణము సాగించు నపుడును తనచేతిక్రిందనున్న వారితో చాల మృదు వుగాను మధ్యపద్ధతిగాను వర్తింపవలెను. వారి సౌకర్యములను చూడవలెను. వారితో చాల నెమ్మదిగా మాటలాడవలెను" అని నేను విధించుచున్నాను. ఆపిదప అందఱు సేనాధిపతులు తమతమ సైన్యములు తీసికొని తాముపోయి మార్కొన వలసియున్న శత్రుప్రదేశములకు పయనమై పోయిరి.

—: తలీహ తిరిగి ఇస్లాములో చేరుట :—

బనీఅసదు అను వారిలో తలీహా అను వాఁడొకఁడుం డెను. వాఁడు తాను దేవుని ప్రవక్తఅని పలుకసాగెను. బనీ అసదువారు వానిని విశ్వసించి వానికి లోఁబడిరి. బనీ అసదు వారికిని బనీతై అనువారికిని స్నేహపు టొడంబడిక యుండెను.

అందుకు బనీ తై వారుకూడ బనీఅసదు వారితో కలిసిపోయిరి. గత్ఫాను వంశము వారిలో ననేకులు కూడ వారిలో చేరిరి. అట్లు తలీహా గొప్పసైన్యము సమకూర్చుకొని నజదు ప్రాంతములో బజాఖా అనుచోట మఖాము చేసెను. తలీహాను మార్కొనుటకై హజ్రత్ ఖాలిద్ బిన్ వలీదుగారు తమసైన్యమును తీసికొని బయలుదేఱిరి. అప్పుడు మదీనాపురములో బనీతై వారికి నాయకులలో అదీ బిన్ హాతిమాగారుండిరి. ఈ విషయము వారికిఁ దెలిసి తమవంశమువారికి బుద్ధిచెప్పుటకు నాకు సెలవిచ్చినచో నేనుపోవుదును”అని అబూబకరుగారితో విన్నవింపఁగా వారు దానికిసమ్మతించి అదీగారిని బనీతైవారి యొద్దకుపంపిరి. అదీగారు పోయి తమవంశము వారికి బోధింపఁగావారందఱు తలీహాను విడనాడి ఇస్లాములోతిరిగిచేరిరి. ఇటులే అదీగారు జదీలాఅనువంశమువారికి బోధింపఁగావారు కూడ ఇస్లాములోచేరిరి. ఇఁక హజ్రత్ ఖాలిద్ గారు తమ సైన్యము తీసికొని బరాజా అనుచోటు చేరిరి. అచ్చట తలీహా సైన్యమును మార్కొనిరి. ఘోరయుద్ధము జరిగెను. తలీహా ఓడిపోవునను సూచనలు కనఁబడఁగానే బనూగత్ఫాను వారికి నాయకుఁడుగానుండి తలీహాకు సహాయుఁడుగానున్న ఉయైనా ఫజారీ అనునతఁడు తలీహా యొద్దకుపోయెను. అపుడు తలీహా దుప్పటిలో ముడుచుకొని తన సందేశము (వహీ) వచ్చుచున్నట్లుగ నటించెను. అపుడు ఉయైనా “నీకేమి? సందేశము వచ్చుచున్నది” అని అడుగఁగా తుదకు మాకే జయము లభించును అని పలికెను. అపుడు ఉయైనా తనకుటుంబమువారితో ఓ ఫజారా వారలారా! తలీహా అసత్యవంతుఁడు. మోసగాఁడు

ని పలికి యుద్ధరంగము వదలి తన జనులను తీసికొని తలీ
హను వీడిపోయెను. అపుడు తలీహా తనకు అపజయము
ప్పదు అని నిశ్చయించుకొని తన భార్యను వెంటతీసికొని
రియా దేశమునకు పాఱిపోయెను. ఆపిదప తనఅవిశ్వాసము
(కఫరు)ను వదలుకొని క్షమాపణ వేఁడుకొని తిరిగి భక్తి
ర్వకముగ ఇస్లాములో చేరెను. ఆపిదప తలీహా ఇరా
లో సంభవించిన ధర్మయుద్ధములలో పాలుగొని గొప్ప
ర్యమును ధైర్యమునుచూపి తాను ముందుచేసియున్న
పములకు పరిహారము చేసికొనెను.

—: మాలిక్ బిన్‌నువైరా వధింపఁబడుట :—

హజ్రత్ పైగంబరులవారు బనీతమీము వారిలో
యిదుగురిని నాయకులుగా నియమించి యుండిరి. అందు
ందఱు మతభ్రష్టులు అయిరి. వారిలో మాలిక్ బిన్‌నువైరా
నువాఁడుకూడ నుండెను. వాఁడు జకాతు నియ్యకుండ నిలిపి
వేసెను. వానికుటుంబములో ముసల్మానులుగానున్న వారితో
వాఁడు యుద్ధముచేయసాగెను. బనీతమీములోనే పరస్పరము
యుద్ధము జరుగుచుండగ బనీతగ్లిబుకుచేరిన ఒక స్త్రీ 'సజాహ'
ను నామె వారియొద్దకు వచ్చెను. ఆమె ముందు క్రైస్తవ
స్త్రీ. హజ్రత్ పైగంబరులవారి పిదప తాను దేవుని ప్రవక్త్రి
ని పలుకసాగెను. ఈఅరబ్బులలో అనేకులు దుండగీండ్రు
ఆమెతో కలిసిపోయిరి. తన బలమును హెచ్చుగాఁ జేసికొ
నుటకు ముసైలమాతో పెండ్లిచేసికొనెను. (ముసైలమాను
గూర్చి ఇఁకమీఁద వచ్చును.) ఈమె తన అనుచరులను

వెంటఁబెట్టుకొని మదీనాపురముపై యుద్ధము చేయుటకై బయలుదేఱెను. ఆమెపోవుచు బనీతమీము పురములకుచేరి మాలిక్ బిన్ నువైరాను స్నేహమునుగూర్చి సంధివార్త పంపెను. దానికి మాలిక్ సమ్మతించి యొప్పుకొని మదీనాపై దాడివెడలుటకుముందు బనీతమీములోనిముసల్మానులనుమార్చ వలెనని సలహానిచ్చెను. ఆమెదానికిసమ్మతించి బనీతమీము లోని ముసల్మానులతో యుద్ధము చేయసాగెను. ముసల్మానులు ఆమెను మార్చఁగను శక్తిలేనందున పాఱిపోయిరి. సజాహ తన సైన్యమును తీసికొని మదీనాపై దాడివెడలెను. కాని ఆమె 'నబాజు' అనుచోటు చేరఁగా నచ్చట బనీతమీము వారిలోనే యొక సంఘము వారితో యుద్ధము సంభవించెను. ఆబనీతమీము ఆమెసైన్యములోని కొందఱిని ఖైదీలుగా పట్టుకొనెను. తుదకు వారిమధ్య సంధికుదిరెను. అందు సజాహ మదీనాపై దాడినిమానుకొని మరలిపోవలసినది. వారివారి ఖైదీలను వదలిపెట్ట వలసినది అని తీర్మానింపఁబడెను. ఆపిదప 'సజాహ' మదీనాపై దాడివెడలక యమామా దేశమునకు వెళ్లిపోయెను. అంతలో బనీతమీము వారికి దేవుని యనుగ్రహము వలన బుద్ధిగలిగి తిరిగి ఇస్లాములో చేరిరి. కాని మాలిక్ బిన్ నువైరా ఏమియు తీర్మానించుకొనలేక తన యనుచరులను తీసికొని 'బతాహ' అనుచోటున మఖాము చేసెను. ఖాలిద్ బిన్ వలీదుగారు తలీహాను మార్చఁగనిన పిదప మాలిక్ ను మార్చఁగనవలెనని యుద్దేశించి బయలుదేఱెను. అదివిని మాలిక్ తన జనులను వేర్వేఱు ప్రదేశములకు నంపివేసెను. ఆపిదప ఖాలిద్ గారు తమ సైనికులనంపి మాలిక్ ను

వానితోఁబాటుఁన్న జనులనుపట్టి తెప్పించిరి. ఆపిదపమాలిక్ బిన్‌నువైరాను వధింపవలెనని ఖాలిద్‌గారు ఆజ్ఞాపించిరి. దాని ననుసరించి వాఁడువధింపఁబడెను. అట్లు వాని యుపద్రవము తొలఁగెను.

—: ముసైలమావధింపఁబడుట :—

బనీహనీఫా కుటుంబమువారి రాయబారము హజ్రత్ పైగంబరులవారి యొద్దకు ఇస్లామ్ స్వీకరించుటకుఁగాను వచ్చియుండెను. అందు ముసైలమాబిన్ తమామా అను వాఁడుండెను. వాఁడుపైగంబరుల వారితో మీఁపిదప నన్ను ప్రతినిధిగానియమించినచో నేను ఇస్లాములోచేరుదును అని పలికెను. అపుడు పైగంబరులవారు తమచేతిలో నున్న ఒక కర్జూరపు మట్టనుచూపి నీవు ఇస్లామునకు బదులుగ ఈమట్టను అడిగినను నీకీయ్యను. ఎవనిగూర్చి అసత్యవంతుఁడు అని నాకు స్వప్నములో ముందుగానేఁ దెలుపఁబడెనోవాఁడు నీవే అని నాకుఁ దెలియుచున్నది అని సెలవిచ్చిరి.

---

ఒకతూరి స్వప్నములో హజ్రత్ పైగంబరుల వారు తమ రెండు చేతులలో రెండు బంగారు కడియములుండుటచూచి చాల చింతపడిరి. అపుడు వానిపై నూఁదవలెనని పైగంబరులవారికి సెలవయ్యెను. వారు ఊఁదగానే అవియెగిరి పోయెను. "నాతరువాత ఇద్దఱు తాము దేవుని ప్రవక్తలముఅని అసత్యముగా పలుకువారు అరేబియాదేశములో బయలు దేఱెదరు అని దాని భావముతెలిపిరి. హజ్రత్ వారు తెలిపినట్లు వారి పిదప, ముసలైమా, అస్వదు అన్సీ అనువారిద్దఱు తాము ప్రవక్తలమని అసత్యము పలికిరి."

ఆపిదప ముసైలమా నిరాశచెంది తన దేశమగు యమామకు వెళ్లిపోయెను. హజ్రత్ పైగంబరుల వారు జబ్బుపడిరి అను విషయము ముసైలమాకుఁ దెలిసి తానుకూడ దేవుని ప్రవక్తఅనియు తాను హజ్రత్ ముహమ్మద్ వారి ప్రవక్త పదవిలో ఒక భాగము పొందియున్నాఁడనని పలుకసాగెను. దాని ననుసరించి యిట్లు హజ్రత్ ముహమ్మద్ రసూలువారి కిట్లు ఒకయుత్తరము వ్రాసెను:—

దేవుని ప్రవక్తయగు ముసైలమాయొద్దనుండి దేవుని ప్రవక్తయగు ముహమ్మద్ వారి పేర:—

మీకు సలామ్. నేను మీప్రవక్తపదవిలో ఒకభాగస్థుఁడనుగా నియమింపఁబడితిని. కావున సగములోకము మీకును మిగత సగములోకము నాకును చేరవలెను. మీరున్యాయము చేయుదురని నాకునమ్మకములేదు.

ఈయుత్తరమునకిట్లు హజ్రత్ పైగంబరులవారు జవాబు వ్రాసిరి:—

దేవుని ప్రవక్త అగు ముహమ్మదు నుండి అసత్యవంతుఁడగు ముసైలమా పేర:—

దేవునిసన్మార్గము ననుసరించినవారికి సలామ్. వాస్తవముగా భూమి దేవునిది. తనదాసులలో తాను కోరినవారికి

దానివారసులుగఁ జేయును. తుదకు దేవుని యందు భయభక్తి లుగల వారలకే జయము లభించును.

హజ్రత్ పైగంబరులవారు పరలోకము చేరినపిదప ముసైలమాను మార్కొనుటకై ఇక్రమాబిన్ అబీజెహల్‌కు, సేనాధిపతిగా నియమించిపంపిరి. వారిపిమ్మట వారికి సహాయపడుటకు షురహబీలుబిన్ హసనాగారిని నియమించిపంపిరి. షురహబీలు వచ్చునంతవఱకు ఇక్రిమా వేచియుండవలెనని హజ్రిత్ అబూబకరు ఉత్తరువుచేసియుండిరి. కాని ఇక్రమాగారు యుద్ధములో జయము పొందిన కీర్తితమకే రావలెనని యుద్దేశించి షురహబీలురాకమునుపే ముసైలమాతో యుద్ధము చేయసాగిరి. కాని అందు ఇక్రిమాగారు ఓడిపోయిరి. ఈ విషయము హజ్రత్ అబూబకరుగారికిఁ దెలిసి చాల కుపితులై "యమను దేశమునకు పోయి మహరావారిని మార్కొనవలెనని ఇక్రమాగారికి ఉత్తరువుచేసిరి. ఆపిమ్మట ముసైలమాను మార్కొనుటకై హజ్రిత్ ఖాలిద్‌గారిని నియమించి షురహబీలుగారు ఖాలిద్‌గారిరాకకు ఎదురుచూడవలెనని ఆజ్ఞాపించిరి. ముసైలమాకు హజ్రిత్ ఖాలిద్‌గారు యుద్ధమునకై వచ్చినారు అను వార్త తెలియఁగానే నలుబదివేల సైన్యముతో వెడలి ఖాలిద్‌గారి సైన్యముతో యుద్ధమునలిపెను. ఘోరయుద్ధముజరిగి ముసల్మానులు ఓడిపోవు సూచలు కానరాసాగెను. శతృవులు ఖాలిద్‌గారి గుడారమువఱకువచ్చిరి. కాని ఖాలిద్‌గారు గొప్ప శౌర్యముతో శతృవును మార్కొని వెనుకకు నెట్టుచుపోయి మల్ల యుద్ధమునకై ముసైలమాను పిలువఁగా దానికివాఁడు పూను

కొనెను. కాని వాఁడు ఖాలిద్ గారిని మార్కొనలేక పాఱి పోయెను. అది చూచివాని సైన్యముకూడ చెల్లాచెదరై పాఱి పోయెను. అట్లు వానికి అపజయముగలుగఁగావాఁడు తన జను లను కొందఱిని వెంటఁబెట్టుకొని యొక తోఁటలో తలుపులు వేసి దాఁగు కొనెను. అపుడు హజ్రత్ బరాబిన్ మాలిక్ అన్సారీ అనువారు నన్ను ఒంటరిగాతోఁటలో పడవేయుఁడు అని తమ సైనికులతోఁజెప్పఁగా వారట్లుచేసిరి. వారు మహా శౌర్యముతో తోఁటలోనున్న ద్వార పాలకులను వధించి తలుపులను తెఱచివేసిరి. ముసల్మానులు లోపలదూఱి ముసై లమా సైనికులను వధింపసాగిరి. ఒహుదు యుద్ధములో హజ్రత్ హంజా గారిని వధించితుదకు మన్నన వేఁడి యిస్లా ములో చేరియున్న వహషీ అనువారు తాము ఇస్లామునకు పూర్వము చేసియున్న ఘోరపాతమునకు పరిహారముచేసి కొనవలెనని సమయము చూచుచుండిరి. ఈ యుద్ధములో వారు కూడ పాలుగొనియుండిరి. కావున ముసైలమావంటి దుష్టునిచంపిన బాగుండునని ప్రియత్నించిరి. తుదకు వారు ముసైలామును వధించి తీరిరి. ముసైలమాభార్య "సజాహ" పాఱిపోయి బసరాపురముచేరి కొన్నాళ్లపిమ్మట చనిపోయెను. ముసైలమా వధింపఁబడిన పిదప బనీహనీఫావారు ముసల్మాను లతో కొన్నిసులువైన షరతులతో సంధిచేసికొనిరి. ఆ పిదప హజ్రత్ అబూబకరుగారు "బనీహనీఫావారికి చేరిన సైనికులం దఱిని వధింపవలెను"అని యుత్తరువుచేసి లేఖనుపంపిరి. కాని అదిచేరకమునుపే ఖాలిద్ గారుసంధిచేసికొనియుండిరి. కాఁబట్టి

ఆ సంధినే అనుసరించిరి. ఆపిదప బనీహనీఫావారు స్వయము గానే తిరిగి ఇస్లాములో చేరిరి.

## —: అస్వదెఅన్సీ వధింపఁబడుట :—

హజ్రత్ పైగంబరులవారి కాలములో యమను దేశము జయింపఁబడెను. అపుడు కిస్రా తరఫున యమనునకు అధికారిగానుండి ఇస్లాములో చేరియున్న బాజానెఫారసీగారిని యమనునకు అధికారిగా పైగంబరులవారునియమించిరి. సన్ఆ యమనునకు ముఖ్యపట్టణముగా నుండెను. కొంతకాలము పిమ్మట బాజాను చనిపోఁగా యమను దేశమును అనేక భాగ ములుగఁజేసి అచ్చటచ్చట అధికారులను హజ్రత్ రసూలు వారు నియమించిరి. అందు బాజాను కుమారుఁడగు 'షహర్' సన్ఆకు అధికారిగా నియమింపఁబడెను.

హజ్రత్ రసూలువారు పరలోకము చేరక కొంత పూర్వము 'అన్సు' వంశమునకు చేరినవాఁడగు 'అస్వదు' తానుకూడ దేవుని ప్రవక్తనని ప్రచారము చేయసాగెను. మజ్‌హాజ్ వంశమువారు వానికి విధేయులైరి. వారు అస్వదుతో చేరి నజ్రాను పురముపై దాడిసలిపి అచ్చటి ముసల్మా నుల అధికారియగు అమ్రుబిన్‌హజమ్‌ను తీసివేసిరి. ఆపిదప అస్వదు తన ఏడువందల జనులను తీసికొని సన్ఆ పట్టణముపై దాడి సలిపెను. అచ్చట అధికారిగానున్న 'షహరు'ను వధించి యాపురమును తన వశము చేసికొనెను. 'సన్ఆ' వానికి వశ మైన పిదప యమను దేశమంతటను వానికి ప్రఖ్యాతిగలిగెను.

యమనులోనుండి పెక్కురు దృఢవిశ్వాసములేని ముసల్మా నులు వానితో కలిసికొనిరి. ఈవిషయము హజ్రత్ పైగంబ రులవారికిఁదెలిసి అస్వదెలన్సీని వధింపవలసినది అని అబ్నా "ఇస్లాములో చేరిన యమను దేశములోని పారసీ సైనికులు". సర్దార్లకును, అబూమూసాఅష్అరీగారికిని మఆజుబిన్ జబల్ గారికిని ఉత్తరవు పంపిరి. సన్ఆ అధికారియగు షహరును వధించి అసదు ఆతని భార్యను పెండ్లాడెను. ఆమె వానిని సమ్మతింపక వాని బంధనము తప్పించుకొను మార్గము చూచు చుండెను. ఆమెసహాయముతో ఫేరోజు దాజూయాలను అబ్నానాయకులిద్దఱు రాత్రిపూట అస్వదు తప్ప త్రాగి యుం డఁగ వధించిరి. ఉదయముకాఁగానే వాని యింటికప్పు పైనిలిచి 'అజాను' (నమాజుపిలుపు) ఇచ్చిరి. అజానువినఁగానే అస్వదె అన్సీజనులందఱు పురము విడిచి సన్ఆ, అదను మధ్యప్రదేశము లలో చెల్లాచెదరై పోయిరి. అస్వదువధింపఁబడిన పిమ్మట య మను దేశమునందు శాంతము ఏర్పడెను. ముసల్మాన్ అధికారు లుతమతమ ప్రదేశములకువెళ్లిరి. హజ్రత్ రసూలువారు పర లోకము చేరిన మరుసటిదినము ఈవిజయవార్త మదీనాపురము చేరెను. అస్వదె అన్సీయొక్క యుపద్రవము నాలుగు నెలల వఱకుండెను.

హజ్రత్ రసూలువారు పరలోకముచేరిరి. అను వార్త యమను దేశము చేరఁగానే ఖైసు అనువాఁడు మత భ్రష్టుఁడై చెల్లాచెదరై పోయియున్న అస్వదె అన్సీజనులను కూర్చు కొని సన్ఆ పురముపై దాడి సలిపి దానిని తన వశముచేసి

కొానెను. అబ్నా యొక్క ఆలుబిడ్డలను పట్టిద్వీపకల్పములలో చెఱనుంచెను. ఈ విషయము అబ్నాసర్దారగు ఫేరూజునకుఁ దెలిసి బనీఅఖీలు, అక్వారి సహాయము కోరెను. వారు ఫేరూజునకు తోడుపడి అబ్నాయొక్క ఆలుబిడ్డలను చెఱనుండి విడిపించిరి. ఆపిదదప వారందఱు ఖైసును మాార్కొనుటకు బయలుదేఱిరి. అంతలో అస్వదును మాార్కొనుటకుఁగాను హాజ్రత్ అబూబకరుగారు పంపినముహాజిరుబిన్ అబీఉమయ్యాగారు తమ సైన్యమును తీసికొానివచ్చిచేరిరి. మఱియు ఇక్రమాగారు కూడ తమ దండయాత్రలను ముగించి తమ సైన్యమును తీసికొాని 'అబ్నా'కు సహాయము చేయుటకై వచ్చిచేరిరి. ముసల్మానుల సైనికులు తిరిగి సన్ఆపురమును జయించి తమ వశముచేసికొాని ఖైసును, మతభ్రష్టులైన మాదీకరబును జూబైరనుపట్టిమదీనాకు పంపిరి. అచ్చిటికిపోయి తాముకావించిన పనులకు పశ్చాత్తాపము వెల్లడించి మన్నన వేఁడి తిరిగి ఇస్లాములో చేరిరి. హాజ్రత్ అబూబకరుగారు వారినిద్దఱిని క్షమించి వదలిపెట్టిరి.

### —: బహరైనులోని ఉపద్రవములు :—

బహారైను ప్రదేశములో రబీఅ, అబ్దుల్ఖైసు, బనూబకరు, వారి వంశములవారు నివసించుచుండిరి. హాజ్రత్ పైగంబరులవారి సన్నిధికి బహరైనువారుతమ రాయబారము నంపి ఇస్లాములో చేరియుండిరి. మున్జరుబిన్సాలీని వారికి అధికారిగా నియమించి యుండిరి. హజ్రత్ పైగంబరులవారు పరలోకముచేరఁగానే మున్జిరుకూడ మరణించెను. అపుడు బహరైనువారు ఇస్లామునువదలిపెట్టిరి. బనూబకరువంశము వారు

మతభ్రిష్టులుగానే యుండిరి. కాని అబ్దుల్ ఖైసువారుతమ నాయకులగు హాజ్రిత్ జారూదుగారి బోధవలనతిరిగియిస్లా ములోచేరిరి. అదియెట్లనగా హాజ్రత్ జారూదుగారుతమవం శమువారి సభగావించి వారితో "మీరు ఇస్లాములోచేరిన పిమ్మట ఎందులకు మీరు అవిశ్వాసులైపోతిరి" అని ప్రశ్నిం పఁగావారు 'ముహామ్మద్' దేవునిప్రవక్తయే అయియుండినచో ఎందులకు మరణించును. ఆతఁడు చావక యుండునుగదా! అం దుచే అయన ప్రివక్తకాదు అని తెలియుచున్నది" అని పలి కిరి. అపుడు జారూదుగారు "సరే! హాజ్రత్ ముహామ్మదు వారికి పూర్వము ఎవరైన ప్రివక్తగావచ్చి యున్నారా!" అని ప్రశ్నింపఁగా అబ్దుల్ ఖైసువారు "ఎందులకు రాలేదు. అనేకులు వచ్చియున్నార"నిపలికిరి. అటులైనవారందఱు ఎక్క డకు పోయిరి అని జారూదు ప్రిశ్నింపఁగా "ఎక్కడ పోయి నారు. మరణించిరి" అని అబ్దుల్ ఖైసువారు పలికిరి. అటు లైనచో పూర్వము ప్రవక్తలు మరణించినట్లు హాజ్రిత్ ముహామ్మద్ వారు కూడ మరణించిరి. కావున ఓ సహోదరు లార! నేను మనః పూర్వకముగా లాఇలాహ-ఇల్ లల్లాహు-ముహేమ్మదుర్-రసూలుల్లాః (అల్లాః దప్ప వేఱు పూజ్యుఁ డగు దేవుఁడు లేఁడు. హాజ్రిత్ ముహామ్మద్ వారు దేవుని ప్రవ క్తలు) అని నేను ఖరారుచేయుచున్నాను అని పలుకఁగా అబ్దుల్ ఖైసు వారందఱు మేముకూడ అటులే ఖరారుచేయు చున్నాము అని పలికి తిరిగి ఇస్లాములోచేరిరి. అబ్దుల్ ఖైసు వారు తిరిగి ఇస్లామ్‌లోచేరిరి అనువార్త బనూబకరు యొక్క సర్దారుఁడగు హాతమునకుఁదెలిసి తన జనులను తీసికొనివచ్చి

అబ్దుల్ ఖైసు వారినిముట్టడించెను. హతమునకుతోడుగ అనేక కాఫిర్లును మతభ్రష్టులును వానితోకలిసికొనిరి. హజ్రత్ అబూబకరుగారు, హతమును మార్కొనుటకై హజ్రత్ అలా గారిని సేనాధిపతిగాఁజేసి ఒక సైన్యమునుపంపిరి. హజ్రత్ అలాగారు తమ సైన్యమును దీసికొని పోవుచు ఒక మైదాన ములో ప్రవేశించి యచ్చట తమ సైన్యమును అలసట తీర్చు కొనుటకై రాత్రినిలిపిరి. సైనికులుహాయిగా నిద్రపోయిరి. వారు నిద్రనుండి మేలుకొని చూడఁగా వారి యొంటలన్నియు పాఱిపోయి యుండెను. అదిచూచి అందఱు ఇఁక తీవ్రమైన యెండలో మాకు చావుతప్పదు అని చాల చింతింపసాగిరి. అపుడు హజ్రత్ అలాగారు ముసల్మానులకు ధైర్యము చెప్ప ఓసహోదరులార! మీరు ముసల్మానులు. మీరు దేవునిశత్రు వుతో యుద్ధమాడుటకు బయలుదేఱిన వారలు. దేవునిసాక్షి! దేవుఁడు మిమ్ము అవమాన పఱుపఁడు అని పలికి ఉదయకాలపు నమాజుచేసి దేవునితో "ఓదేవా! మమ్మి యాపదమండి కాపాడుము"అని ప్రార్థించిరి. దేవుఁడు వారి ప్రార్థనను అంగీ కరించి ముసల్మానులను కాపాడెను. ఆ మైదానములో నీళ్లు లభించుట అసంభవము. అట్టిచోట కొంతదూరమున కొంచెము కాంతికనఁబడెను. అచ్చటికిపోయి చూడఁగా నీళ్లుండెను. ముస ల్మానులు తనివితీర త్రాగిస్నానాదులు చేసికొనిరి. మధ్యా హ్నముకాక మునుపే పాఱిపోయిన ఒంటెలన్నియు అచ్చటికి వచ్చిచేరెను. అవి కూడతృప్తికరముగా నీళ్లుత్రాగెను.

ఆ పిదప హజ్రత్ అలాగారు తమ సైన్యమును దీసి కొని జారూదుగారికి సహాయముచేయుటకై అచ్చటికి పోయి

చేరిరి. అప్పుడు హాతము తన సైన్యమును తీసికొనివచ్చి ముస ల్మానులతో యుద్ధముసలిపెను. కొన్నాళ్లు యుద్ధము జరిగెను. ఒకరాత్రి హాతముసైన్యములో చాలఅల్లరి ముసల్మానులకు వినఁబడెను. వారు విచారింపఁగా శత్రుసైనికులు తప్ప త్రాగి అల్లరి కావించువిషయము తెలిసి ముసల్మానులు తత్క్షణమే శత్రు వులపైఁబడి వధింపసాగిరి. అనేకులను వధించి పెక్కుమందిని ఖైదీలుగ పట్టుకొనిరి. శత్రుసేనాధిపతి హాతముకూడ వధింపఁ బడెను. హాతము జనులు బహారైనుకు సమీపములోనున్న దారైనుఅను ద్వీపకల్పమునకుపోయి దాఁగుకొనిరి. కాని ముసల్మానులు సముద్రము దాఁటి అచ్చటికిపోయి వారిని వధిం చిరి. మఱియు ఉమ్మానులోని కొన్ని కుటుంబములవారును కన్దావంశము వారును మత భ్రష్టులైయుండిరి. హజ్రత్ అబూబకరుగారు ఆమత భ్రష్టులను మార్చుకొనుటకు ముసల్మా నుల సైన్యములు పంపిరి. దేవుని యనుగ్రహామువలన అన్ని చోట్ల ముసల్మానులకే విజయములభించెను.

## —: ముసల్మానుల గొప్పఉపకారి :—

హజ్రత్ పైగంబరులవారు పరలోకముచేరిన తోడనే అరేబియాదేశములో చెలరేఁగిన మతభ్రష్టత్వము మొదలగు నుపద్రవముల వలన ఇస్లాము మతమునకు గొప్ప ప్రమాదము వాటిల్లునను భీతిగలిగెను. కాని పరమదయాళువగు అల్లాః దయవలన హజ్రత్ అబూబకరుగారు తమ ధైర్యముతోను బుద్ధికుశలతతోను ఇస్లాము మతమునకు గొప్ప సేవచేసి ముస ల్మానులకు గొప్ప యుపకారము చేసిరి. అందులకే హజ్రత్

రసూలువారి తరువాత ముసల్మానులకు గొప్ప యుపకారము చేసినవారు హజ్రత్ అబూబకరుగారు అని యేర్పడెను. పై వివరింపఁబడిన విషయములను గమనించినచో ముసల్మానులు సంఖ్యలో కొద్దిమందిగానున్నను శత్రువుల విరోధమునకు భయపడక దృఢవిశ్వాసముతో దేవునిపై నాధారపడి శత్రువును మార్కొన వలెనుఅను గుణపాఠము లభించుచున్నది. దృఢవిశ్వాసముగల ముసల్మాను భక్తులు సంఖ్యలో తక్కువగా నున్నను అపజయము పొందఁజాలరు. కాని విశ్వాసములో దృఢత్వము లేక ఇస్లాము మతధర్మములను సరిగా అనుసరింపకయున్న దుస్థితిలోనే వారు అపజయము పొందఁగలరు. హజ్రత్ అబూబకరుగారి ప్రయత్నము వలన అరేబియా దేశములో దుష్టులు నశించి సంపూర్ణముగ శాంతము ఏర్పడి ఇస్లాము ప్రభుత్వ పతాకముఅంతట నిరాటంకముగా నెగురసాగెను. దేవుఁడు ఖురానెషరీఫులో "ఇన్-తన్ సు-రుల్లాహ-యన్ సుర్ కు-వ-యు-సబ్బిత్-అఖ్ దా మకుమ్. (మీరు దేవుని మతమునకు తోడుపడినచో దేవుఁడు మీకు తోడుపడి మీపాదములను స్థిరముగా నుండునట్లు చేయును.)" అను తాను చేసియున్న వాగ్దానము పూర్తిచేసెను.

—: ఖురానెషరీఫ్‌ను ఒక గ్రంథముగా సమకూర్చుట :—

పై వివరింపఁబడిన యుద్ధములలో ఖురానెషరీఫును కంఠపాఠముచేసియున్న పెక్కురు ముసల్మానులు స్వర్గలోకము

చేరిరి. హజ్రత్ రసూలువారి జీవితకాలములో ఖురానెషిరీఫు వాక్యములు, సూరాలు, వేర్వేఱుగా రాతిపలకలలోను చర్మ ములోను ఖర్జూరపు మట్టలలోను వ్రాసియుంచఁబడుచుండెను. కాని ఒక గ్రంథముగా సేకరింపఁబడి యుండలేదు. అందులకు హజ్రత్ ఉమరుగారు హజ్రత్ అబూబకరుగారితో "అయ్యా! ముసల్మానులు అనేకులు స్వర్గలోకము చేరినారు. ఖురానును మొత్తము ఒక గ్రంథముగా సమకూర్చుట చాల అవసరము. లేనిచో ఖురానులోని చాల సూరాలు, పోవునని భీతిగలదు" అని విన్నవింపఁగా దానికిఁగాను హజ్రత్ జైదుబిసాబిత్ గారిని నియమించిరి. వారు కొలఁది కాలములోనే ఖురానును సంపూ ర్ణముగ వ్రాసి యొక గ్రంథముగా సమకూర్చిరి. దాని ప్రతులే ఏలాటి వ్యత్యాసము లేకుండ నిప్పటికిని లోకమంతటను వ్యాపించియున్నవి.

## —: విజయ ప్రారంభము :—

అరేబియా దేశములో సంపూర్ణముగా శాంతమేర్పడిన పిదప హజ్రత్ అబూబకరుగారు తమ సైన్యములను ఇరుగు పొరుగున్న దేశములను జయించుటకు నియమించిరి. దీనిఁ గూర్చి వ్రాయుటకుముందు అరేబియా దేశమునకు ఇరుగు పొరుగునఉన్న పారసీక, రోమనుల గొప్పరాజ్యములను గూర్చి కొంత వ్రాయుదుము.

## :— పారసీక రాజ్యము :—

పారసీక (ఈరాన్) రాజ్యము చాల పురాతనమైనది. ఇది చాల పురాతనకాలముచుండి నాగరికత గలిగియున్న

ప్రభుత్వములలో నొకటి. ఈజాతిపై వేఱుజాతివారికి ప్రభుత్వముచేయు అవకాశము దొరకలేదు. కాని సికందరెరూమీా (అలెగ్జాండరు) మాత్రము ఫారసీకమును జయించి కొన్నాళ్లు ప్రభుత్వముచేసెను. ఆపిదప పారసీకులు స్వాతంత్ర్యము సంపాదించుకొనిరి. పారసీకరాజు చక్రవర్తిగా నుండెను. వానికి లోబడి పెక్కురు సామంత రాజులుండిరి. చక్రవర్తి కిసాౖ అని పిలువఁబడుచుండెను. ఆఫ్గనిస్థానము, ఇరాఖు, పారసీక రాజ్యమునకు చేరియుండెను. క్రీ॥ శ॥ 230, సం॥లో సాసాన్ వంశమునకు చేరిన 'ఉర్దుషేర్ బాబకాన్'అను నాతఁడు పారసీకులకు ప్రభువయ్యెను. అప్పటినుండి మదాయిను'అను పురము వారి రాజ్యమునకు ముఖ్యపట్టణముగా నుండెను. ఈగొప్ప పట్టణము దజలానది (టైగరస్) యొడ్డున నుండెను. అచ్చట లోకప్రసిద్ధిచెందిన "కిస్రామహాల్" ఉండెను. హజ్రత్ పైగంబరుల వారు జననమొందిన కాలములో న్యాయమునందు లోకప్రసిద్ధిగాంచిన "నౌషేర్వాన్ కిసాౖ"అను చక్రవర్తి ఫారసీకులను పరిపాలించుచుండెను. నౌషేర్వాఁ కిస్రా మరణించిన పిదప ఆతని కుమారుఁడగు హుర్ముజ్, రాజ్యమునకు వచ్చెను. ఆతని పిమ్మట పర్వీజుకిసాౖ రాజయ్యెను. పర్వీజును వాని కుమారుఁడగు షేర్ విమా అనువాఁడు వధించి తాను ప్రభువాయెను. షేర్ విమా ఒక సంవత్సరము తొమ్మిది నెలలు మాత్రము రాజ్యము చేయఁగలిగెను. ఆతఁడు తన పరిపాలన కాలములో తన బంధువులను చాల హింసించుచుండెను. ఆతఁడు చచ్చిన పిదప వాని పుత్రుఁడగు ఉర్దెషేర్ రాజయ్యెను. కాని ఆతనికి వయస్సు తక్కువగా నుండుట వలన

ప్రభుత్వకార్యములను నిర్వహించుటకు నొక 'నాయకుఁడు' నియమింపఁబడెను. కాని దానిని మఱొక నాయకుఁడగు షహర్‌బజార్ అనువాఁడు రాజునువధించి తాను రాజయ్యెను. ఆతఁడు రాజవంశమునకు చేరినవాఁడు కానందున ఇతర నాయకులు వాని ప్రభుత్వమును సమ్మతింపక నలుబది దినముల పిమ్మట వానిని వధించి పర్వీజ్ కిస్రా కుమార్తెయగు బూరానును రాణిగాఁజేసిరి. హజ్రత్ పైగంబరుల వారి జీవితకాలాంతమున ఆమెయే పారసీక రాజ్యమునకు రాణిగా నుండెను. ఆమె ఒక సంవత్సరము నాలుగునెలలు రాజ్యముచేసి మరణించెను. ఆమె తరువాత పర్వీజ్‌కిస్రా యొక్క చిన్నాయన కుమారుడగు జవాన్‌షేరు అనునాతఁడు రాజ్యమునకువచ్చెను. ఆతఁడుకూడ ఒక నెలకంటె నెక్కువ కాలము రాజ్యము చేయలేక పోయెను. ఆతఁడు చనిపోయిన పిదప పర్వీజ్‌కిస్రా యొక్క రెండవ కుమార్తె అగు అజ్‌రుమీూ అనునామె రాజ్యమునకు వచ్చెను, కాని ఒక సేనాధిపతి అగు రుస్తుమ్ అను వాఁడు ఆమెను తనతండ్రి హత్యకుబదులుగ వధించెను. ఆమె పిమ్మట "ఉర్దెషేర్‌బాబకాన్" వంశమునకుచేరిన కిస్రాబిన్ హారు అనువాఁడు రాజయ్యెను. కాని ఆతఁడు కూడకొన్నాళ్లు మాత్రమురాజ్యము చేయగలిగెను. తుదకు 'యజ్‌దిగిర్‌దు బిన్‌షహర్‌యారు' అనువాఁడు పారసీకరాజ్యమునకు చక్రవర్తిగా నియమింపఁబడెను. ఈతఁడేపారసీకుల కట్టపడటిరాజు. హజ్రత్ ఉమరుగారి ఖిలాఫత్ కాలములోనే పారసీకుల గొప్పరాజ్యము యజ్‌దిగిర్‌దు చేతినుండి ముసల్మానులచేతిలోఁబడెను.

—: రోమన్‌రాజ్యము :—

యూరపు దేశములో స్థాపింపఁబడిన గొప్ప రాజ్యములలో రోమనురాజ్యము ఒకటి. రోమనురాజ్యమునకు రోమాపురము ముఖ్యపట్టణముగా నుండెను. పూర్వము ఒకపుడు హిందూదేశము, చైనాదేశము, పారసీక (ఈరాన్) దేశము తుర్కిస్థానముతప్ప మిగిలిన దేశములన్నియు రోమనురాజ్యమునకు చేరియుండినవి. అందులకే దానికి రోమను మహాసామ్రాజ్యము (The Great Roman Empair) అను పేరుగలిగియుండెను. అన్ని దేశములలోను దాని నాగరకతయు దాని చట్టములును అనుసరింపఁబడుచుండెను. కాని కొంత కాలమునకుపిమ్మట క్రీ॥ శ॥ 395, సం॥ లో జరిగిన అంతః కలహముల వలన రోమను సామ్రాజ్యము రెండు భాగములుగ చీలిపోయి తూర్పురోముగను పశ్చిమరోముగను ఏర్పడెను. తూర్పురోమునకు రోమాపురమును, పశ్చిమ రోమునకు కాన్‌స్టాంటునోపిల్ (ఖుస్తున్‌తున్యా) అనునవి ముఖ్య పట్టణములుగా నేర్పడెను. తూర్పురోమను రాజ్యముపై యూరపు జాతివారును రష్యావారును పలుమార్లు దాడులుసలిపిరి. తుదకు అది కొన్ని చిన్న చిన్న రాజ్యములుగ చీలిపోయెను. కాని పశ్చిమ రోమను రాజ్యము శత్రుదాడి లేక బద్రముగానుండి వృద్ధిపొంద సాగెను. పశ్చిమరోమను రాజ్యములో యూరోపు దేశములే కాక ఏషియామైనరు (ఆసియామైనర్) సిరియా, ఈజిప్టు దేశములు కూడ చేరియుండెను. సిరియా, ఈజిప్టు దేశములలో కొన్ని దేశీయ సంస్థానములుకూడ నుండెను. అవిరోమను రాజునకు కప్పము చెల్లించుచుండెను. రాజకీయము లందును

మత విషయములందును కాన్స్టాంటునోపలు (ఖుస్‌తున్‌తున్యా) యొక్క కైజరుఅధికారమును సమ్మతించుచుండెను. పశ్చిమ రోమను రాజ్యమునకు యూరోపులో చాలగౌరవముండెను. అచ్చటి రాజులు క్రైస్తవమతములోచేరిన పిమ్మట వారు యూరోపులోను ఏసియాలోను క్రైస్తవ మతప్రచారముచాల చేసిరి. క్రైస్తవుల మతమునకు పుణ్యాపట్టణమగు బైతుల్ ముఖద్దను (జెలుసలేము) కూడ ఆరాజులకు చేరియుండెను. యూరోపు ఏసియాలోని క్రైస్తవులు ఖైజరును తమ మత రక్షకుఁడని అంగీకరించుచు ఆతని సెలవుకాఁగానే వేలకొలఁది క్రైస్తవులుయుద్ధమునకు సిద్ధమగుచుండిరి. ఇస్లామునకు ప్రారంభ ములో రోమనురాజ్యమునకు హిర్ ఖలుఅను నతఁడు రాజుగా నుండెను. ఈతఁడు ముందు ఆఫ్రికా దేశమునకు గవర్నరుగా నుండెను. ఈతఁడు ఖొఖాఅను కైజరును వధించి తానే రాజ య్యెను. హిర్ఖలు క్రీ॥ శ॥ 610, నుండి 641, వ, సం॥ రాజ్య మును పాలించెను. ఈతని కాలములోనే చాల ఫలవంతమైన సిరియాదేశము రోమనురాజ్యమునుండి తొలఁగి ముసల్మాను లకు అధీనమాయెను.

కిస్రా, (పారసీకరాజు) కైజరు (రోమనురాజు) లకు తమ రాజ్యను వ్యాపింపఁజేయవలెనని ఆస యధికముగానుం డెను. అందులకే, వారు చిన్నచిన్న స్వతంత్ర ప్రభుత్వము లను లోఁబఱచుకొనుటకు ప్రయత్నించు చుండిరి. ఈ పేరాస వలననే, కిస్రా, కైజరుల మధ్యయుద్ధములు సంభవించు చుం డెను. ఇరాఖ్, సిరియా దేశములుపీరికి యుద్ధ రంగములుగా నుండు చుండెను. ఒకప్పుడు కిస్రావారు జయముపొంది మధ్య

దరా సముద్రము(మెడిటెరేనియన్ సీ) వఱకు ఆక్రమించుకొను చుండిరి. మఱొకప్పుడు కైజరు సైన్యములు జయముపొంది ఇరాఖ్‌లోనున్న దజ్లాఫురాతునదుల వఱకు వచ్చుచుండెను. ఇస్లామునకు కొంత పూర్వము నౌషేర్వాన్ కిస్రా మఱియు ఖాఖే కైజరుల సైనికుల మధ్యచాలకాలమువఱకు యుద్ధము సంభవించెను. ఈ యుద్ధములో పారసీకులకు గొప్ప విజయములు లభించెను. వారు రోమనులను ద్వీపమునుండి పాఱదోలిరి. మఱియు ఫీనీఖియను పాలస్తీనాను ధ్వంసముచేసి బాస్ఫొరస్ సముద్రతీరమువఱకు పోయిరి. ఆపిదప పారసీకులు, హిర్ఖలురాజుకాలములో రోమనులపై దాడిసలిపి జెరూసలేకమును నాశముచేసి సిలువనులాగుకొని పోయిరి. మఱి క్రైస్తవుల యొక్క అనేక పవిత్రచిహ్నములను నాశము చేసిరి. మరల క్రీ॥ శ॥ 616 వ సం॥ లో ఈజిప్టుపై దాడి సలిపి అలెగ్జాండ్రియాను జయించిరి. పారసీకులకు ఒకమత గ్రంథము లేక వారు మక్కాఖురైషులవలె పెక్కుదైవారాధకులుగా నుండిరి. అందులకు పారసీకుల విజయములనువిని సంతోషపడిరి. రోమనులు క్రైస్తవులు. వీరికి మత గ్రంథము గలదు. కావున ముసల్మానులు క్రైస్తవుల అపజయమునకు చింతించిరి. కాని వీని గూర్చి దేవుఁడిట్లు సందేశముపంపెను:-గులిబతిర్-రూము ఫీ-అద్‌నల్-అర్‌జి-వహుమ్‌మిమ్-బఅ్‌ది-గలబిహిమ్-సయగ్‌-లిబూన్-ఫీ-బిజ్‌ఇ-సినీన-లిల్లాహిల్-అమ్‌రు-మిన్-ఖబ్లు-వ-మింబఅ్-దు-వ-యౌ-మఇ-జిన్-యఫ్-రహుల్-మూమినీన-బి-నస్‌రిల్లాహి-యన్‌సురు-మన్-యషాఉ-వహువల్-అజీజుర్‌రహీమ్.

దేవుని సందేశములోగల భవిష్యత్ ప్రకటన ప్రకారము పదిసంవత్సరముల పిదప జరిగెను. హిర్ఖలురాజు క్రీ॥ శ॥ 622 వ సం॥ లో పారసీకులపై దాడివెడలి గొప్ప యుద్ధము సలిపెను. మార్చినెల క్రీ॥ శ॥ 624, సం॥ లో ముసల్మానులు బదరు యుద్ధములో మక్కాఖురైషులను ఓడించి మహాజయము పొంది సంతసము నొందు సమయములోనే రోమను క్రైస్తవులు పారసీకులను ఓడించి మహా విజయముపొంది సంతసించిరి. రోమనులకు జయముగలిగిన పిదప క్రీ॥ శ॥ 628 వ సం॥ లో షిర్వియారాజు, హిర్ఖలురాజుతో నొడంబడిక చేసికొనెను. రోమను ఖైదీలందతిని వదలిపెట్టి సిలువను తిరిగి యిచ్చెను. హిర్ఖలురాజు తనకు లభించిన మహావిజయమునకు చాలసంతసంచి దేవుని కృతజ్ఞత సలుపుటకుఁగాను బైతుల్ముఖద్దసునకువచ్చెను. ఇచ్చటనే హజ్రత్ పైగంబరులవారు ఇస్లామ్ సందేశమును గూర్చిపంపిన లేఖ ఆతనికి ముట్టినది. జగత్ప్రవక్త చూడుఁడు పేజీ 157.

—: పారసీకులు, రోమనులు, ముసల్మానులు :—

పారసీకులును రోమనులును, అరబ్బులవంటి వీరజాతి అనేక పక్షములుగా చీలి పరస్పరము వైరముగలిగి యుద్ధమాడి తమ బలము పోఁగొట్టుకొను చుండవలెననియే కోరుచుండిరి. అందు వారికి లాభముండెను. కాని హజ్రత్ మహమ్మద్ రసూలువారు లోకమంతయు ఒక్కకుటుంబము. అందరును దేవునికి దాసులు. లోకులందఱును తమ జాతిభేదములు వదలుకొని ఒక యింటివారివలె సోదరభావము గలిగి అంద

అతో సమానులై యుండవలెనని బోధించి ఇస్లాము మత ప్రచారము చేయుచుండఁగా పారసీకులు (ఈరానులు)ను రోమనులు దానిఁగూర్చి సందేహింపసాగిరి. ఇస్లాము మత ప్రచారము ప్రబలినచో అరబ్బులు వారి అధికారములోనుండి తొలఁగిపోవుటయేగాక తాము హింసించుచున్న రైతులు కూడ తిరుగుబాటు సలుపుదురని వారు తలంపసాగిరి. అందులకే ఆజవ హిజ్రియేఁట పర్వీజు కిస్రాకు హజ్రత్ రసూలువారు ఇస్లామునుగూర్చి లేఖ పంపఁగా దానిని వాఁడు తునుకలు తునుకలుగా చీల్చివేసి అరేబియాలో తాను ప్రవక్తయని ప్రచారముచేయునతని పట్టి నాయొద్దకు తేవలసినది అని యమను దేశమునకు అధికారిగానున్న బాజానునకు ఉత్తరువుచేసెను. బాజాను కిస్రా యుత్తరువు ప్రకారము ఇద్దఱిని మదీనాపురమునకు పంపెను. వారిద్దఱు హజ్రత్ పైగంబరులవారి యొద్దకు రాఁగా "మీరు పొండు. నన్ను పట్టవలెనని యుత్తరువుచేసిన మీ రాజు వధింపఁబడెను. వినుఁడు నామతము మీ చక్రవర్తి రాజ్యముండు ప్రదేశము లంతటను చేరును. మఱియు ఒంటె, లేదా గుఱ్ఱము ఎచ్చటి వఱకు పోగలుగునో అచ్చటి వఱకు ఇస్లాము వ్యాపించును అని యుపదేశించి పంపి వేసిరి. బాజాన్ మనుష్యులు తిరిగి తమ దేశముచేరిరి. అచ్చట హజ్రత్ రసూలువారు పలికినట్లే పర్వీజురాజును వానికొడుకు షేర్వియా అనువాఁడు వధించియుండెను. ఆతరువాత షేర్వియా నాతండ్రి అరేబియా దేశమునుండి ఎవ్వనిని పట్టి తెమ్మని యుత్తరువు చేసెనో ఆతని జోలికి నీవు పోకూడదు అని కబురుపంపెను. ఆపిదప పారసీకులమధ్య విభేదములు

అంతఃకలహములు చాల ప్రబలెను. అందులకు వారు అరబ్బులఁగూర్చి జోక్యము పుచ్చుకొనలేక పోయిరి. ఇటులే హజ్రత్ పైగంబరులవారు హీజ్రీ ఆఱవయేఁట ఇస్లామును గూర్చి లేఖ ఖైజరు (రోమను) రాజునకు పంపఁగా ఆతఁడును ఆతని సేనాధిపతులును, ప్రభుత్వ అధికారులును దానిని సమ్మతింపజాలక కఠినముగా రద్దుచేసిరి. ముసల్మానుల రాయబారులు తిరిగి వచ్చుచుండఁగ సిరియాలోనున్న క్రైస్తవులు వారి సొత్తులను లూటీచేసిరి. రోమనుల తరఫున షురహీబ్బలు గస్సానీ బుసా్రకు అధికారిగా నుండెను. హజ్రత్ పైగంబరులవారు వాని యొద్దకు ఇస్లాము మతమునుగూర్చి లేఖపంపఁగా ఇస్లాములో చేరక రాయబారిగా పోయియున్న హారిస్ బిన్ ఉమైరును అన్యాయముగా వధించెను. దీనిప్రతీకారము చేయుటకే మూతా యుద్ధము సంభవించెను. అందు రెండు లక్షల రోమను, సిరియా క్రైస్తవుల సైన్యముతో మూఁడు వేలు ముసల్మానులు మాత్రము మహాధైర్యముతో పోరాడిరి. అందు గొప్పగొప్ప శిష్యులు (సహాబా) స్వర్గలోకము చేరిరి. (చూడఁడు జగత్ పత్రిక పేజీ 174)

హిజ్రీ తొమ్మిదవయేఁట రోమనురాజు కైజరు సహాయము పొంది 'బుసా్ర' అధికారి మదీనారపురము పైదండెత్తవలెనని సిద్ధమాయెను. కాని హజ్రత్ రసూలువారు తమ ముప్పదివేల ముసల్మాను వీరులను తీసికొని క్రైస్తవులను మార్కొనుటకు వెడలి తబూకు చోట చేరిరి. అదిచూచి క్రైస్తవులు ధైర్యమువీడి దాడి సపలుక నిలిచిపోయిరి.

పై విషయములనుబట్టి చూచిన ముసల్మానులకు తమ యిరుగుపొరుగున ఉన్న గొప్పరాజ్యముల వారి నుండి శాంతము లేకుండెను అను విషయము స్పష్టపడుచున్నది. ఆరాజులకు సమయము దొరకినపుడెల్ల ముసల్మానులపై దాడిసలుపుచుండిరి. అందులకే హజ్రత్ రసూలువారు పరలోకము చేరక కొంత ముందు హజ్రత్ ఉసామాగారిని సేనాధిపతిగాఁజేసి ముసల్మానుల సైన్యము నియమించిరి. కావుననే హజ్రత్ అబూబకరుగారు మొట్టమొదట ఉసామాగారి సైన్యమును ఆపివేయక శత్రువును మార్గొనుటకై పంపిరి. మఱియు మత భ్రష్టులను అసత్యప్రవక్తలను అణఁగఁ ద్రొక్కిన పిదప ముసల్మానుల సైన్యములను సిరియా, ఇరాకు దేశములపై దాడివెడలుటకు నియమించిరి.

## —: ఇరాకు యుద్ధములు —

హిజ్రీ పండ్రెండవ యేఁట హజ్రత్ అబూబకరుగారు ఖాలిద్ బిన్ వలీదును సేనాధిపతిగాఁ జేసి ఇరాకుపై దాడివెడలుటకు నియమించిరి. ఖాలిదుగారికి తోడుపడుటకు ఖాఖాగారిని నియమించిరి. హజ్రత్ అబూబకరుగారు, ఈరాను దేశపు సరిహద్దులోనున్న రమలాఖాతమునుండి తమ దాడిని ప్రారంభింపవలెనని ఖాలిదుగారికి ఆజ్ఞాపించిరి. ఉత్తరఇరాకుపై దాడివెడలుటకై అయాజుబిన్ గనమ్‌గారిని నియమించిరి. అయాజుగారికి తోడుగా అబ్దెయగూసును నియమించిరి. వారు ఉత్తర ఇరాకునకు చేరిన ముజీహా అను గ్రామమునుండి తమ దాడి ప్రారంభింపవలెనని యుత్తరువుచేసిరి. మతభ్రష్టులైన

వారిలో నెవ్వనినికూడ ముసల్మానుల సైన్యములో చేర్చు కొనఁగూడదు అని సేనాధిపతులకు హజ్రత్ అబూబకరుగారు ఉత్తరువు గావించిరి. ఎందుకన మతభ్రష్టులయందు వారికి నమ్మకము లేకుండెను. మఱి వారిని శిక్షింపవలసి యుండెను.

ఖాలిద్ బిన్ వలీదుగారు ఇస్లాము మతధర్మము ననుసరించి ఇరాకు సరిహద్దునకు అధికారిగానున్న వానికిట్లు లేఖ వ్రాసిరి.

ఇస్లాము మతమును స్వీకరింపుఁడు. మీరు రక్షింపఁబడుదురు. ఇస్లామును స్వీకరింపనిచో జిజ్యా-పన్ను చెల్లించి మారై తులుకండు. అట్లుకానిచో మీరు మీయాత్మలనే నిందించు కొందురు. ఎందుకన మీరెట్లు మీప్రాణములను ప్రేమింతురో అట్లు చావును ప్రేమించునట్టి వారిని మిమ్మ మార్కొనుటకు తీసికొని వచ్చుచున్నాను.

## —: కాజిమా యుద్ధము :—

హర్మ్మజు ఆలేఖను ఈరానురాజు నొద్దకుపంపితనసైన్యమును తీసికొనికాజిమా వైపునకు బయలుదేఱి నీటియూటను వశపఱచుకొనెను. అపుడుఖాలిద్ గారు మీరుభయపడకుఁడు. రెండు సైన్యములలో నెవరు శూరులో వారు ఆనీటియూటను వశపఱచు కొందురు అని ముసల్మాను సైనికులతో పలికిరి. ఆపిదప రెండు సైన్యములును మార్కొనుటకు సిద్ధమాయెను. అపుడు ఖాలిద్ గారు ముందునకువచ్చి పోటియుద్ధమునకు రావలెనని హర్మ్మజును పిలిచిరి. హర్మ్మజు తన గుఱ్ఱమునుండి దిగివచ్చి పోటియుద్ధము సలిపెను. అందు ఖాలిద్ గారు హర్మ్మజును

వధించిరి. అదిచూచి ఈరానుల సైన్యము ధైర్యమువీడి పరు గెత్తసాగెను. దానిని వెంటాడుటకు ఖాలిద్‌గారు ముసన్నా బిన్‌హారిసాగారిని నియమించి ఈ విజయ వార్తను మదీనా పురమునకు ఖలీఫా సన్నిధికి పంపిరి.

—: సనీయుద్ధము :—

ఈరానులసైన్యము ఓడిపోయిన విషయము ఈరానుల రాజగు ఉర్దుషేరునకుఁదెలిసి ముసల్మానులను మార్కొను టకై 'ఖారను' అను వానిని సేనాధిపతిఁగాఁజేసి వ ఱొక సైన్యమును పంపెను. ఖారను తన గొప్ప సైన్యమును దీసి కొని బస్రాపురమునకు సమీపములోనున్న సనీ అనుచోటు మఖాము చేసెను. హజ్రత్ ఖాలిద్‌గారు కూడ తమ సైన్య మును తీసికొని మార్కొనుటకు బయలుదేఱిరి. రెండు సైన్య ములు మార్కొనుటకు సిద్ధమాయెను. అప్పుడు ఖారను ముం దునకు వచ్చి తన్ను మార్కొని పోటియుద్ధము చేయువారెవ రైన గలరా! అని గర్వోక్తులు పలికెను. (వానికి తన బల ముపై చాల నమ్మక ముండెను.)అపుడు ముసల్మానుల సైన్య మునుండి ఒక యువకుఁడు ముందునకువచ్చి వానిని మార్కొని వధించి వేసెను. ఖారను వధింపఁబడఁగానే ముసల్మానులు పైఁబడి యుద్ధము చేయసాగిరి. ఈరానులలో పెక్కురు వధిం పఁబడిరి. మఱిపెక్కురు పాఱిపోవుచు నదిలోమునిఁగి చచ్చిరి. అందు కొందఱు నావలనెక్కి నది దాఁటి పోయిరి.

—: వలజా యుద్ధము :—

ఈరాన్ (పారసీక) రాజునకు తన సైన్యము ఓడి పోయిన విషయము తెలిసి ఇంద్రజగరు అను వీరుని సేనాధి

పతిగాఁజేసి గొప్పసైన్యమును పంపెను. వాని పిమ్మట బహ మనుజాదులియా అను వీరుని సేనాధిపతిగాఁజేసి మఱొక సైన్యమును పంపెను. ఈయిద్దఱు సేనాధిపతులు వజలా అను చోట మఖాము చేసిరి. ఈవిషయము హజ్రత్ ఖాలిదుగారి కిఁదెలిసి వారుకూడ శత్రుసైన్యములను మార్కొనుటకై వజలా చేరిరి. ఆపిదప వారి సైన్యములమధ్య ఘోరయుద్ధము సంభవించి తుదకు యీరానులు ఓడిపోయిరి. ఇంద్రజగరు వధింపఁబడెను. బహమను జాదులియా ప్రాణము దక్కించుకొని పాఱిపోయెను. ఈయుద్ధములో బకరు వంశమునకు చేరిన అరబ్బుక్రైస్తవులుకూడ బాలుగొనిరి. వారిలో పెక్కుమంది వధింపఁబడిరి. బకరు క్రైస్తవులకు తమ వారు వధింపఁబడి రను విషయము వలన చాల రోషము గలిగి ఈరాను రాజు నకు "మేము ముసల్మానులతో యుద్ధమాడుదుము. మాకు సహాయము చేయవలెను"అని విన్నపము చేసికొనిరి. దానికి రాజు బహమనుజాదులియాను నియమించెను. కాని అతఁడు ధైర్యము వదలి జాపాను అను మఱొక నాయకుని నియమించెను. తాను మాత్రము ముఖ్యపట్టణమగు మదాఇనునకు పోయి రాజునకు ముసల్మానులనుగూర్చి వాస్తవము తెలుప వలెననికోరి బయలుదేఱెను. కాని రాజు వ్యాధిగ్రస్తుఁడా యెను అని విని నిలిచిపోయెను.

## —: అల్యాసు యుద్ధము :—

జాపాను తన సైన్యమును బకరువారి జనులను తీసికొని పోయి అల్యాసుచోటున మఖాముచేసెను. హజ్రత్ ఖాలిద్ గారుకూడ తమ సైన్యమును తీసికొని అచ్చట చేరిరి. ఖాలిద్

తమ యాచారమునుబట్టి పోటి యుద్ధమునకై శత్రువును పిలి చెను. అపుడు బకరు వారి నుండి యొక వీరుఁడు ముందుకు వచ్చి మార్కొనెను. కాని వాఁడువధింపఁబడెను. దీని పిదప ముసల్మానులు ఈరానుల సైన్యముతో యుద్ధము సలుప సాగిరి. ఘోర యుద్ధము జరిగెను. ఈ యుద్ధమున ఈరానీలు చాల ధైర్యము చూపిరి. తమకు బహామను జాదులియా సహా యము వచ్చును అని వారు తలఁచియుండిరి. కాని ఇంకను సూర్యుఁడువాలకమునుపే ఈరానులును, బకరువారును యుద్ధరంగము వీడి పాఱిపోసాగిరి. అనేకులు వధింపఁబడిరి. ఇది హిజ్రీ పండ్రెండవయేఁట సఫరు నెలలో సంభవించెను.

—: హీరా జయము :—

అల్యాసు యుద్ధము ముగిసిన పిదప హజ్రత్ ఖాలిద్ గారు హీరాపై దాడి వెడలిరి. ఇరాకులోనున్న అరబ్బుల సర్దారులకు హీరా ముఖ్యపట్టణముగానుండెను. ఈ అరబ్బులు ఈరానురాజునకు కప్పముకట్టుచుండిరి. హజ్రత్ ఖాలిద్ గారు హీరాకు పోవుటకు సముద్ర మార్గమున బయలుదేఱిరి. వారు హీరాపురమును సమీపింపఁగా అచ్చటి అధికారి పాఱి పోయెను. హజ్రత్ ఖాలిద్‌గారు అచ్చటిముఖ్యమైన స్థలము లను ముట్టడించిరి. అచ్చటి నాయకులకు మీరు ఇస్లాములో చేరుఁడుఅని కబురు పంపిరి. కాని ఆనాయకులు దానిని తిరస్కరించిరి. హీరాపురనివాసులు, తమయందు ముసల్మా నులను మార్కొను శక్తిలేనిది చూచితమ నాయకుడు ముసల్మానులతో సంధిచేసికొనవలెనని నిర్బంధించిరి. అందు లకు అమరుబిన్ అబ్దిల్‌మసీహ్ హజ్రత్ ఖాలిద్‌గారి యొద్దకు

వచ్చి సంధినిగూర్చి సంభాషించి ఒక లక్షతొంబదివేల దీర్హా ములు ప్రతి సంవత్సరము జిజ్యాపన్ను చెల్లింతుము అని యొడంబడిక చేసికొనెను. హీరాసర్దార్లు తమ పూర్వా చారమును బట్టివిలువైన కానుకలు ముసల్మానుల సేనాధిపతికి నొసంగిరి. కాని హజ్రత్ ఖాలిద్ గారు ఆకానుకలన్నిటిని ఖలీ ఫాగారి నిర్ణ్వధికిపంపుచు హీరావిజయమును గూర్చి కబురుపంపిరి. హజ్రత్ అబూబకరు ఆవిలువైన కానుకలను బహుమానముగా నమ్మతింపక వానిని జిజ్యా పన్నుగా గ్రహించిరి.

హజ్రత్ ఖాలిద్ గారు, పై వివరింపఁబడిన అన్ని యుద్ధ ములలోను ఇస్లామమత ధర్మముల ననుసరించియున్న యుద్ధ సూత్రములను పాటించుచు ముందు ఎదురుపక్షమువారిని ఇస్లా ములో చేరుఁడు. అట్లు కానిచో జిజ్యాపన్ను చెల్లింపుఁడు అని కబురు పంపుచుండిరి. ఈ రెంటిని సమ్మతింపని వారితో యుద్ధము సలుపుచుండిరి. యుద్ధమాడు సైనికులతో నే యుద్ధము చేయుచుండిరి. సామాన్యమైన రైతుజనుల జోలికిపోకుండిరి. జిజ్యాపన్ను చెల్లించి ముసల్మానుల సంరక్షణక్రింద నుండుటకు సమ్మతించినవారి ప్రాణ, ధన, మానరక్షణములకు ముసల్మా నులు బాధ్యులగు చుండిరి. ఒకవేళ ముసల్మానులు వారిని సంరక్షింపలేక పోయినచో జిజ్యాధనము తిరిగి యిచ్చివేయు దుము అని ముసల్మానులు వాగ్దనము చేయుచు తమ మాట ప్రకారము నడచుకొనుచుండిరి. జిజ్యాధనము తప్ప వేఱు ధనము గైకొనుటకు ముసల్మానులకు సెలవు లేకుండెను. దీనికి పూర్వమున్న ఈరాను అధికారులు కానుకల నెపమున చాల

ధనము ఈరానీలనుండి గైకొనుచుండిరి. యుద్ధములలో ముస ల్మానులకు లభించిన విజయధనము (మాలెగనీమత్) అయిదు భాగములుగ చేయుచుండిరి. అందు నాలుగు భాగములు సైని కులకు పంచిపెట్టఁబడుచుండెను. మిగత అయిదవ భాగము ఖలీఫాయొద్దకు పంపఁబడుచుండెను. ఖాలిద్‌గారు హీరాను జయించిన పిదపఅచ్చట శాంతము నెలకొలుపుట కేర్పాటులు చేసి సరిహద్దుల కాపుదలకై అధికారులను నియమించిరి. కప్పమును జిజ్యాను వసూలుచేయుట్కై విశ్వాస పాత్రులైన అధికారులను నియమించిరి. హజ్రత్ ఖాలిద్‌గారు గావించిన శాంతి భద్రతలను ఏర్పాటులను హీరాచుట్టుపట్ల నున్న సర్దార్లు చూచి ముసల్మానులతో సంధిచేసి కొనుటచాల యుత్తమమని తలఁచిరి. కావున ఫలాలీజునుండి హుర్‌ముజ్ జంద్ వఱకున్న ప్రాంతములోనున్న నాయకులు హజ్రత్ ఖాలిద్‌గారి సన్నిధికివచ్చి ప్రతిసంవత్సరము ఇరువది లక్షల దిర్హాముల నిత్తుమనిసంధిచేసికొనిరి.

హ్రజత్ ఖాలిద్‌గారు పైవివరింపఁబడిన కార్యములను నెఱవేర్చిన పిదప ఈరాను రాజునకును ఈరాను సర్దారులకును ఇట్లు లేఖలు వ్రాసిరి.

—: ఈరాను రాజునకులేఖ :—

దేవుని కృతజ్ఞత! సర్వశక్తుఁడగు దేవుఁడు మీ ప్రభుత్వమును తునుకలుతునుకలుగాఁజేసెను. మీకుట్రలను వృథా చేసెను. మీసంఘమును పలుచీలికలుగాఁజేసివేసెను. ఇట్లు దేవుఁడు చేయకున్నచో మీకుఁగూడకీడుగలిగియే యుండును.

మీరు మాఆధిపత్యమును అంగీకరింపుఁడు. మేము మీజోలి కిని మీ దేశము జోలికినిరాము. మిమ్ముఁవదలివేఱు దిక్కు నకు పోవుదుము. లేనిచో తుదకు ఇది సంభవించియే తీరును. మీరెట్లు బ్రతుకును ప్రేమింతురో అట్లు చావును ప్రేమించు వారలమగు మేము ఇది చేసియే చూపెదము.

—. ఈరాను సర్దారులకు లేఖ :—

దేవుని కృతజ్ఞత! దేవుఁడు మీ గర్వమును అణఁచి వేసెను. మీసంఘమును వేర్వేఱుగాఁజేసి వేసెను. మీ గౌర వమును నశింపఁజేసి మీ యైశ్వర్యమును నిర్మూలించెను. కావున మీరు ఇస్లాములో ప్రవేశింపుఁడు. మీరు రక్షణ పొందుదురు. అట్లుకానిచో జిజ్యాపన్నును చెల్లించుటకు నొప్పుకొనుఁడు. ఈరెంటిలో నొకటి మీరు సమ్మతింపనిచో మీరెట్లు మద్యపానమును ప్రేమించుచున్నారో అట్లుచావును ప్రేమించునట్టి జనులను తీసికొని మిమ్ము మార్కొనుటకు వత్తును.

ఈ రెండు లేఖలు ఈరానీయులకుఁబోయి చేరినపుడు వారియందు చాలవిభేదములు ఏర్పడియుండెను. ఉర్దుషేర్ రాజు మృతినొంది యుండెను. రాజవంశములో ప్రభుత్వము నకుఁదగిన పురుషుఁడు లేకుండెను. ఖాలిదుగారి లేఖల వలన వారు తమ విభేదములను వదలుకొని రాజ వంశములోఁదగిన వాఁడు లభించునంతవఱకు రాణీల సలహాతో ఫరుఖ్ జాద్ అను నొక నాయకుని రాజుగా నియమించుకొనిరి.

—: అంబారు, ఐనుత్‌తమరుల జయము :—

హజ్రత్ ఖాలిద్ బిన్ వలీదుగారు ఖాఖాబిన్ అమరు గారిని తమకు బదులుగా హీరాలో అధికారిగా నియమించి అంబారునకు బయలుదేఱిరి. అచ్చట షేర్ జాద్ సేనతో యుద్ధము సలిపిరి. షేర్ జాద్ తన చుట్టు అగడ్త త్రవ్వించుకొని యుండెను. ముసల్మానులు తమ యొంటెలనుకోసి వానితోఁ అగడ్తనునింపి దాని దాఁటిపోయిరి. షేర్ జాద్ ఇది చూచి ముసల్మానులు విధించిన షరతులను ఒప్పుకొని సంధిచేసి కొనెను.

అంబారును జయించిన పిదప ఐనుత్ తమరుపై దాడి సలిపిరి. అచ్చట బహారామ్ సేనాధిపతి తన గొప్ప సైన్య ముతో మఖాముచేసి యుండెను. అతని సైన్యముతో ఈరా నులకులోఁబడిన అరబ్బుల సైన్యముకూడనుండెను. అరబ్బులే ముందు ముసల్మానులను మార్కొనవలెనని విధించెను. కాని ఖాలిద్ గారు అరబ్బుల సేనాధిపతిని పట్టుకొనిరి. అరబ్బులు తమ నాయకుఁడు పట్టువడెను అని భీతిల్లి ధైర్యమువీడి యుద్ధ రంగమువదలి పాఱిపోసాగిరి. ఇది చూచి ఈరానుల సైన్యము కూడ పాఱిపోసాగెను. ముసల్మానులు కోటను పట్టుకొని అందలి సైనికులను వధించిరి.

—: దౌమతుల్ జందలు విజయము :—

హజ్రత్ ఖాలిద్ గారు 'ఐనుత్ తమరు'లో నున్నపుడు వారికి హజ్రత్ అయాజుగారి లేఖ వచ్చెను. అందు వారు

వచ్చి తమకు తోడుపడ వలెనని వ్రాసియుండిరి. (దౌమతుల్ జన్దలు ఉత్తర ఇరాఖులో నున్నవి.)

హజ్రత్ పైగంబరులవారు తమ జీవితకాలములో దౌమతుల్ జన్దలును జయించుటకు హజ్రత్ ఖాలిద్ గారిని సేనాధిపతిగా నియమించి పంపఁగా వారు అందు అధికారిగా నున్న అకీదరుబిన్ మాలిక్ అను వానిని పట్టుకొని హజ్రత్ పైగంబరులవారి సన్నిధికి తెచ్చిరి. హజ్రత్ రసూలువారు అకీదరును క్షమించి జిజ్యాచెల్లించు షరతుపై వాని దేశము వానికిచ్చి వేసిరి. కాని హజ్రత్ అబూబకరుగారి కాలములో అకీదరు ఒడంబడికను విరోధించి జిజ్యాచెల్లించుటను మాను కొనెను. అందు జూదీ అను వాఁడు కూడ అకీదరుకు తోడుగా నుండెను. అయాజుబిన్ గనమ్‌గారు తమకు విధింపఁబడిన కార్యములు నెఱవేర్చుచు దౌమతుల్ జన్దలునకువచ్చి చేరిరి. జూదీ సేనాధిపత్యమున క్రైస్తవుల గొప్ప సైన్యము అయాజగారిని మార్కొనెను. అపుడు విధిలేక అయాజుగారు ఖాలిద్ గారి సహాయముకోరవలసివచ్చెను.హజ్రత్ ఖాలిద్ గారువచ్చినవార్తవిని అకీదరు పాఱిపోయెను. కాని జూదీ ఘోరయుద్ధము సలిపి ఓడి పోయెను. ముసల్మానులుకోటను ఆక్రమించుకొనిరి. హజ్రత్ ఖాలిద్ గారు అకీదరును వెదకిపట్టి తెచ్చుటకు కొందఱిని నియమించిరి. తుదకు అకీదరు పట్టువడి వాఁడు గావించిన ద్రోహమునకు వధింపఁబడెను.

దౌమతుల్ జన్దలు జయించిన పిదప హజ్రత్ ఖాలిద్ గారు తిరిగిహీరావచ్చిచేరిరి. ఈరానులును అరబ్బులును ఐనుత్

తమరులో తమకు లభించిన అపజయమునకు ప్రతీకారము చేయుటకు హసీద్ 'ఖనాఫిసు'లో నొక సైన్యము మఖాము చేసియున్నవి అని హజ్రత్ ఖాలిద్ గారికిఁ దెలిసి దానిని మార్కొనుటకు సైన్యమునంపిరి. ముసల్మానులు పోయి ఆ సైన్యమును మార్కొని ఓడించి తఱుముఁగొట్టిరి. ఆ పిదప ఖాలిద్ గారు ముజీహానకు బయలుదేఱిరి. అచ్చట అరబ్బుల నొక సైన్యమును మార్కొని దానిని ఓడించిరి. ఆపిదప 'సనీ' పషరుఅనిచోటులలో యుద్ధములు సంభవించెను. అన్నిటి లోను ముసల్మానులే జయముగాంచిరి.

—: ఫరాజు యుద్ధము :—

ఈరానులు, రోమనులు, అరబ్బులు, అందఱును చేరి గొప్ప సైన్యము సమకూర్చుకొని మహారోషముతోను గొప్ప ధైర్యముతోను పురాతునది దాఁటివచ్చి ముసల్మానులతో ఘోర యుద్ధము సలిపిరి. తుదకు ముసల్మానులకు గొప్ప జయము లభించెను. ఇది హిజ్రీ పండ్రెండవయేఁట జూఖాదా నెల 15 వ తేదీ సంభవించెను. ఆపిదప ఖాలిద్ గారు తమ సైన్యమును ఆసిముబిన్ అమరవెంట హీరాకుపంపి తాము వెనుకవచ్చు సైనికుల (సాఖా)తోఁబాటు వచ్చెదమని నియమించితాము ఎవరికిఁ దెలియకుండ ఆ కొలఁది వ్యవధిలోనే మక్కాపురముపోయి కాబాయాత్ర (హజ్) చేసితమ సైనికులు హీరాకుపోయి చేరకముందే వారితోఁగలిసికొనిరి.

—: సిరియా యుద్ధములు :—

హజ్రత్ అబూబకరుగారు హిజ్రీపదుమూఁడవ యేఁట

సిరియా, రోమను వారి యుపద్రవమును తొలఁగించుటకుఁ గాను సైన్యముపంపుట కేర్పాటు చేసిరి. ఆసైన్యమును నాలుగు భాగములుగఁజేసి ప్రతిభాగమునకు నొక ప్రత్యేక సేనాధిపతి నియమించి వేర్వేఱు దిక్కులనుండి సిరియాపై దాడివెడల వలెనని విధించిరి. అందు హజ్రత్ అబూఉబైదాబిన్ జర్రాహ గారిని హిమ్మసుదిశకును, అమర్ బిన్ ఆసుగారిని పాలస్తీనా వైపునకును యజీదుబిన్ అబీసుఫ్యానును డమష్కుదిక్కునకును షురహీబ్బులుబిన్ హాసనాను ఉర్దను వైపునకును పోవునట్లు నియమించిరి. హజ్రత్ అబూబకరుగారు సైన్యమును సాగనంపుటకు కొంతదూరమునడచిపోయి సేనాధిపతులకిట్లు ఉపదేశించిరి. (1) మీరుపరిస్థితిలోను దేవునికే భయపడవలెను. ఆతఁడుబహిరంగములను చూచునట్లు మర్మములను కూడ చూచుచున్నాఁడు. (2) తమ అధికారములోనున్న వారినిగూర్చి బాగుగ చూడవలెను. (3) వారికి బోధించునపుడు చాలసంగ్రహముగా బోధింపవలెను. ఎక్కువపెడుగాటి యుపన్యాసముల వలన నినువారు వెనుకటి భాగమును మఱచిపోవుదురు. (4) ముందు మీరు మీసవరణగావించు కొనవలెను. ఆపిదపమిమ్ము చూచి యితరులు తమ్మునాయు సవరించుకొందురు. (5) తమ రహస్యవిషయములను జాగ్రత్తగా బయలు పడకుండ కాపాడవలెను. లేనిచో ఏర్పాటులుచెడి పోవును. (7) మీరెల్లపుడు సత్యమేపలుకవలెను. దీనివలన సరియైన సలహా లభింపఁగలదు. (8) రాత్రిపూఁట మీయనుచరుల సభలలోవారితోఁబాటు కూర్చుండవలెను. అపుడు మీకు అన్నివిధముల వార్తలు తెలియనగును. (9) సైన్యము పారా (కాపుదల)ను గూర్చి మంచి

యేర్పాటుచేయవలెను. ఆకస్మికముగా పోయికాపుదల(పారా) చేయువారి పనిని పరిశీలింపవలెను. అసత్యములాడు వారి సాంగత్యము కూడదు. సత్యవంతులై విశ్వాస పాత్రులైనవారి సహవాసమును, స్వీకరింపవలెను. (11) ఎవరితో కలిసినను సద్బుద్ధితో కలియవలెను. పిఱికితనము వహింపరాదు. నమ్మక ద్రోహము చేయరాదు. (12) మార్గమధ్యమందు కొందఱు ఇహలోక సౌఖ్యములను రోసి మఠములలో నుందురు. అట్టి వారిజోలికి పోఁగూడదు. వారిని వారిస్థితిలోనే వదలిపెట్టుఁడు.

ఆసిదప ముసల్మానుల సేనాధిపతులు సిరియాసైకి దాడి సలుపుటకు తమతమ దిక్కులకు పయనమైపోయిరి. అందు హాజ్రిత్ అబూఉబైదాగారు జాబియాచోటున యజీద్ బిన్ అబీసుఫ్యాను బలఖాప్రదేశమున, షురహ్బీలు బుస్రాతెంపున, అమర్ బిన్ ఆసు అరబా చోటున, మఖాముచేసిరి. ఈ విష యము సిరియా, రోమను వారికిఁ దెలిసి ముసల్మానులు తమ్ము నలుదిశలనుండి ముట్టడించిరి గదా? అని భీతిల్లి తమకుతోడు పడవలెనని తమ రాజుగు హిర్ఖలును కోరిరి. అపుడు హిర్ఖలు బైతుల్ ముఖద్దసులోనిలిచి యుండెను. ముసల్మానుల విషయ ము తెలిసి రాజు తన సర్దారులందఱిని సమావేశ పఱచి "మనము ముసల్మానులతోసంధి చేసికొని సిర్యాదేశము నుండి వచ్చు కప్పములో సగము ముసల్మానులకిచ్చి మిగత సగము మేము దక్కించుకొనుట యుత్తమము. లేనిచో సర్వముగోలు పోవుదుము అని తన అభిప్రాయము వారికిఁ దెలిపెను. కాని వాని సర్దారులు వాని మాటను సమ్మతింపక

యుద్ధమే చేసి తీరవలెనని పట్టుపట్టిరి. అపుడు హిర్ఖలు జెరుస లేము నుండి బయలు దేఱి హిమ్సునకువచ్చి చేరెను. అచ్చట తనసేనలను సేకరించెను. ముసల్మానుల సైన్యము నాలుగు భాగములుగ నాలుగువైపులనుండి దాడి సలుపుచున్నది అని తెలిసి ఒక్కొక్క భాగమును మార్కొనుటకై తన నాలుగు సైన్యములను నియమించెను. హిర్ఖలుయొక్క తమ్ముఁడు తద్రాఖో అను వాఁడు తొంబది వేల సైన్యము తీసికొని అమర్ బిన్ ఆసు గారిని మార్కొనుటకు బయలు దేఱెను. జర్ జీరు అనునతఁడు ఏబది వేల సైన్యముతో యజీదును మార్కొనవలెనని వెళ్లెను. ఖైభార్ అను వాఁడు అఱువది వేలసైన్యముతోఁబాటు అబూ ఉబైదాగారినిమార్కొనుటకు పయనమాయెను. దరాఖసుఅను నతఁడు నలువది వేల సైన్యముతో షురహీల్బలు నెదుర్కొను టకై పోయెను.

శతృవు గొప్ప సన్నాహముతో వేర్వేఱుగా ముస ల్మానులను నాశము చేయును ద్దేశముతో యుద్ధమునకు సిద్ధ మైన విషయము ముసల్మానులకుఁ దెలిసి పరస్పరము దానిఁ గూర్చి సలహాచేసిరి. అందు అమర్ బిన్ ఆసుగారు "మన మం దఱమొక చోటననేచేరి శతృవును మార్కొన వలెను. అపుడు మన సంఖ్య కొద్దిగానున్నను ఓడిపోము" అని తమ అభిప్రాయము తెలిపిరి. అందఱును దానికి సమ్మతించి హజ్రత్ అబూబకరుగారికి దానిగూర్చి సెలవు అడిగిరి. వారు సెలవు నొసంగుచు నిట్లు వ్రాసిరి:—

"ముసల్మాను లెపుడును ఓడిపోరు. కాని వారు పాప ములలో మునిఁగిపోయినచో ఓడిపోవుదురు. కాఁబట్టి ముసల్మా

నులు పాపముల జోలికి పోఁగూడదు." ముసల్మానులు ఖలీఫా గారి సెలవుపొంది అందఱును ఒకచోట చేరిరి. ఈ విషయము హిర్ఖలునకుఁదెలిసి తన సైన్యములన్నియు ఒకచోట చేర్చవ లెను. అని యుత్తరువు గావించెను. దాని ననుసరించి వాని సైన్యము లన్నియు యర్మూకు అను లోయప్రక్కనుండు వాఖూసా అనుచోటున మఖామము చేసెను. హజ్రత్ అబూ బకరుగారి సెలవు ననుసరించి ముసల్మానుల సైన్యముకూడ రోమనుల సైన్యమునకు నెదురుగావచ్చి రోమనుల దారిని అడ్డగించెను. అట్లు రెండు పక్షముల సైన్యములు యుద్ధము సఫరునుండి రబీఉస్సానీ వఱకు సలుపకుండ తమ తమస్థానము లలో మూఁడు నెలల వఱకు నిలిచియుండెను. రోమనులుండిన స్థానముచాల పదిలముగా నుండెను. వారివెనుక కొండయును ఎదుట సముద్రముండెను. మఱి వారి సైన్యము చాల నెక్కు వగా నుండెను. కావునముసల్మానులు తమకును సహాయముగ సైన్యము పంపవలెను అని ఖలీఫాసన్నిధికి విన్నపము చేసికొ రిని. హజ్రత్ అబూబకరుగారు ఇరాకునుండి సిరియాకుపోయి తోడుపడవలెనని ఖాలిదుగారికి ఉత్తరువు గావించిరి. వారి యు త్తరువు ప్రకారము ఖాలిదుగారు ముసన్నాబిన్ హారిసాను తమ కుబదులుగ ఇరాకులోనియమించిపది వేల సైన్యము తీసికొని చా లవేగముగా యర్మూకునకు పయనమైరి. మార్గమధ్యమందు ఖా లిద్ గారు యుద్ధము లు సలుపవలసివచ్చెను.అరకు అనుపురమున కుచేరగా అచ్చటివారు సంధిచేసికొనిరి. ఆపిదప తద్మరుపోయి చేరఁగా అచ్చటివారు కోటతలుపులు వేసికొనిపోరాడి తుదకు సంధిచేసికొనిరి. ఖర్యతైను పురముచేరి అచ్చటి వారిని జయిం

చిరి. మరజరాహితువచ్చి అచ్చటనున్న గస్సానీ వారని ఓడిం
చిరి. అటుపిమ్మట గౌతానుపై దాడిసలిపి దానిని జయించిరి.
ఆపిదప బుసాొపురము చేరిరి. అచ్చటివారు సంధికొఱకు విన్న
వించిరి. దానికి ఖాలిద్ గారు సమ్మతించిరి. బుస్రా, సిరియా దేశ
ములోని పురము. ఇది ఖాలిద్ గారిచేత జయింపఁబడిన సిరియా
దేశపురములలో మొట్టమొదటిది. అట్లు ఖాలిద్ గారు మార్గ
మధ్యనున్న పురములను జయించుచు రబీఉల్ ఆఖరు నెలలో
యర్మూక్ పోయి చేరిరి. రోమనులకుఁగూడ తోడుపడుటకు
మఱొక గొప్పసైన్యము వచ్చిచేరెను. బాహాను అను రోమను
సర్దారుఁడు పెక్కుమంది మత నాయకులను తనవెంటఁ బెట్టు
కొని రోమనుల సైన్యములో చేరెను. ఇపుడు ముసల్మానుల
సైన్యము ముప్పదియాఱు వేలుండెను. రోమనుల సైన్యము
రెండులక్షలు నలువది వేలుండెను.

—: యర్మూకు యుద్ధము :—

"రోమనుల సైన్యము చాలఅధికముగాను నేర్పుపొంది
యుద్ధ నియమములనుబట్టి విధింపఁబడినది. ముసల్మానుల
సైన్యము సంఖ్యలో చాల తక్కువగానున్నది. మఱి ఒక
సేనాధిపతి యధికారములోకూడ లేక వేర్వేఱు సేనాధిపతుల
అధికారములోనున్నది. దీని వలన ప్రయోజనము లేదు"అని
హాజ్రత్ ఖాలిద్ గారుగ్రహించి ముసల్మానుల సేనాధిపతులను
సమావేశపఱచి యిట్లు ఉపన్యాసము చేసిరి:-

ఈయుద్ధము ఒకగొప్ప మతయుద్ధము. కావున ఈదినము
మేము డంబమును అవిధేయతను మాహృదయములనుండి తీసి

వేయవలెను. దేవునిప్రీతి పడయుటకు సర్వప్రయత్నములు చేయవలెను. చూడుండు శత్రువు చాల నియమముతో గొప్ప యేర్పాటులతో ఏకీభవించి యుద్ధరంగమునందున్నాఁడు. మఱి మీరు వేర్వేఱుగా చెల్లాచెదరై యున్నారు. మీ శత్రువు దాడి మీకు చాల హానికరముగా నున్నది. కావున ముసల్మానుల సైన్యమంతటికిని ఒక సేనాధిపతి నియమింపఁబడుట చాల ఉచితము. ప్రతిదినము సేనాధిపతి వంతువంతుగా నియమింపుఁడు. ఈనాఅభిప్రాయము మీరు సమ్మతింతురేని ఈదినము నన్ను సర్వసేనాధిపతిగా నియమింపుఁడు. ముసల్మానుల సేనాధిపతులందఱును ఖాలిద్ గారి మాటను సమ్మతించి వారిని సర్వసేనాధిపతిగా నియమించుకొనిరి.

రోమనులు చాల విఱ్ఱవీఁగుచుగొప్పవైభవముతో యుద్ధరంగముఁడునకువచ్చి నిలిచిరి. ఖాలిద్ గారు గొప్ప నేర్పుతో తమ సైన్యమును నలుబది భాగములుగఁజేసి కొంతభాగము మధ్యలో నియమించి దానికి అబూఉబైదా గారికి నాయకులుగాఁజేసిరి. కొంతభాగము కుడిప్రక్కన నియమించి దానికి అమర్ బిన్ ఆసును షురహీబ్లును నాయకులుగా నియమించిరి. కొంత భాగము ఎడమప్రక్కన నియమించి దానికి యజీద్ బిన్ అబీసుఫ్యానుస నాయకునిగా విధించిరి. వెయ్యివెయ్యి సైనికుల నొక్కొక్క భాగముగాఁజేసి వానికిఁదగిన నాయకులను నియమించి వీరందఱు నాయకుల అధికారములో నుండునట్లు ఏర్పాటు చేసిరి. సైనికులను ప్రోత్సాహపఱచుటకై అబూసుఫ్యానునఖీబు (ఉపన్యాసకుఁడుగా) నియమింపఁబడెను,

రెండు సైన్యములు మార్కొనుటకు సిద్ధముగా నున్న సమయములో "రోమనుల సైన్యమెంత అధికముగా నున్నది! మఱి ముసల్మానులు ఎంత తక్కువగా నున్నారు"అని ఒకఁడు పలికెను. అది హజ్రత్ ఖాలిదుగారువిని "అట్లు పలుకవలదు. ముసల్మానుల సైన్యమెంత అధికముగా నున్నది! మఱి రోమనుల సైన్యము ఎంత తక్కువగా నున్నది అని పలుకుము. సైన్యము అధికముగానున్నను తక్కువగానున్నను అది లెక్కలేదు. అసలు ఫలితము, జయమూ, అపజయమూ అను విషయము లెక్కింపఁబడునది"అనిపలికిరి. తుదకు ఘోరయుద్ధము ప్రారంభమాయెను. హజ్రత్ ఖాలిదుగారు మధ్యలోనున్న సైనికులను దీసికొని శత్రుసైన్యములోఁదూరి శత్రువుల రౌతు బంటులమధ్యను కాలి బంటులమధ్యను అడ్డుగానిలిచియుద్ధము సలుపసాగిరి. శత్రువులరౌతు బంటులు ముసల్మానుల దెబ్బకు ఆగలేక పాఱిపోసాగిరి. ముసల్మానులు పాఱిన వారికి దారివదలిరి.ఇపుడు కాలిబంటులు మిగిలియుండిరి. ఖాలిద్ గారుతమసైనికులను దీసికొని కాలిబంటులపైఁబడి వధింపసాగిరి. రోమనులు ముసల్మానుల దెబ్బకు తాళలేక పాఱిపోవఁజూచిరి. కాని వారి వెనుక కొండయుండెను. వారి యెదుట సముద్రముండెను. ఆ కొండఱు పాటులో నేమియుతోఁచక సముద్రపు వైపునకు మరలి పాఱిపోవుచు సముద్రములో మునిఁగిచచ్చిరి. అట్లు సముద్రములోమునిఁగి చచ్చినవారి సంఖ్య ఒకలక్ష యిరువది వేలుఅని తబ్రీచరిత్ర కారుఁడు వ్రాసియున్నాఁడు. వారు కాక ముసల్మానులచేత వధింపఁడినవారి సంఖ్య వేలుగా నున్నది. మూఁడు .వేలమంది ముసల్మానులు స్వర్గలోకముచేరిరి. ఈ

మహా యుద్ధములో ప్రప్రథమమున కొందఱు ముసల్మానులు రోమనుల దెబ్బకుతాళలేక యుద్ధరంగము వదలునట్టి స్థితి కలుగఁగా ఇక్రిమా బిన్ అబీజెహాల్ గారు "ఓముసల్మానులారా! నేను హజ్రత్ పైగంబరులవారితోకలిసి అనేక ధర్మయుద్ధములు సలిపియున్నాను. ఇపుడు వీఁపుచూపి పాఱిపోవుదునా! రండు. మీలోనెవరు ప్రాణముపోవునంత వఱకు యుద్ధము సలుపుదుమని ప్రతిజ్ఞ చేయుదురో వారు నా చేతిలో చెయ్యివేసి వాగ్దానము చేయుఁడు" అని పలుకఁగా నాలుగు వందల ముసల్మానులు దానికి సిద్ధమైరి. వారందఱు మహా ధైర్యముతో హజ్రత్ ఖాలిద్ గారి గుడారమున కెదుట యుద్ధము సలిపిశత్రువులను పాఱదోలిరి. ముసల్మానులు రెండవదినము ఇక్రిమాగారిని ఆతని కుమారుని హజ్రత్ ఖాలిద్ గారి సమక్షమునకు తీసికొని వచ్చిరి. వారి యిద్దఱి దేహములు గాయములతోనిండి యుండెను. వారు అవసాన కాల స్థితిలోనుండిరి. హజ్రత్ ఖాలిద్ గారు వారి ముఖముల నుండి దుమ్మునుతుడుచుచు వారి నోళ్లలో నీళ్లుకార్చుచుండిరి. తుదకు వారిద్దఱు ప్రాణములువీడి స్వర్గలోకము చేరిరి. (అల్లాః వారిని దయజూచుఁగాత!) ఈ గొప్ప యుద్ధములో ముసల్మాను స్త్రీలు కూడ పెక్కుమంది పాలుగొని తమ గొప్ప ధైర్యమును చూపిరి. యర్మూకు యుద్ధములో ముసల్మానులకు జయములభించిన పిమ్మట సిరియా దేశములో ముసల్మానుల పాదములు స్థిరమాయెను. ఇఁకఅచ్చట నుండి సిరియా దేశములో ముందునకు పోసాగిరి. యర్మూకు యుద్ధము ఇంకను జరుగుచుండెను. మదీనాపురము నుండి ఒకరు

లేఖను తీసికొని వచ్చిరి. అందు "హజ్రత్ అబూబకరుగారు పరలోకము చేరిరి. వారికి పిమ్మట హజ్రత్ ఉమరుగారు ఖలీఫాగానియమింపఁబడిరి. క్రొత్త ఖలీఫా, హజ్రత్ ఖాలిద్ గారిని సేనాధిపతి పదవినుండితొలఁగించి వారికి బదులుగ అబూ ఉబైదాగారిని సేనాధిపతిగా నియమించెను." అని లిఖింపఁబడి యుండెను. ఈ లేఖ అందఱికంటె ముందు హజ్రత్ ఖాలిద్ గారికి చేరెను. అందలి విషయము చూచివారు తమ హృదయములో కొంచెమైనను కష్టపడక రహస్యముగా అబూఉబైదాగారికిఁదెలిపి ఇఁక మీరు నాకు అధికారులు అని పలికిరి. కాని తమ విషయము ఎవరితోను చర్చింపక, పూర్వము వలెనే మహా ధైర్యముతో యుద్ధము సలుపుచుండిరి. ఆవిషయము చూచి ఒకరు ఏమయ్యా! మీపదవి పోయినను మీరు యుద్ధము చేయుటలో ఏలాటికొఱత చూపలేదే! అని పలుకఁగా నేను దేవుని ప్రీతికిఁగాను యుద్ధము సలుపుచుంటిని. కాని హజ్రత్ ఉమరుగారిని గూర్చి కాదు అని పలికిరి. చదువరులే వారినిష్కపట హృదయమును భక్తి విశ్వాసములును త్యాగ బుద్ధిని ఊహించునది.

—: హజ్రత్ అబూబకరుగారు పరలోకము చేరుట :—

హిజ్రీ పదుమూఁడవయేఁట జమాదిల్ ఆఖరు నెల యేడవ తేదీని హజ్రత్ అబూబకరుగారికి జ్వరమువచ్చెను. వరుసగ పదునైదు దినములు జ్వరము తీవ్రముగానుండెను. ఆ దినములలో వారు నమాజునకు కూడ మసీదునకు రాలేక పోయిరి. నమాజు చేయించుటకు హజ్రత్ ఉమరుగారిని నియమించిరి. హజ్రత్ అబూబకరుగారుతమకు జ్వరము దినదినము హెచ్చుట

చూచి యిఁక అంత్యకాలము సమీపించినది అని నిశ్చయించు కొని పెద్దపెద్ద సహాబా (పైగంబరులవారి శిష్యు)లను రప్పించి తమ పిమ్మట ఎవరు ఖలీఫా (మత ప్రభువు)గా నియమింపఁబడ వలెను అను దానిఁగూర్చి వారి యభిప్రాయము అడిగి హజ్రత్ ఉమరుగారిని గూర్చి తమ అభిప్రాయము తెలిపిరి. కొందఱు తప్ప వారి యభిప్రాయము చాల ఉత్తమమైనది అని సమ్మతించిరి. కొందఱుమాత్రము "హజ్రత్ ఉమరుచాల సమర్థుడు కాని చాలకఠినుడై వర్తించునేమో అనుభీతిగలదు" అని పలికిరి. దానికి హజ్రత్ అబూబకరుగారు "ప్రభుత్వ భారము ఆతనిపైఁబడినపుడు ఆకఠినత్వము తనంతటతానే మెత్తదనము గామాఱిపోవును" అనిపలుకఁగాఅందఱునుఏకగ్రీవముగాఁనొప్పు కొనిరి. ఆపిదప హజ్రత్ ఉస్మానుగారిని రప్పించి హజ్రత్ ఉమరుగారి ఖిలాఫత్‌ను గూర్చి యొక శాసనపత్రము (అహద్‌నామా) వ్రాయించి ముసల్మానులందఱుకు వినిపించునట్లు హజ్రత్ అబూబకరుగారు విధించిరి. ఆశాసనమిట్లున్నది:—

"ఈశాసన పత్రము హజ్రత్ పైగంబరులవారి ఖలీఫా (ప్రతినిధి) అగు అబూబకరు తాను పరలోకమునకు పోవు కాలమునందు వ్రాసినది. ఈఅవసానకాలమందు అవిశ్వాసి (కాఫిరు) కూడ విశ్వసించును. పాపి దేవునియందు నమ్మిక ముంచును. కావున నేను ఉమరుగారిని మీకు అధికారి (ఖలీఫా)గా నియమించుచున్నాను. ఈ నియామకములో మీ మేలు అన్నివిధముల నేను పాటించి యున్నాను. ఉమరుసత్యమందుండి న్యాయముగా పరిపాలన చేయును అనియే ఆతని యందు నాకున్న విశ్వాసము. ఒకవేళ న్యాయము చేయక

అన్యాయముచేసి సత్యమార్గమునుండి తొలఁగి పోయినచో రాఁబోవు అగోచరవిషయమునుగూర్చినాకేమి యెఱుక! నేను ముసల్మానుల మేలేకోరుచున్నాఁడను. ప్రతి మనుజుఁడును తాను చేసిన కార్యమునకు బాధ్యుఁడగును.''

ఆపిదప హాజ్రత్ అబూబకరుగారు ఒకరి సహాయమున మేడపై కెక్కి వచ్చిబయట సమావేశమై యున్న ముసల్మానుతో "ఓసహోదరులారా! నేను నాబంధువునుగాని నాయే అన్నదమ్ములనుగాని ఖలీఫాగానియమించలేదు. కాని మీలో నందఱికంటె నెవఁడుశ్రేష్ఠుఁడుగా నున్నాఁడో ఆతని నియమించితిని. మీరందఱు సమ్మతించుచున్నారా! "అనియడిగిరి. అందులకు అందఱును "మేముసమ్మతించితిమి'' అని యొప్పుకొనిరి. ఆపిదప హజ్రత్ ఉమరుగారిని రప్పించివారు అనుసరింపవలసిన అనేక ధర్మములను నీతులను బోధించిరి. హజ్రత్ ఉమరుగారు కూడ ఆయుపదేశములను తమ ప్రభుత్వ కాలములో నవలంబించి దేశమునకు చాలమేలు చేయఁగలిగిరి. అట్లు హాజ్రత్ ఉమరుగారిని ఖలీఫాగా నియమించిన పిమ్మట తనకున్న యాస్తిని గూర్చి వారసులకు చెందవలసిన విషయమును గూర్చి యేర్పాటులుచేసి తన సొంత భూమిని అమ్మి తాను ఖలాఫత్ కాలములో పుచ్చుకొన్న వేతనము (వజీఫా) తిరిగి ప్రభుత్వమునకిచ్చి వేయవలెను. నాదేహముపై నున్నపాత వస్త్రములతో నేనన్ను సమాధిచేయవలెను. ప్రభుత్వమునకు సంభంధించిన యేవస్తువైనను సరే హాజ్రత్ ఉమరునకు అప్పగింపవలసినది అని మరణ శాసనము విధించిరి. తుదకు హిజ్రీ పదుమూఁడవయేఁట జమాదిల్ ఆఖరు నెల

21 వ తేదీన సోమవారమునాఁడు హజ్రత్ అబూబకరుగారు పరలోకము చేరిరి. అపుడు వారికి వయస్సు అఱువదిమూఁడు సంవత్సరములు. వారు మరణించిన రాత్రియే హజ్రత్ పైగంబరులవారి సమాధిప్రక్కన వారిసమాధిగావింపఁబడెను. అల్లాః వారి యాత్మకుశాంతి నొసంగుగాత! హజ్రత్ అబూబకరుగారు రెండు సంవత్సరములు మూఁడు నెలలు పదిదినములు ఖిలాఫత్ (ప్రభుత్వము) చేసిరి. హజ్రత్ అబూబకరుగారు మరణించిన పిదప హజ్రత్ ఉమరుగారు కొందఱ ముసల్మానులను దీసికొని ప్రభుత్వ ఖజానా (బైతుల్‌మాల్)ను పరిశీలించిరి. అందు ఒక్క దిర్హాము (పావులా) మాత్రముండెను. అపుడు ఖజానా అధికారితో ఇంతవఱకు ఎంతధనము ఖజానాకు వచ్చియుండును అనిఅడుగఁగా దాదాపు రెండులక్షల దీనారములు ఉండవచ్చును అనిప్రత్యుత్తరమిచ్చెను. హజ్రత్ పైగంబరులవారి పద్ధతిని అనుసరించి హజ్రత్ అబూబకరుగారు ఎప్పటిరాఁబడిని అపుడుడే ప్రజలకుపంచిపెట్టుచు ధనమును నిలువచేయుటకు సమ్మతింపకుండిరి. అందులకే ఖజానాఖాలీగానుండెను.

—: హజ్రత్ అబూబకరుగారి సంతానము :—

హజ్రత్ అబూబకరుగారు కొన్ని వివాహములు చేసికొనిరి. అందు ఖతీలా అను ధర్మపత్నియందు అబ్దుల్లాః, బీబీ అస్మా అనువారు పుట్టిరి. ఉమ్మెరూమాను అను భార్యయందు బీబీఆయిషా, అబ్దుల్‌రహ్మాను అను సంతానము గలిగెను. (బీబీఆయిషాగారి వివాహము హజ్రత్ పైగంబరులవారితో నాయెను) అస్మాఅను స్త్రీయందు ముహమ్మద్‌బిన్‌అబీబకరు

పుట్టెను. హబీబా స్త్రీయందు ఉమ్మెకుల్సూ అను కుమార్తె జన్మించెను. హజ్రత్ అబూబకరుగారి ఖిలాఫత్ కాలములో అరేబియా దేశములో మాత్రము సంపూర్ణముగ ఇస్లామ్ మత పరిభుత్వము సాగుచుండెను. కాబట్టి అరేబియా దేశము పది పరగణాలుగా భాగించి యుండిరి. ప్రతిపరగణాలోను తమకు బదులుగ పరిపాలించుటకు నొక అధికారిని నియమించిరి. దేశపరిపాలనయేకాక, నమాజు చేయించుట, తగవులను తీర్చుట, నేరములు చేసినవారికి హద్దులు (శిక్షలు) నియమించుట, హత్యకు బదులు (ఖసాసు) తీసికొనుట అనునవి యీ అధికారికి సంబధించి యుండెను.

| పరగణాలు | | అధికారులు |
|---|---|---|
| మక్కాపట్టణము | ... | ఇతాబుబిన్ అసీద్ |
| తాయెఫు | ... | ఉస్మాన్ బిన్ అబిల్ఆస్ |
| సన్ఆ | ... | ముహాజిర్ బిన్ అబీఉమయ్యా |
| హజర్ మాత్ | ... | జియాద్ బిన్ లబీద్. |
| ఖౌలాన్ | ... | యాలాబిన్ ఉమయ్యా |
| జుబైద్ | ... | అబూమూసాఅష్అరీ |
| జరిష్ | ... | అబ్దుల్లాః బిన్ సౌర్. |
| బహ్రైన్ | ... | అలాబిన్ ఖజ్రమీ |
| నజ్రాన్ | ... | జరీర్ బిన్ అబ్దుల్లాః బజ్లీ. |
| జున్ద్ | ... | మఆజ్ బిన్ జబల్ |

ఇరాకు, సిరియా దేశములలో ఇంకను యుద్ధములు జరుగుచుండెను. కాబట్టి బందోబస్తు, పరిపాలన బాధ్యత అచ్చటనున్న సేనాధిపతుల పైననేయుండెను. మదీనాపురము

అరేబియా దేశమంతటికిని ముఖ్యపట్టణముగా నుండెను.అచ్చ టనే హజ్రత్ అబూబకరుగారు వసించుచుండిరి.

—: హజ్రత్ అబూబకరుగారి ఖిలాఫత్‌గూర్చి తుది పలుకు :—

హజ్రత్ అబూబకరుగారియందు దేశమును న్యాయముగ పరిపాలించుట కెన్ని సుగుణములు కావలసి యున్నవో అవన్నియు నుండెను. వారి పిదప రానున్న ప్రభువులకువారు మార్గదర్శకులు. వారి పరిపాలన కాలము కొద్దిగానున్నను వారియందున్న బుద్ధికుశలత, ధైర్యము, పట్టుదల, ఆలోచన అనుభవము, విద్య, జ్ఞానము, మొదలగువాని వలన వారు అంతః కలహములను అణఁచివేసి దేశములో శాంతమును, ధర్మమును నెలకొల్పఁగలిగిరి. మఱి రోమనురాజులు ఈరాను ప్రభువులు తమతమ సామ్రాజ్యములలో కావించుచున్న అన్యాయములకు ప్రజలు విసుగొందుచుండిరి. అట్టి సామ్రాజ్యముల బాధను లోకమునుండి తొలఁగించుటకు ప్రప్రథమున హజ్రత్ అబూబకరుగారే కృషిసలిపిరి. హజ్రత్ అబూబకరుగారి యందున్న సుగుణములను యోగ్యతలను వివరముఁగా ఉదాహరణములతో వ్రాయఁబలెనన్న గ్రంథము చాల పెరుగును. కావున వారియందున్న సుగుణములు మాత్రము పేర్కొందుము.

హజ్రత్ అబూబకరుగారు ఎల్లపుడు హజ్రత్ రసూలు వారి సాన్నిధ్యమున నుండెడి వారు. అందుచే వారికి ఖురానుసు గూర్చిన వివరము, అందలి ధర్మములు, పైగంబరులవారి యుపదేశములు బాగుగఁ దెలిసియుండెను. అందువారు గొప్ప నిపుణులుగా నుండిరి. హజ్రత్ రసూలువారి సమ్ముఖమున హజ్రత్ అబూబకరుగారికి చాల ప్రాముఖ్యముండెను. అనేక

విషయములలో హజ్రత్ పైగంబరులవారు హజ్రత్ అబూ బకరుగారి అభిప్రాయము తీసికొనుచుండిరి. వారిచ్చు సలహా కూడ సరియైనదిగానుండుచుండెను. మక్కాపురములోఉన్నపుడు ఉదయము సాయంకాలము హజ్రత్ రసూలువారు, వారియింటికి పోవుచుండిరి. వారు విద్యయందు చాల గొప్పవారు. వారికి కవిత్వమందు చాల ఇష్టము. అరబీభాషాయందు గొప్ప పండితులు. వారు గావించిన ఉపన్యాసములు చాల రసవంతములుగనుగంభీరములుగా నుండును. అరబ్బులలో వంశములంగూర్చి తెలిసియుండుట చాల గొప్ప విషయము. వీరికి అనేక కుటుంబముల వంశావళి తెలిసియుండెను. వారికి స్వప్నముల ఫలము (భావము) చెప్పుటలో చాల అనుభవముండెను. ఒకపుడు హజ్రత్ పైగంబరులవారు తమ స్వప్నఫలము అబూబకరుతో విచారించుచుండిరి. ప్రవక్త పదవికిని ఖిలాఫతునకు మధ్యగల భేదమువారు ప్రజలకుం దెలిపిరి. ప్రవక్త నేరుగా దేవుని సందేశము ననుసరించి ధర్మములు విధించును. ఖలీఫా ప్రవక్త విధించిన ధర్మములను అమలులోఁ బెట్టును. స్వయముగా నెద్దియు కల్పింపఁడు. కావున ఖలీఫా ప్రవక్తయొక్క ప్రతినిధి మాత్రమేకాని వేఱుగాదు అని స్పష్టముగాఁ దెలిపిరి. వారియందు వినయము, భక్తి, స్వార్థత్యాగము, పరోపకారము, ప్రజాసేవ దాతృత్వము, అతిథిసత్కారము అను సుగుణములు అధికముగానుండెను. వారియందు సాధారణత్వము చాల నుండెను. వారు సాధారణమైన దుస్తులుధరించి సాధారణమైన భోజనము చేయుచు ప్రజల సౌఖ్యమును పాటించుచుండిరి. పై వివరింపఁబడిన గొప్పతనము వలననే దేవుని

ప్రవక్తల పిదప అందఱు మానవులకంటె హజ్రత్ అబూబకరు గారు ఎక్కువ శ్రేష్ఠులు అని సర్వజనసమ్మతమైన ప్రసిద్ధి కలిగినది. దేవుఁడు వారి యాత్మకు సంపూర్ణ శాంతి పుణ్యములు ఒసంగుగాక!

---

రెండవ ఖలీఫా

# హజ్రత్ ఉమరుగారి వంశావళి

రెండవ ఖలీఫా పేరు ఉమరు. అబూహాఫ్సు అనునది కునీయత్. ఫారూఖ్ బిరుదము. తండ్రిపేరు ఖత్తాబ్. తల్లి పేరు ఖతమా. ఉమరుగారు అదీబిన్‌కాబు వంశములో పుట్టిరి. అదీసహోదరుఁడగు మురా అను వారి వంశములోనే హజ్రత్ పైగంబరులవారు జననమొందిరి. కావున ఉమరు గారి వంశమును హజ్రత్ రసూలువారి వంశమును 'లుయీూ' అను వారితో కలియుచున్నది. ఉమరుగారి వంశము అరబ్బులలో చాల గౌరవము గలది. ఖురైషుల రాయబారము, తగవులు తీర్చుటకు మధ్యవర్తిత్వము వీరి వంశముల వారికే చేరి యుండెను. హజ్రత్ రసూలువారు జననమొందిన పండ్రెండు సంవత్సరముల పిమ్మట ఉమరుగారు పుట్టిరి. వీరు సైనిక శిక్షయు, ఉపన్యాసశిక్ష(ట్రైనింగ్)యు బాగుగా పొందిరి. యౌవనము రాకమునుపే వీరు ధైర్యముతోను శౌర్యముతోను చాల ప్రసిద్ధిగాంచిరి. జీవనోపాయమునకుఁగాను వ్యాపారము చేయుచుండిరి. వ్యాపారమునకుఁగాను దూరదేశములకు

పోయిరి. అందు వారికి చాల అనుభవమును, దూరదృష్టియు, విశాల దృష్టియు లభించెను. అందులకే ఇస్లాములో చేరక ఖురైషుల తరఫున రాయబారిగా పోవుచుండిరి. కలహములను తగువులను తమ బుద్ధికుశలతతో చాల బాగుగ తీర్చుచుండిరి.

—: ఇస్లామ్ మత స్వీకరణము :—

ఉమరుగారికి 27, సం॥ వయస్సుండెను. అపుడు హజ్రత్ పైగంబరులవారు ఇస్లాము మతప్రచారము చేయసాగిరి. ఉమరు గారికి ప్రచారము పట్టలేదు. వారు దానికి విరోధులై దానిని అణచవలెనని చాల ప్రయత్నించిరి. ఎవరైన ఇస్లాములో చేరిన విషయము వారికి తెలిసినచో వారు ఇస్లాములో చేరిన వారికి విరోధులగు చుండిరి. వారి కుటుంబమునకు చేరిన ఒక బానిసస్త్రీ ఇస్లాములో చేరెను. అది తెలిసి ఆమెను చావ మోదిరి. కాని ఆమె ఇస్లామును వదల లేదు. వారే కొట్టి కొట్టి విసుగుచెందిరి. కాని ఆమె మాత్రము ఇస్లామును వదల లేదు. వారు అంత విరోధించినను ఒక్కనినైన ఇస్లామునుండి మరలింపలేక పోయిరి. వీరి విరోధము హజ్రత్ రసూలు వారికి చాల కఠినముగానుండెను. అందులకు హజ్రత్ రసూలు వారు దేవునితో "ఓ దేవా! అమర్ బిన్ హిషామ్ వలనను లేదా ఉమరుబిన్ ఖత్తాబు వలనను ఇస్లామునకు బలము గౌరవము దయచేయుము అని ప్రార్థించిరి. హజ్రత్ రసూలువారి ప్రార్థన (దుఆ) దేవుడు అంగీకరించి హజ్రత్ ఉమరుగారు ఇస్లాములో చేరునట్లు అనుగ్రహించెను. దానివివరమిట్లున్నది. ఒకదినము ఖురైషులుకూర్చుండి యుండిరి. అపుడు అబూజెహాలు "ఎవరు ముహమ్మదును చంపుదురో వారికి నూఱు ఒంటెలు నిచ్చె

దను”అని పలికెను. అది విని ఉమర్ లేచి “అదెంతపని, నేను నెఱవేర్తును”అని ప్రతిజ్ఞచేసి ఖడ్గము చేతఁబూని పైగంబరులవారిని వధించుటకు బయలుదేఱెను. దారిలో నయీము బిన్ అబ్దుల్లాః ఎదురుపడి ‘ఓఉమర్’ ఎచ్చటికి పోవుచున్నావు అని అడిగెను. నేను ముహమ్మదును వధించుటకు పోవుచున్నాను’అని అతఁడు పలికెను. అది విని నయీము “ముందు నీయింటి వారి విషయము చూడుము. నీచెల్లెలును నీబావయును ముసల్మానులై యున్నారు. ముందు వారిని సవరింపుము”అని చెప్పెను. అది వినినంతనే ఉమర్ తన బావయింటికి పోయెను. అప్పుడు వారు తమ యింటిలో ఖురానె షరీఫ్ పఠించుచుండిరి. ‘ఉమర్’రాక నెఱింగి వారు ఖురానె షరీఫును దాఁచిపెట్టిరి. అప్పుడు ఉమరు తన బావయింటిలో ప్రవేశించి “మీయింటిలోనుండి వినఁబడిన శబ్దమేమి?”అని చెల్లెలిని అడిగెను. అపుడామె “ఏమియులేదు”అని బదులు పలికెను. అపుడు ఉమర్ “లేదులేదు మీరు కులభ్రష్టులైనారని విన్నాను” అని పలుకుచు బావనుపట్టి కొట్టసాగెను. చెల్లెలు మధ్యలో విడిపించుటకై పోఁగా నామెనుకూడ రక్తము ప్రవహించునట్లుగ కొట్టెను. అపుడు చెల్లెలు “ఓఉమర్ నీశక్తి కొలఁదికొట్టుము. స్వీకరించిన ఇస్లాము మతమును విడనాడము”అని ధైర్యముగా పలికెను. ఆమెమాటల వలన ఉమర్ యొక్క మనస్సు మృదువుపడి చెల్లెలివంక చూచెను. ఆమె దేహమంతయు రక్తముతో నిండియుండుటచూచి మనస్సు మఱింత కరఁగిపోయెను.“మీరు చదువుచున్నది నాకును వినిపింపుడు”అని ఉమర్ చెప్పెను. అదివిని చెల్లెలు తమ యొద్ద

నున్న ఖురాను చూపించెను. దానిలోని వాక్యములు చదివి వినినంతనే ముహమ్మదువారి యొద్దకు నన్నుతీసికొని పొండు. నేను ఇస్లామునవలంబించితిని అని పలుకసాగెను. ఆకాలమున హాజ్రత్ పైగంబరులవారును వారిశిష్యులును అర్ఖము అనువారి గృహములో నుండిరి. ఉమర్ అచ్చటికిపోయి హెచ్చరించెను. అది విని పైగంబరులవారు ఎదురుపోయి "ఏమిఉమరు! ఎందులకు వచ్చితివి?" అని అడిగినంతనే ఉమర్ భయముతో వణఁకుచు "నేను ఇస్లాము నవలంబించుటకు వచ్చితిని"అని విన్నవింపఁగా పైగంబరులవారు సంతసించి అల్లాహుఅక్బర్ (అల్లాః సర్వాధికుఁడు) అని పలికిరి. అది విని అచ్చటనున్న ముసల్మానులందఱును అల్లాహు అక్బర్ అనిపలికిరి. హాజ్రత్ రసూలు వారిని వధించుటకుప్రతిజ్ఞపూనిబయలుదేఱినట్టి ఉమర్ పైగంబరుల వారికి ప్రియశిష్యుఁడాయెను. చూడుడు దేవుని మహిమ! హాజ్రత్ ఉమర్ ఇస్లాములో ప్రవేశించిన పిదప తమ ఇస్లాము స్వీకరణమును నిర్భయముగా వెల్లడించి కాబామసీదులో బహిరంగముగా నమాజు చేయసాగిరి. వీరే ఇట్లు గావించినది. ఇంత వఱకు ముసల్మానులు శత్రువుల భయముచే రహస్యముగా నమాజుసల్పుచుండిరి. కాబా మసీదులో నమాజు చేయలేకయుండిరి. కాని దీని పిమ్మట ముసల్మానులందఱును హాజ్రత్ ఉమరుగారితోఁబాటుపోయి కాబామసీదులో నమాజుచేయసాగిరి. ఖురైషులు అడ్డగించిరి. కాని హాజ్రత్ ఉమరువారియొద్ద దుష్టుల అడ్డగింపుసాగలేదు. హాజ్రత్ ఉమరుగారి వలన బలహీనులైన ముసల్మాను భక్తులకు చాల ధైర్యమును బలమును గలిగెను.

—: మక్కాపురమును విడిచి మదీనాపురము చేరుట :—

మక్కాపురములో ముసల్మానుల సంఖ్య హెచ్చు కొలఁది మక్కా అవిశ్వాసులు ముసల్మానుల విషయమున హెచ్చుగా విరోధము వహింపసాగిరి. అందుకు ముసల్మానులు తమ జన్మభూమిని వదలి మదీనాపురమునకు వలసపోసాగిరి. హజ్రత్ ఉమరుగారు ఇస్లాములో చేరిన పిదపదాదాపు ఆఱు ఏడేండ్లు మక్కాఖురైషులు వారిని పెట్టుబాధలకు సహించి యుండిరి. మదీనాకు పోవచ్చును అని హజ్రత్ పైగంబరుల వారు ముసల్మానులకు సెలవునొసంగిరి. దాని ననుసరించి హజ్రత్ ఉమరుగారు కూడ మదీనాకు పోవుటకు సంసిద్ధులైరి. మదీనాకుపోవు ముసల్మానులు ఖురైషుల దౌర్జన్యము నుండి తప్పించుకొనుటకై ఖురైషులకు తెలియకుండ రహస్యముగా పోవుచుండిరి. కాని హజ్రత్ ఉమరుగారు అట్లు చేయక ఆయుధములుధరించి కాబామసీదునకువచ్చి అచ్చటనమాజు ప్రదక్షిణము మహాశాంతితో చేసి "నేను మదీనాపురము పోవుచున్నాను. ఎవఁడు తన తల్లి యేడ్వవలెనని కోరునోవాఁడు మక్కాపురమునకు బయటవచ్చి నన్ను మార్కొనవచ్చును" అని గట్టిగాప్రకటించిరి. అచ్చట పెక్కుమంది కాఫిర్లు (ఖురైషులు) ఉండిరి. కాని వారిని మార్కొనుటకు ఎవ్వనికిని ధైర్యముగలుగలేదు. ఆపిదప హజ్రత్ ఉమరుగారు సురక్షితముగా మదీనాపురముచేరిరి. ఆపిదప హజ్రత్ రసూలువారు కూడ మదీనాపురముచేరిరి. మక్కా నుండి వచ్చిన ముసల్మానులకు తోడుపడుటకై మదీనాలోనున్న ముసల్మానులు నియమింపఁబడిరి, అందు హజ్రత్ ఉమరుగారికి హజ్రత్ ఉత్బానుబిన్

మాలిక్ మతసహోదరులుగా నేర్పడి తోడుపడిరి. మదీనాలో ముసల్మానుల సంఖ్య హెచ్చుగానుండెను. అందుకు సమయము నకు వచ్చుటకు ఏర్పాటులేకుండెను. దానికిఁగాను హజ్రత్ ఉమరుగారిచ్చిన 'అజాను' (నమాజుకొఱకు పిలుపు) గూర్చిన సలహాపైగంబరులవారు సమ్మతించి దానిని నియమించిరి.

## —: ధర్మయుద్ధములలో పాల్గొనుట :—

హజ్రత్ పైగంబరుల వారు సలిపిన అన్ని ధర్మయుద్ధములలో హజ్రత్ ఉమరుగారు పాల్గొనిమహాధైర్యమును శౌర్యమునుచూపిరి. బదరుయుద్ధములో శత్రుపక్షమునచేరి యుద్ధమాడు చున్న మేనమామను కూడ వధించుటలో వారు వెనుదీయలేదు. అట్లువారు దేవుని ప్రీతిని పాటించుచుండిరి. బదరులోఖైదీలుగా డెబ్బది మందిపట్టుపడిరి. వారిని గూర్చి ఏమిచేయవలెను అని హజ్రత్ రసూలువారు తమ శిష్యులతో నాలోచించిరి. అపుడు హజ్రత్ అబూబకరుగారు ఖైదీలనుండి ఫిదియాధనము గైకొని విడుదల గావింపవలెను. అందుకు మన బంధువులే గదా అని విన్నవించిరి. కాని హజ్రత్ ఉమరుగారు దానికివ్యతిరేకముగా "ఖైదీలనువిడువ కూడదు. వారు ఇస్లాముకు చాలవిరోధులు. వారిని వధింపవలెను. ఎవరిబంధువులను వారే తమ చేతులార వధింపవలెను" అని ఆలోచన చెప్పిరి. కాని హజ్రత్ పైగంబరులవారు కనికరించి హజ్రత్ అబూబకరుగారి సలహా ప్రకారము ఫిద్యాధనము (బదులు) పుచ్చుకొని ఖైదీలను వదలిపెట్టిరి.

ఒహుదు యుద్ధములో కొందఱు విలుకాండ్రు గావించిన అవిధేయతవలన ముసల్మానులకు లభించియున్న జయము

అపజయముగా మాఱిపోయెను. శత్రువు హజ్రత్ పైగంబరుల వారినిక్రమ్ముకొని ఘోరముగా పోరాటము సలుపసాగెను. అట్టి సమయములోకూడ హజ్రత్ ఉమర్ గారు హజ్రత్ పైగంబరుల వారికి అంగరక్షకులుగా నుండి శత్రువును మార్కొనిరి. హజ్రత్ రసూలువారు తమశిష్యులతోఁబాటు ఒహుదు కొండపై నిలిచి యుండిరి. అపుడు ఖాలిద్ బిన్ వలీదు (అప్పటివఱకు వీరు ఇస్లామలోచేరి యుండలేదు.) కొందఱు సైనికులతో హజ్రత్ రసూలువారిని మార్కొటకు యత్నించెను. కానిహజ్రత్ ఉమరు కొందఱు ముసల్మాను వీరులను తీసికొని శత్రువును మార్కొని తఱిమివేసిరి. ఖురైషులనాయకుఁడగు అబూసుఫ్యాను ఒహుదు యుద్ధము ముగిసినపిదప ఒహుదుకొండ కెదురుగానున్న తిప్పపై నెక్కి "ముహమ్మద్ ఉన్నాఁడా"? అని కేక వేసెను. దానికి బదులియ్యకూడదు అని హజ్రత్ పైగంబరుల వారు తమ శిష్యులతోపలికిరి. మరల ఆతఁడు అబూబకరున్నాఁడా? అని కేక వేసెను. దానికిఁగూడ ముసల్మానులు జవాబియ్య లేదు. మూఁడువసారి 'ఉమరున్నాఁడా'అని కేక వేసెను. దానికి కూడ బదులు రానందున"అందఱువధింపఁబడిరి."అని అబూసుఫ్యాను పలికెను. అదివిని హజ్రత్ ఉమరుగారు సహింపలేక "ఓ దేవుని శత్రువుఁడా! ఇదిగోచూడుము. మేమందఱము సజీవులుగా నున్నారము"అని పలికిరి. అపుడు అబూసుఫ్యాను "ఉఅ్‌లు హుబలు ఓహుబలు (విగ్రహము పేరు) నీవుఘనుఁడవు అగుముఅని పలికెను. తత్క్షణమే హజ్రత్ ఉమరుగారు అల్లాహు-అఅ్‌లా-వ-అజల్లు (అల్లాః యే ఘనుఁడు. మఱియు సర్వాధికారియును) అని పలికిరి.

ఖన్దఖు (అగడ్త) యుద్ధములో మక్కా కాఫిర్లును యూదులును గొప్ప సైన్యములతో మదీనాపురమును ముట్టడించియుండిరి. అపుడు హజ్రత్ పైగంబరులవారు ఖున్దఖరక్షణార్థము కొందఱు ముసల్మాను వీరులను నియమించి యుండిరి. అందు హజ్రత్ ఉమరుగారు కూడ చేరియుండిరి. ఒకదినము శత్రువును మార్కొనుచు అసరు నమాజువేళకూడ తప్పిపోవనుండెను. ఆవిషయమువారు పైగంబరులవారితో విన్నవింపఁగా ఓఉమరు! నేనుకూడ ఈదినము ఇప్పటివఱకు అసరు నమాజు సలుపలేకున్నాను అని పలికిరి. హుదైబియాసంధి సమయమున సంధిషరతులు లిఖింపఁబడుచుండెను. అందు "కాఫిర్లలోఁగాని లేక ముసల్మానులలోఁ గానిఎవరైన మక్కాపురము నుండి మదీనాపురమునకు వచ్చినచో వారిని తిరిగి మక్కాపురమునకు పంపివేయవలెను. కాని మదీనాపురము నుండి యెవ్వరైన ముసల్మానులు మక్కాపురమునకు వచ్చినచో వారు తిరిగి మదీనాపురమునకు పంపఁబడరు అని యొక షరతుండెను. ఆషరతునుచూచి హజ్రత్ ఉమరుగారు సహింపలేక హజ్రత్ రసూలువారి సన్నిధికిఁబోయి "ఓరసూలుల్లాః మీరు దేవుని యొక్క సత్యమైన ప్రవక్తలు అయియుకూడ ఇట్టిషరతును ఏల సమ్మతింపవలెను. దీనివలన మతమునకు అవమానము గలుగును గదా! అని విన్నవింపఁగా "ఓఉమరు నేను దేవుని యొక్క సత్యమైన ప్రవక్తను. అందేలాటి సందేహములేదు. నేను చేసయుది దేవుని సెలవుపొంది యేచేయుచున్నాఁడను." అని పలికిరి. హజ్రత్ ఉమరుగారు తమ మత రోషము(غیرت دینی) తోనట్లు సంభాషించిరి. కాని అది ఉచితము కాదని పిమ్మట

పశ్చాత్తాపమునొంది హజ్రత్ ఉమరుగారుదాని పరిహారము (కఫ్ఫారా) గావించుకొని నిఱుపేదలకు దానముచేసిరి. మక్కా పురము జయింపఁబడిన పిదప మహావైభవముతో హజ్రత్ పైగంబరులవారు మక్కాపురములో ప్రవేశించిరి. కాఫిర్లకు అభయము నొసంగఁగా జనులు గుంపులు గుంపులుగా ఇస్లాములో ప్రవేశింపసాగిరి. హజ్రత్ రసూలువారు పురుషుల నుండి శపథము (బైఅత్) గైకొనుచు స్త్రీలనుండి శపథము (బైఅత్) గైకొనుటకు హజ్రత్ ఉమరుగారిని నియమించిరి.

తబూకు యుద్ధములో ముసల్మానులకు చాల ధనసహాయము కావలసియుండెను. అందుకు హజ్రత్ రసూలువారు ముసల్మాను ధనికులను ప్రోత్సాహపఱచిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు తమ పూర్తి యాస్తిలో సగము చందాగానిచ్చిరి. తుదకు గొప్ప సైన్యముతో పైగంబరులవారు దాడి వెడలి తబూకు మకాముచేసిరి. కాని శత్రువుభీతిల్లి యుద్ధమునకు రాలేదు. ఆపిదప హజ్రత్ రసూలువారు సురక్షితముగ మదీనా పురము తిరిగివచ్చి చేరిరి.

### హజ్రత్ పైగంబరుల వారియందు హజ్రత్ ఉమరుగారి భక్తి ప్రేమలు

హిజ్రీ పదునొకండవ సంవత్సరము హజ్రత్ పైగంబరులవారు పరలోకముచేరిరి. ఆవార్తవలన మదీనాపురమంతయు దుఃఖ సముద్రములో మునిఁగిపోయెను. అందఱికి మహాదుఃఖము గలిగెను. కొందఱు ఏమియుతోఁచక అది నిజముకాదు అని తలఁచిరి. అందు హజ్రత్ ఉమరుగారు తమకు పైగంబరుల వారి యందుగల ప్రేమభక్తులచే పరవశులై పైగంబరుల

వారి మరణమును గూర్చి నిశ్చయింపక ఖడ్గముదూసి "ఎవరు పైగంబరులవారు పరలోకము చేరిరి." అని పలుకుదురో వారిని ఖడ్గముతో నఱుకుదును" అని చెప్పుచుండిరి. తుదకు హజ్రత్ అబూబకరుగారువచ్చి బోధింపఁగా అపుడు హజ్రత్ ఉమరుగారు శాంతి వహించిరి.

—: హజ్రత్ అబూబకరుగారికి తోడుపడుట :—

హజ్రత్ అబూబకరుగారి ప్రభుత్వకాలములో ప్రారంభమునుండియే వారికి హజ్రత్ ఉమరుతోడు పడుచు సలహాదారుగా నుండిరి. హజ్రత్ పైగంబరువారు పరలోకముచేరిన పిమ్మట ఖలీఫా యెన్నిక సమయమున హజ్రత్ ఉమరుగారే ప్రప్రథమమున హజ్రత్ అబూబకరుగారినెన్ను కొనటకు సలహానిచ్చి శపథము (బైఅత్) చేసిరి. ఆపిదప అందఱు ముసల్మానులు సమ్మతించిరి. అట్లువారుఖలీఫా యెన్నికను గూర్చి గలిగిన గొప్పసమస్యను తమసామర్థ్యముతో తీర్మానింపఁ గలిగిరి. హజ్రత్ అబూబకరుగారు తమఖిలాఫత్ కాలములో గొప్ప గొప్ప కార్యములు హజ్రత్ ఉమరుగారి సలహాతోనే నెఱవేర్చిరి. ఇస్లాముమతమూల గ్రంథమగు ఖురానెషరీఫ్ కూడ వీరి ప్రోత్సాహమువలననే ఒక గ్రంథముగా సమకూర్పఁబడెను. ప్రభుత్వమునకు చేరిన గొప్ప బాధ్యతలలో తగవులఁదీర్చుట చాలముఖ్యమైనదిగదా! ఆబాధ్యత హజ్రత్ ఉమర్ గారు వహించితగవుల విచారించి తీర్పుగావించుచుండిరి. హజ్రత్ అబూబకరుగారు హజ్రత్ ఉమరుగారి యందున్న యోగ్యతలను గుర్తించియే తమపిమ్మట హజ్రత్ ఉమరుగారు ఖలీఫాగా నియమింపఁబడవలెనని తీర్మానము చేసికొనిరి.

—:హజ్రత్ ఉమర్‌గారి ప్రభుత్వకాలములోని జయములు:—

హజ్రత్ అబూబకరుగారు పరలోకము చేరిన పిదప హజ్రత్ ఉమర్‌గారు ఖిలాఫత్ పదవిని వహించిరి. మొదటి ఖలీఫాగారి కాలములో దేశములోని అంతఃకలహాములు నిర్మూలింపఁబడి శాంతమేర్పడెను. పరదేశములపై దాడివెడలుట ప్రారంభమై జయములుచేకూరుచుండెను. ఇరాకులో హజ్రత్ ఖాలిద్‌గారు సేనాధిపతిగా నియమింపఁబడి హీరా మొదలగు ఇరాకు దేశములోని పురములు జయించి యుండిరి. సిరియా దేశములో ముసల్మానులకు సహాయము కావలసి వచ్చెను. అపుడు హజ్రత్ ఉమర్‌గారు ఖాలిద్‌గారిని సిరియాకు పోవునట్లు ఆజ్ఞనొసంగిరి. ఖాలిద్‌గారు సిరియాకు పోవుచు తమస్థానములోముసన్నాగారిని నియమించియుండిరి. ముసన్నాగారియొద్ద సగము సైన్యము మాత్రముండెను. మిగత సగము హజ్రత్ ఖాలిద్‌గారు తీసికొని పోయిరి. ఆపిదప ఈరానులు గొప్పసైన్యము సమకూర్చుకొని హీరాపై దాడివెడలిరి. ఆసైన్యమునకు హార్ముజు అను ఈరానీ నాయకుఁడుగా నుండెను. 'బాబలు' అను పురమువద్ద ముసల్మానులకును ఈరానీయులకును ఘోరయుద్ధము జరిగి ముసల్మానులకు జయము గలిగెను. ముసన్నాగారు 'మదాఇను' పురము వఱకు ఈరానీయులను వెంటాడి తిరిగి 'హీరా' పురము వచ్చిచేరిరి. ఆపిదప ఈరానీయులు గొప్ప సన్నాహాములతో గొప్ప సైన్యము సమకూర్చుచున్నారు అని ముసన్నాగారికిఁదెలిసెను. దానికిఁ గాను ముసన్నాగారు తమ స్థానమున బషరుబిన్ ఖసాసిగారిని సేనాధిపతిగానియమించి ఈరానీయులదాడినిగూర్చివాస్తవము

ఖలీఫాకు తెలుపుటకై మదీనాపురమునకు వచ్చిరి. ముసన్నా గారు మదీనాపురమువచ్చి చేరినదినమే సాయంతనము హజ్రత్ అబూబకరుగారు పరలోకము చేరినది. అట్టి అంత్యస్థితిలోను హజ్రత్ అబూబకరుగారు ముసన్నాను రప్పించి అన్ని విషయములు చెవియొగ్గి విని హజ్రత్ ఉమరుగారిని రప్పించి "ఓ ఉమరు! ఇపుడు నేను ఇహలోకమును వీడిపోవు చున్నాను. నేను మరణించినచో మొట్టమొదట ముసన్నాకు సహాయముగా నొక సైన్యము ఇరాకునకు పంపుడు. ఇందు ఆలస్యమే చేయకుడు. ఇది మతముయొక్క గౌరవమును రక్షింపవలసిన గొప్ప సమస్య" అని పలికిరి. కావున హజ్రత్ ఉమరుగారు ఖలీఫా కాఁగానే మొట్టమొదట ఇరాకు సమస్యనుగూర్చి యేర్పాట్లు గావించుటకు పూనుకొనిరి. హజ్రత్ ఉమర్ గారి ఖిలాఫతును గూర్చి శపథము (బైఅత్) చేయుటకు చుట్టుపట్లపురముల నుండి పెక్కురు ముసల్మానులు మదీనాపురమునకు వచ్చి యుండిరి. హజ్రత్ ఉమర్ గారువారిని సమావేశపఱచి ఇరాకు దండయాత్రనుగూర్చి గొప్ప యుపన్యాసము గావించి అందు పాల్గొనుటకు ప్రోత్సాహ పఱచిరి. ఈరానీయుల ముఖ్యపట్టణమగు 'మదాఇను' ఇరాకులో నుండెను. దానిని జయించి పట్టుకొనుట సులువైన పని కాకుండెను. ఖాలిద్ గారే ఈరానీయులను మార్కొనఁగల సేనాధిపతి అని ముసల్మానులలో వదంతి ప్రబలియుండెను. దీనిబట్టియే నాయకులు దానికి పూనుకొనుటకు ధైర్యము వహింపక యుండిరి. కాని హజ్రత్ ఉమరుగారు "మతకార్యములను నిర్వహించుటకు ముసల్మానులు ఒక వ్యక్తిపైననే ఆధారపడి యుండకూడదు" అని తలఁచి

తమ యుపన్యాసము గావించుచునే యుండిరి. తుదకు అబూ ఉబైదెసఖఫీ వచ్చి ఇరాకుపై దండయాత్రి సలుపుటకు తాను బాధ్యత వహించుచున్నాను అని పలికెను. ఆ పిదప అనేకులు నాయకులు దానిలో పాల్గొనుటకు సిద్ధమైరి. హాజ్రిత్ ఉమరు గారు అబూఉబైదెసఖఫీని సేనాధిపతిగా నియమించి సైన్యము పంపుటకు ఏర్పాటులు గావించి ముసన్నాగారిని తత్క్షణమే ఇరాకునకుపంపి అబూఉబైద్ యొక్క రాకకు అచ్చట ఎదురు చూడవలసినదని సెలవు నొసంగిరి.

## —: ఈరానుల యుద్ధ సన్నాహములు :—

ఇంకను ముసన్నా మదీనాపురములోనే యుండెను. ఇరాకులో పెక్కు మార్పులు గలిగెను. ఈరానీయులు తమకు లభించిన అపజయముల వలన బుద్ధి తెచ్చుకొని పరస్పర ద్వేషములను కలహములను వదలుకొని ఐకమత్యముతో పూరాణ దుఖ్తు అను నామెను సింహాసనముపై నెక్కించి రుస్తుము అను వానిని ఆమెకు సహకారిగాను సర్వసేనాధిపతిగాను నియమించుకొనిరి. అందఱు నాయకులును రుస్తుమునకు లోఁబడి యుందుము అని ప్రతిజ్ఞ చేసిరి. రుస్తుము సర్వసేనాధిపతి కాఁగానే ఇరాకు గ్రామములలో తన జనులనుపంపి రోషము పుట్టునట్లుచేసి ఇరాకులోనున్న చౌదరీలందఱు తిరుగుబాటు సలుపునట్లు గావించెను. కావున ముసన్నా రాకమును పే పురాతునది యొడ్డుననుండు ముసల్మానుల గ్రామములు ఈరానులకు చేరిపోయెను. ఆపిదప నర్సీ, జాపాను లిద్దఱిని సేనాధిపతులుగాఁజేసి రెండు గొప్ప సైన్యములను ముసల్మానులపై దాడి సలుపుటకై నియమించెను. జాపాను తన సైన్యమును

దీసికొని 'నమారిఖు' చేరెను. నర్సీ తన సైన్యము తీసికొని కస్కరు అనుచోటున నిలిచెను. ముసన్నాగారు ఇరాకునకు తిరిగివచ్చిన పిదప ఆవిషయములను తెలిసికొని హజ్రత్ ఉమరుగారి సెలవు ననుసరించి అబూఉబైద్‌గారి రాకకు నెదురు చూచుచుండిరి.

—: నమూరిఖు యుద్ధము :—

ఒక నెల తరువాత అబూఉబైద్‌గారు తమ సైన్యము తీసికొని ఇరాకునకువచ్చిచేరిరి. కొన్నాళ్లు అలసట దీర్చుకొని జాపాను సైన్యమును మార్కొనుటకు పయనమై నమూరిఖు చేరిరి. రెండు సైన్యములకు ఘోరయుద్ధము జరిగెను. ఈరానీయులు మహారోషముతో త్యాగము వహించి యుద్ధము సలిపిరి. కాని ముసల్మానులదెబ్బకు ఆగలేక యుద్ధరంగము విడిచి వీఁపిచ్చి పాఱిపోయిరి. సేనాధిపతియగు జాపాను ఒక ముసల్మాను సైనికుని చేతిలో చిక్కుకొనెను. కాని ఆతఁడు సేనాధిపతి అని ఆ ముసల్మాను గుర్తింపలేదు. అప్పుడు జాపాను "నేను ఒక ముసలివాఁడను. నన్ను మీరేమి చేయుదురు. మీరు నన్ను వదలిపెట్టినచో చాల ధనము నిత్తును" అని విన్నవింపఁగా సరే నిన్ను వదలిపెట్టుదును. నీకు అభయమున్నది అని ఆముసల్మాను వీరుఁడు పలికెను. అపుడు జాపాను ఈవిషయము మీసేనాధిపతి సమక్షమునగట్టి పడవలెను. కావున నన్ను ఆతని యొద్దకు తీసికొనిపొమ్మని పలుకఁగా ఆతనిని ఉబూఉబైద్‌గారి యొద్దకుఁ గొనిపోయెను. అచ్చట ముసల్మానులు జాపానును గుర్తించిరి. అందు కొందఱు "ఈతఁడు మోసముచేసి అభయము పొందినాఁడు. కావున ఈఅభయము

రద్దుచేయవలెను" అని పలికిరి. కాని అబూఉబైద్ గారు "అట్లు కానేరదు. ఒక్క ముసల్మానుఁడు అభయము నొసంగినపుడు అందఱు ముసల్మానులు దాని నొప్పుకొనవలెను. ఇస్లాము మతములో ఆడిన మాటకు వ్యతిరేకముగాఁ జేయుటకు వీలు లేదు." అని పలికి జాపానును వదలి పెట్టిరి.

—: కస్కరు యుద్ధము :—

నమారిఖులో జయముపొందిన పిదప అబూఉబైద్ గారు కస్కరునకు వెడలిరి. అచ్చటనర్సీ తన సైన్యముతో నిలిచి యుండెను. నమారిఖు యుద్ధములోపాఱిపోయిన ఈరానీలు నర్సీసైన్యములోకలిసి కొనిరి. సఖాతియా అనుచోట రెండుసైన్యములమధ్య ఘోరయుద్ధము జరిగెను. ఈరానీలు మహాశౌర్యముతోయుద్ధమాడిరి. కాని తుదకు వారుయుద్ధరంగము వీడవలసివచ్చెను. అట్లు ఈరానీయులు అపజయము నొందఁగా ముసల్మానులకు జయముచేకూరెను. అబూఉబైద్ సఖాతియాలో మఖాము చేసిరి. దానికి చుట్టుపట్లనున్న ఈరానీ సైనికులను పాఱఁదోలుటకు కొంత ముసల్మానుల సైన్యమును నియమించిరి.

—: ఇస్లాములోని సమానత్వము :—

సఖాతియలో ముసల్మానులకు జయముగలిగినందు వలన చుట్టుపట్ల గ్రామములవారులోబడి అచ్చటి నాయకులు తమ విధేయత చూపుటకు అబూఉబైద్ గారి యొద్దకు మంచి మంచి వంటకములుచేసి తెచ్చిరి. అపుడు అబూఉబైద్ "అందఱు సైనికులకుఁగాను వంటకములు చేసితెచ్చినారా! లేదా నా ఒకని కొఱకు మాత్రమే తెచ్చినారా అని ప్రశ్నింపఁగా

"తొందరలో అందరికిని గాను చేయలేక పోయితిమి. మీకొ
రకు మాత్రమే చేయఁగలిగితిమి "అని వారు విన్నవించిరి.
అపుడు "ఎవరు అబూఉబైద్‌తోఁగలిసి యుద్ధమునందు తమ
రక్తమును ప్రవహింపఁజేసిరో వారిని వదలి అబూఉబైదు
మంచి వంటకముల రుచిచూడజాలఁడు. ఒక సైనికుఁడుసాధా
రణముగా ఏఆహారము తినునో ఆ యాహారమే అబూఉబైద్
భుజించును" అని పలికి దానిని గైకొనలేదు.

—: మరూహా యుద్ధము :—

ఈరానీలు ఓడిపోయిన విషయము రుస్తుమునకుఁ
దెలిసి ఒక ప్రసిద్ధిచెందిన ఈరానీ సర్దారుఁడగు బహామనె
జాదువియాను సేనాధిపతిగా నియమించి గొప్పసైన్యమును
ముసల్మానుల మార్కొనుటకు పంపెను. ఈరానీ ప్రభువుల
యొద్ద పారంపర్యముగా వచ్చుచున్న "దురఫ్ షెకావియానీ"
అను పతాకమును ఈరానీలు గొప్ప శుభముగలదిగా భావిం
చుచుండిరి. దానిని అవసరమైన కొన్ని సమయములలో
మాత్రము బయటికిఁ దీయుచుండిరి. ఆపతాకము ఈసైన్యము
తోఁబాటుండెను. అబూఉబైద్‌గారికి శత్రువు వచ్చుచున్నాఁ
డను వార్త తెలిసి ఫురాతునది యొడ్డుననుండి మరూహా అను
చోట చేరిరి. రెండు సైన్యముల మధ్య ఫురాతునది అడ్డుగా
నుండెను. అపుడు బహమను "నదిదాఁటి మీరు వచ్చెదరా!
లేక మేమురావలెనా!"అని అబూఉబైద్‌గారికి వర్తమానము
పంపెను. అబూఉబైద్ ఇతర నాయకులు మాటవినక పౌరుష
ముతో "మేమే నది దాఁటి వచ్చెదము"అని ప్రత్యుత్తరము
పంపిరి. ఆపిదప నదిపై నావలతో నౌక వంతెన నిర్మించి

ముసల్మానులు నదిదాటిపోయి అవతలి వడ్డుచేరిరి. అచ్చటి మైదానము మిట్టపల్లములుగలిగి సమముగా లేకుండెను. ముసల్మానుల సైన్యము వరుసదీర్చి పంక్తులుగా నిలుచుటకు వీలు లేకుండెను. ఈరానుల సైన్యమునకు ముందర పెద్దపెద్ద యేనుఁగులు వరుసగా నిలిచియుండెను. ఆనల్ల యేనుఁగులను చూచి అరబ్బుల గుఱ్ఱములు బెదరసాగెను. అది అబూఉబైద్ చూచి గుఱ్ఱమునుండి దుమికి నేలపై నిలచి తమతోఁబాటున్న ముసల్మానులతో "ఓయుద్ధవీరులారా! మీరందఱు గుఱ్ఱముల నుండి దిగి ఏనుఁగులపైనున్న అంబారీల త్రాళ్ళను త్రెంపి యేనుఁగులపైనున్న వారిని వధింపుఁడు" అని గట్టిగా పలికెను. సేనాధిపతి మాట వినఁగానే అందఱు దిగి యేనుఁగులపైనున్న వందల కొలది సైనికులను క్రిందపడఁగొట్టి వధింపసాగిరి. కాని యేనుఁగులు ముసల్మానులపైబడి త్రొక్కసాగెను. అప్పుడు దాని ఫలితము లక్ష్యము చేయక ఏనుఁగులనే మార్కొన సాగిరి. అబూఉబైద్‌గారు ఒక మదించిన తెల్లయేనుఁగును మార్కొని దాని తొండమును తెగనఱకఁగానే అది వారిని క్రిందపడద్రోసి వారి ఱొమ్మును తన కాలుతోఁ ద్రొక్కివేసెను. అంతవారు పరలోకము చేరిరి. అది చూచి వారి వంశస్థులు ఏడుమంది వీరులు ఆయేనుఁగును మార్కొని వధింపఁబడి పరలోకము చేరిరి. ఇఁక ముసల్మానుల సైన్యములో నిరాశ నిరుత్సాహము ప్రబలసాగెను. అది చూచి సైనికులు యుద్ధరంగమువీడి పాఱిపోవుదురేమో అని తలఁచి ఒకరు నావల వంతెనను త్రెంపి వేసిరి. ఇఁక ముసల్మానులు వెనుకకు వచ్చుచు వంతెన లేనిది చూచి తొందఱపాటులో నేమియు

తోంచక అనేకులు నదిలోపడి మునింగి పరలోకము చేరిరి. ఉబూఉబైద్‌గారి పిమ్మట ముసన్నాగారు సేనాధిపతిగానుండిరి. ముసన్నాగారు తిరిగి నావల వంతెన నిర్మించుటకు విధించిరి. అంతవఱకు తమతోఁ బాటున్న సైనికులతో శత్రువుల యెదుట ఇనుప గోడవలెనిలిచి యుండిరి. నదిదాఁటి పోయిన పిదప ముసల్మానుల లెక్క చూడగా తొమ్మిది వేల ముసల్మానులలో మూఁడు వేలు ముసల్మానులు మాత్రము మిగిలియుండిరి. ఇది హిజ్రీ పదుమూఁడవయేఁట షాబాను నెలలో సంభవించెను.

## —: బువైబు యుద్ధము: —

ఆ అపజయవార్త హజ్రతు ఉమర్‌గారికిఁదెలిసి చాల విచారపడిరి. ఇపుడు ముసన్నాగారియొద్ద సైన్యము కొంచెము మాత్రముండెను. అందులకు హజ్రత్ ఉమరుగారు ముసన్నాగారికి సహాయముగా నొక సైన్యముపంపిరి.

రుస్తుము, ముసల్మానులను మార్కొనుటకై మహారానును సేనాధిపతిగాఁజేసి గొప్పసైన్యమును పంపెను. రెండు పక్షములవారి సైన్యములు బువైబు అనుచోట మఖాము చేసెను. రెండు సైన్యముల మధ్య ఫురాతునది అడ్డుగా నుండెను. మహారాను "మేమునదిదాఁటి రావలెనా! లేక మీరు వచ్చెదరా!" అని ముసన్నాగారికి వర్తమానముపంపెను. మరూహాలోజరిగిన పొరపాటు ముసన్నాకుఁదెలిసియుండెను. కాఁబట్టి "మీరేరండు" అని మహారానునకుఁదెలియఁజేసెను. ఈరానీలు నదిదాఁటిమహావైభవముతో యుద్ధరంగమునకు వచ్చినిలిచిరి.

ముసల్మానులుకూడ మంచి పద్ధతిలో పఙ్త్తులుదీరి యుద్ధరంగ మున నిలిచిరి. ముసల్మానుల సేనాధిపతి మూడుతూర్లు అల్లాహు అక్బరు అని పలుకును. మొదటితూరి పలుకఁగానే సైనికులు ఆయుధములను సవరించుకొందురు. రెండవసారి పలుకఁగానే ఆయుధములు పట్టుకొని సిద్ధమగుదురు. మూఁడవతూరి పలుక గానేశత్రువుపైఁబడి యుద్ధముసలుపుదురు. ఆపద్ధతిననుసరించి ముసన్నాగారు రెండుసార్లు అల్లాహుఃఅక్బరు పలుకఁగానే కొందఱుముందంజ వేసిరి. అదిచూచిముసన్నాకుపితులై ఎవరువారు అని అడుగఁగా గడచిన యుద్ధములో స్థిరముగా నిలువక యున్నవారలు. ఇపుడు పాపపరిహారము చేసికొనుటకు ముం దంజ వేసినారు అని పలుకఁగా అట్లువలదు. వృథాప్రాణము గోలుపోఁగూడదు. యుద్ధముప్రారంభమైన పిదప ధైర్యముతో పోరాడుఁడు అని మందలించిరి. తుదకు రెండుసైన్యముల మధ్య ఘోరయుద్ధము ప్రారంభమాయెను. శత్రువులసైన్యము అధి కముగా నున్నను ముసల్మానులు మహా ధైర్యముతోయుద్ధము సలిపి ఈరానుల సైన్యమును నిర్మూలించిరి. ఒక ముసల్మాను యువకుఁడు మహరానును గుర్తించి వానినిఖడ్గముతో వధించి వేసెను. అదిఅందఱికిఁ దెలిసెను. ఆవార్తఈరానులు వినినం తనే ధైర్యమువీడి నదివైపునకు పాఱిపోసాగిరి. ముసన్నాగారు ముందుకుఁబోయి నావల వంతెనను త్రెంపివేసిరి. మఱి అనే కులు ఈరానులు వధింపఁబడిరి. ఈయుద్ధములో దాదాపు ఒకలక్ష ఈరానీలు వధింపఁబడిరి. దీనివలన ఈరానీల హృద యములలో ముసల్మానుల భయము నెలకొనెను. ఈయుద్ధ మునందు పెక్కురు అరబ్బుక్రైస్తవులుకూడ ముసల్మానుల

పక్షమున చేరి మహాధైర్యముతో యుద్ధమాడిరి. ఈయుద్ధము ముగిసిన పిదప మునన్నాగారు చుట్టుపట్ల సైనికులను పంపిరి. వారు పోయి ఇరాకంతయు జయించిరి. పురాతునకు పడమటి భాగములో ఈరానీల అధికారము నశించి పోయెను.

—: యజ్దుగిర్దును రాజుగా నెన్నుకొనుట :—

ముసల్మానుల విజయ వార్తలు ఈరాను రాజ్యమునకు ముఖ్యపట్టణమగు మదాఇను పురమునకుఁ జేరఁగానే ప్రిభుత్వసభికులు చాల విచారపడిరి. అందఱును ఒక సభగా వించి "ప్రిభుత్వమునుండి స్త్రీని తొలఁగించి యొక పురుషుని నియమింప వలెను. రుస్తుము, ఫీరోజు తమ కలహములు మాను కొని ఐకమత్యము వహింపవలె" నని తీర్మానించిరి. ఆ పిదప చాల ప్రియత్నముచేసి షహర్యార్ బిన్ కిసా్రివంశమునకు చేరిన యజ్దుగిర్దు అను యువకుని రాజుగా నెన్నుకొనిరి. ఆతఁడు గొప్పధైర్యము గలవాఁడు. ఆతఁడు గొప్పసైన్యము సమకూర్చి గొప్ప సన్నాహములుచేసి ఈరానీల ఇరాకు పురములను తిరిగి తన వశము చేసికొనెను. ఈవార్త హజ్రత్ ఉమర్ గారికిఁ దెలిసి "మీరు అరేబియా సరిహద్దులకు వచ్చి మకాము చేయవలెను" అని మునన్నాగారికి ఉత్తరువు చేసిరి. దాని ననుసరించి మునన్నాగారు జీఖారా్ అను చోటునకు వచ్చి మకాము చేసిరి.

—: ఖాదిసియా యుద్ధము :—

హజ్రత్ ఉమరుగారు ఈరానీలను మార్కొనుటకై గొప్ప సన్నాహములు చేయసాగిరి. అరేబియా దేశమంతటను ఉన్న మంచి వాగ్ధాటిగలవారును, కవులును, ధైర్యవం

తులును, యుద్ధవీరులును మదీనాపురమునకు రావలసినది అని తమ యధికారుల మూలమున ఉత్తరువు గావించిరి. వారి యుత్తరువు ననుసరించి ప్రజలు గుంపులు గుంపులుగా వేల కొలంది యుద్ధవీరులు మదీనాపురము వచ్చిచేరిరి. హజ్రత్ ఉమరుగారు సర్వసేనాధిపత్యము వహించి, తలహా, జుబైరు, అబ్దుల్ రహ్మాన్ మొదలగు గొప్పగొప్ప శిష్యులను సైన్యముల భాగములకు అధిపతులనుగాఁజేసి మదీనాపురమునుండి మూఁడుమైళ్ల దూరముననుండు 'సరారు' అనుచోట మకాము చేసిరి. సామాన్యముగా అందఱు ప్రజలు హజ్రత్ ఉమఱు గారు సైన్యము వెంటరావలెనని కోరుచుండిరి. కాని కొందరు పెద్దలు దానికి వ్యతిరేకముగా అభిప్రాయపడిరి. ఆపెద్దలు హజ్రత్ ఉమరుగారితో "ఓఅమీరుల్‌మూమినీన్! యుద్ధములో జయాపజయములలో నేదేని కలుగవచ్చును. మీరు సైన్యముతోఁ బాటున్నపుడు అపజయము గలిగినచో ఇఁక ఇస్లాముయొక్క అధికారము పోయినట్లే తలఁచునది అని విన్నవించిరి. హజ్రత్ ఉమరుగారు ఆపెద్దల సలహాను సమ్మతించిరి. మఱియు ఆపెద్దలసలహాను అనుసరించియే హజ్రత్ పైగంబరులవారి మామ సాదుబిన్ రబీవఖాసును సర్వసేనాధిపతిగా నియమించి సైన్యమును సాగనంపి తాము మదీనాపురమునకు తిరిగి వచ్చిరి.

సాదుబిన్ వఖాసుగారు తమ సైన్యమును దీసికొని 'జరూద్' అనుచోట మకాము చేసిరి. అచ్చట ముసన్నాగారు పరలోకము చేరిరి అనువార్త వారికిఁ దెలిసెను. (ముసన్నాగారు షరూహా యుద్ధములో ఛాల గాయపడియుండిరి.

తోగాయములతోనే వారు మరణించిరి.) సాదుగారు జరూద్ నుండి బయలుదేఱి 'షరాఫ్' అనుచోట మకాము చేసిరి. అచ్చట ముసన్నాగారి తమ్ముఁడగు 'ముఅన్నా' తన ఎనిమిది వేల సైన్యముతో వచ్చి సాదుగారితో కలిసికొనెను. మఱి ముసన్నాగారు మరణింపక పూర్వము యుద్ధమునుగూర్చి యిచ్చిన సలహాను సాదుగారికిఁ దెలిపెను. ఇచ్చటనే సాదుగారికి హజ్రత్ ఉమర్ గారి లేఖ వచ్చిచేరెను.

అందలి యుత్తరువుననుసరించి సైన్యము లెక్కింపఁబడిన ముప్పదివేలుండెను. దానిని ఆఱుభాగములుగఁ జేసిరి. (1) మైమనా (కుడిప్రక్కనుండు భాగము). (2) మైసరా (ఎడమప్రక్కనుండు భాగము). (3) ఖల్బు (మధ్యలోనుండు భాగము). (4) సాఖా (వెనుకనుండు భాగము). (5) తలీఅ (అచ్చటచ్చట తిరుగుచుండు భాగము,) (Petrolling Party) (6) ముజర్ర (నియమములేని భాగము) (Irregular Force) ఒక్కొక్క భాగమునకు నొక్కొక్క అధికారి నియమింపఁబడెను. ఈ సైన్యము చాల ముఖ్యమైనది. ఇందుబదరు యుద్ధములో పాల్గొనియుండిన డెబ్బది మంది శిష్యులును హుదైబియాలో శపథముగావించియున్న మూఁడువందల మంది శిష్యులును మక్కా జయములో పాల్గొనిన మూఁడు వందల శిష్యులునుచేరి యుండిరి. ఇంకను సాదుగారు షరాఫ్‌లోనుండఁగానే మఱొక లేఖ వచ్చెను. అందు ఖాదిసియాలో మకాముచేసి ఈరానీల భూప్రదేశము ఎదురుగాను, అరేబియా కొండలు వెనుకగాను ఉండునట్లు యుద్ధముగూర్చి యేర్పాట్లు చేసికొనవలెను అని యుత్తరువుండెను. ముసన్నాగారును ఇటులేసలహా

నిచ్చియుండిరి. సాదుగారు షరాఫునుండి బయలుదేఱి ఖాదిసియా ప్రదేశము చేరిరి. ఖాదిసియా ఒక మంచి పచ్చిక మైదానము. అచ్చటనుండి "కూఫా" పురము 39 మైళ్ల దూరములోఁగలదు. హజ్రత్ ఉమరుగారి యొద్దనుండి లేఖలు వరుసగ యొకటి దాని పిదప మఱొకటి వచ్చుచుండెను. అందు ఒకలేఖలో ఖాదిసియా యొక్కయు దాని చుట్టుపట్లనున్న ప్రదేశము యొక్కయు మ్యాప్ (Map) వ్రాసిపంపవలెను. ఈరానీలకు ఎవఁడు సేనాధిపతిగానున్నాఁడు. ఆతని సైన్యము ఎచ్చట మకాముచేసి యున్నది అను విషయములు తెలుపవలసినది అని యుత్తరువుండెను. దాని ననుసరించి సాదుగారు ఖాదిసియాప్రదేశము యొక్క పూర్తి పటము వ్రాసిపంపుచు ఈరానీల సేనాధిపతియగు రుస్తుము స్వయముగా సేననుదీసికొని మదాయిను నుండి బయలుదేఱి సాబాతు అనుచోట నిలిచియున్నాఁడు అని తెలిపిరి.

—: ఈరానీల దర్బారులో ముసల్మానులరాయబారులు :—

హజ్రత్ ఉమరుగారు "యుద్ధమునకుముందు కొందఱు బుద్ధిమంతులను రాయబారులుగా నియమించి కిస్రారాజు నొద్దకుపంపి ఇస్లామ్మత ధర్మముల ననుసరించి సంధిషరతులు ఈరానీలకు తెలుపవలెను" అని సాదుగారికి ఉత్తరవుగావించిరి. దాని ననుసరించిసాదుగారు పదునాలుగు మంది నాయకుల నెన్నుకొని రాయబారులుగా కిస్రాయొద్దకు నంపిరి. ఈరానురాజు ముసల్మానుల రాయబారము వచ్చుచున్నది అని తెలిసి మహావైభవముతో తన దర్బారును అలకరించెను. ముసల్మానుల రాయబారులు తమభుజములపై యమను దుప్ప

టులను వేసికొని చర్మపు మోజాలు కాళ్లలోతొడిగి చేతు
లలో కొరడాను పట్టుకొని నిర్భయముగా దర్బారులో ప్రవే
శించిరి. అదిచూచి సభికులు భయభ్రాంతులైరి. కిస్రారాజు
ముసల్మానుల ధైర్యమునుచూచి విస్మయమొందెను. తుదకు
ద్విభాషిమూలమున సంభాషణ ప్రారంభమాయెను. కిస్రారాజు
"మీరెందులకు మా దేశములోనికివచ్చితిరి తెలుపుఁడు" అని
ప్రశ్నింపఁగా ముసల్మానుల రాయబారమునకు అధిపతిగా
నున్న నూమానుబిన్ ముఖ్రినుగారిట్లు పలికిరి "ఓ రాజా! కొంత
కాలమునకు మునుపు మేము మూర్ఖులముగా నుంటిమి. మఱి
విద్యలేని వారలముగానుంటిమి. కాని దేవుఁడు అనుగ్రహించి
మాకు సన్మార్గము చూపుటకై ఒక గొప్ప ప్రవక్తను మా
యొద్దకు పంపెను. ఆ పవిత్రుఁడైన దేవునిప్రవక్త ధర్మమార్గము
చూపించి సత్కార్యములు చేయవలెనని, పాపములు వదలు
కొనవలెనని బోధించెను. మేము ఆతనిబోధను నమ్మి స్వీక
రించినచో మాకు ఇహమునందును పరమునందు జయము,
మోక్షములభించునని వాగ్దానముచేసెను. కావున మేము ఆతని
బోధను స్వీకరించి ఇస్లాము మతములో ప్రవేశించితిమి.
ఈ ఇస్లాము మత ప్రచారము చుట్టుపట్ల నున్న దేశములలో
చేయవలెను అని ఆప్రవక్త మాకు సెలవు నొసంగియున్నాఁడు.
ఇస్లాము మతములో పలువిధముల మేళ్లుగలవు. సత్యాసత్యము
లను వేఱుపఱచిలోకమునకు సత్యము తెలుపునది. కావున ఓ
ఈరానునాయకులారా! ఈపవిత్ర మతమువైపునకు మిమ్ముపిలు
చుచున్నాము. మీరు మాపిలుపును అంగీకరించి యిస్లాములో
చేరితిరేని అదిమీకుచాల శ్రేష్ఠమైనది. అప్పుడు మేము మీజో

లికిరావలసిన అవసరముండదు. దేవదత్త గ్రంథమగు ఖురానె షరీఫ్ మీకు అప్పగింతుము. అదిమీకు సన్మార్గము చూపును. అందలి ధర్మములను అనుసరించుట మీకు విధిగానుండును. కాని మీరు ఇస్లాములో చేరకున్నచో మాఆధిపత్యము నొప్పు కొని మాకు జిజ్యాపన్ను చెల్లింపవలెను. అపుడు మీరాజ్య ములో అన్యాయము జరుగఁగూడదు. పాపములు చెలరేఁగఁ గూడదు. దీని గూర్చి మీరు వాగ్దానము చేయవలెను. అట్లు కానిచో ఖడ్గమే మీమధ్యను మామధ్యను తీర్పుచేయును." (ఈరాన్ రాజు) పై యుపన్యాసమును మహాశ్చర్యముతో విను చుండెను. అది ముగిసినపిదప రాయబారుల నిట్లు సంబో ధించెను.:—

"ఓ అరబ్బుజాతివారలార! లోకమంతటను దారిద్ర్యము లోను హీనదశలోను మీకు మించిన వేఱుజాతిలేకుండెను. నిఱుపేదలగునట్టి మీకొఱకు మేము ఒకయొంటెను కోసి దాని మాంసముతో మీఆతిథ్యము సలుపుచుఁడినపుడు మీరు చాలసంతోషపడుచుంటిరి. మఱిమీరు చేయుఅల్లరి యంతయు చల్లబడిపోవుచుండెను. మీరు తలనెత్తునపుడెల్ల సరి హద్దులలో నున్న మా అధికారులకు మీవిషయమున ఆజ్ఞ నిచ్చుచుంటిమి. వారు మిమ్మణఁగ ద్రొక్కుచుండిరి. చూడుడు! దేశములనుజయింప వలెననియున్న మీపిచ్చితన మును వదలు కొనుఁడు. సరే! మీజీవనమునకుఁగాను కావలసి యున్న వస్తువులను గూర్చిమాకుఁ దెలుపుఁడు. మీఅన్న పానాదులను గూర్చియు మీవస్త్రములను గూర్చియు మేము ఏర్పాటుచేసెదము. మఱిమీవిషయము పెత్తనము వహించి

నట్టి ఒక రాజును మీకొఱకు నియమింతుము” ఈరాను రాజు పలికిన మాటలకు జవాబిచ్చుటకుఁగాను హజ్రత్ ముగైరాగారు లేచి యిట్లు పలుకసాగిరి.:—

“ఓ రాజా! నీవు పలికినట్లు మేము వాస్తవముగ చాల హీనదశలోను దారిద్ర్యములో నుంటిమి. దీనికిమించి మేము చచ్చిన జంతువులను మర్దారును తినుచుంటిమి. రోమముల యొక్కయు చర్మములయొక్కయు వస్త్రములను ధరించుం టిమి. మఱియు నేల మాకుపఱుపుగా నుండెను. దానిపైననే పరుండుచుంటిని. కాని దేవుని ప్రవక్తయగు హజ్రత్ మహమ్మద్ మాయందుపుట్టెను. ఆయన కులగోత్రములలో మాకంటె చాల శ్రేష్ఠుఁడు. గొప్పఘనతయును సుగుణములును గలయాతఁడు. అతఁడు మాకు సన్మార్గము బోధించి మాస్థితిని మార్చివేసెను. ఆతని గొప్పయుపదేశములవలన మేము లోకమునకు మార్గదర్శకులమైతిమి. ఇపుడు గర్వముగల నీవంటి రాజుకూడ మావైభవమునుచూచి భీతిల్లుచున్నాఁడు. ఓరాజా! ఇఁక ఎక్కువ సాకులుచూపుటవలన వాదించుటవలన ప్రయోజనములేదు. నీవు హజ్రత్ రసూలువారి సందేశమును సమ్మతించి ఇస్లామ్‌మతము స్వీకరింపుము. లేదామాకులోఁబడికప్పము (జిజ్యా) చెల్లింటకు అంగీకరింపుము. ఈరెండు విషయములను నీవు సమ్మతింపనిచో ఖడ్గముచేయు తీర్మానమునకు నెదురుచూడుము.”

ఈరాన్ రాజు, ముగైరాగారు పలికిన మాటలకు చాల కోపపడి “రాయబారులను వధించుటలో కన్యాయమునుబట్టి దోషము కాకుండినయెడల మిమ్ము నఱికించి యుందును, సరే

మంచిది, పొండు. మిమ్ము యుద్ధరంగములో మార్కొనుటకై రుస్తుమును పంపెదను. అతఁడు మిమ్ము, మీతోఁబాటునున్న వారందరినివధించిఖాదిసియాయొక్క అగడ్తలోఁపూడ్చి వేయును" అనిపలికెను. ఆపిదప ఒకగంపెఁడు మట్టి తెప్పించి "మీలో నెవఁడు గొప్పవాఁడు" అని ముసల్మానుల నడుగఁగా ఆసిము బిన్ ఉమరుగారు "నేను" అని పలికిరి. అపుడు రాజు ఆమట్టి గంప వారితలపై నుంచునట్లు ఆజ్ఞాపించెను. అపుడు ఆసిము గారు తనసహచరులతోఁబాటు గుఱ్ఱములపై నెక్కి సాదాబిన్ వఖాసుగారియొద్దకు వచ్చిచేరి "మీకు శుభమగుగాత! శత్రువే! తన భూమిని మాకు అప్పగించినాఁడు" అని పలికిరి. రుస్తుము సాబాతుప్రదేశమున మకాము చేసియుండెను. అచ్చటనుండి ఒకలక్ష యిరువది వేల సైన్యముతో బయలుదేఱి ఖాదిసియాలో మకాముచేసెను. రుస్తుము ముసల్మానులకు బెదరి యుద్ధము చేయుటకు పూనుకొననేలేదు. కాని ఈరానుప్రభుత్వము యుద్ధమునుగూర్చి అతనికి ఉత్తరువు మాటిమాటికి చేయుచుండెను. అట్లు ప్రభుత్వము ఆజ్ఞాపించు చుండినను రుస్తుము అనేకమాసములు సాకులుచూపుచు యుద్ధమునకు సిద్ధపడలేదు. ఈ మధ్యరెండు పక్షములనుండియు రాయబారులు వచ్చుచు పోవుచుండిరి. కట్టకడపట ముగైరాబిన్‌షోబా ముసల్మానుల పక్షమున రాయబారిగా రుస్తుము యొద్దకు పోయెను. రుస్తుము ముసల్మానుల రాయబారిని భయకంపితుని గాఁజేయవలెనని తనకొలువు కూటమును చాల అలంకరించెను. అందు విలువైన పట్టుపఱుపులును రత్నకంబళ్లను వేయించి బంగారు పనిచేసిన పర్దాలును గోడలకు కట్టించెను.

తాను మధ్యబంగారు పీఠముపై రత్నములతో చెక్కిన కిరీటము ధరించి చాలవైభవముతో కూర్చుండెను. అతనికిచుట్టు సభ్యులు బంగారు కిరీటములుధరించి తమతమ ఆసనములపై కూర్చుండి యుండిరి. సేవకభటులు ఇరుప్రక్కల మానమువహించి నిలిచి యుండిరి. ముగైరా తన గుఱ్ఱమునుండి దిగి నేరుగాపోయి రుస్తుము కూర్చుండియుండిన పీఠముపై నెక్కి ఆతనితొడలతో తొడలు ఆనించి నిర్భయముగా కూర్చుండెను. ముగైరా చూపిన ధైర్యమును సభ్యులుచూచి ఆశ్చర్యము నొందిరి. భటులువచ్చి ముగైరాను పీఠమునుండి దింపివేసిరి. అపుడు ముగైరా యిట్లుపలికెను:- "ఈరాన్ నాయకులారా! మీరు చాల బుద్ధిమంతులు అని మేము తలంచుచుంటిమి. కాని మీరు చాల బుద్ధిహీనులుగా తేలితిరి. ముసల్మానులమగు మేము మానవులను దేవుళ్లు (స్వాములు) గాఁజేయము. బలములేని మానవులపై బలముగల వారి యాజమాన్యమును సమ్మతింపము. మీరు కూడ ఇటులే చేయుదురని మేము తలంచుచుంటిమి. మీలోని బలహీనులు బలిష్ఠులను పూజింతురు. వారిని దేవతలుగాఁజేసి ఉన్నత స్థానములో కూర్చుండఁబెట్టెదరు. మీయొద్ద మానవులలో సమానభావము లేదు అనునట్టి విషయము ముందేనాకుఁదెలిసి యుండినచో మీకొలువుకూటము నకు నేనెన్నటికినివచ్చియుండెడివాఁడను కాను. సరేనేనుమీ యొద్దకు వచ్చినాఁడను. ప్రభుత్వము నిల్పుకొనుటకు ఈపద్ధతి కానేరదు. లోఁబడియున్నవారి యాందోళనము మీయధికారమునునాశము చేసివేయును." ముగైరా పలికినమాటలువిని సభ్యులు పరస్పరము మాటలాడుకొనిరి. అధమస్థితిలోనున్న

వారలు "దేవునిసాక్షి! ఈఅరబ్బు పలికినమాట వాస్తవము" అని పలుకసాగిరి. "ఈతఁడు మాదైవతులను మాకువిరుద్ధముగా పురికొల్పినాఁడు. ఈతని జాతివారిని తక్కువగాఁజూచువారు చాలబుద్ధిహీనులు" అని ప్రభుత్వనాయకులు పలుకసాగిరి.

—: యుద్ధ ప్రారంభము :—

ముసల్మానుల రాయబారుల సంభాషణవలన రుస్తుముచాల ఉద్రేకించి యుద్ధమునకు సిద్ధమాయెను. ఈరానుల సైన్యము యుద్ధరంగమునకు వచ్చి మహావైభవముతో పదుమూఁడు వరుసలుదీరి నిలిచెను. సైన్యమునకు వెనుక ఏనుఁగుల సైన్యము నిలిచెను. ఈరానుల ముఖ్యపట్టణమగు మదాయినునకు యుద్ధ విషయము తెలుపుటకు మంచియేర్పాటు చేయఁబడెను. ముస ల్మానుల సైన్యముకూడ యుద్ధ పద్ధతి ననుసరించి యుద్ధరంగ ములోనిలిచి యుండెను. ముసల్మానుల సైన్యమునకు వెనుక అగడ్త యుండెను. ఈరానుల సైన్యము వెనుక అతీఖు అను నది యుండెను. ఉభయులకు మధ్య యుద్ధరంగముండెను. పొద్దువాలిన పిదప జొహరు నమాజు సలిపి యుద్ధమునకు ముసల్మానుల సైన్యము సిద్ధమాయెను. ముసల్మానుల సర్వ సేనాధిపతిఅగు సాదుబిన్‌వఖాసు మూఁడుసార్లు అల్లాహు అక్బర్ అని పలుకఁగానే యుద్ధవీరులు మల్లయుద్ధము చేయ సాగిరి. నాల్గవసారి అల్లాహుఅక్బరు అని సాదుగారు పలుకఁ గానే ఘోర యుద్ధము ప్రారంభమాయెను. ముసల్మానుల గుఱ్ఱములు నల్లనియేనుఁగులను చూచి బెదరసాగెను. ఏనుఁ గులవలన ముసల్మానులకు చాల ఉపద్రవముగలుగసాగెను. ముసల్మానులు బల్లెములతోను బాణములతోను ఏనుఁగులను

మహా శౌర్యముతో మార్కొనిరి. దాదాపు అయిదువందల ముసల్మానులు ఏనుఁగులలో చిక్కుకొని స్వర్గలోకము చేరిరి. కొంత రాత్రి గడచినపిదప యుద్ధము నిలిచిపోయెను. ఆదినము యుద్ధములో ఈరానులది పై చెయ్యిగానుండెను. ఆదినమును అరబీలో "యౌముల్ అర్మాస్" అనుదురు.

రెండవదినము స్వర్గవీరులను సమాధిగావించిరి. గాయములు తగిలిన వారిని చికిత్సకొఱకు స్త్రీలకు అప్పగించిరి. యుద్ధము ప్రారంభము కాకమునుపే సిరియా (షామ్) దేశము నుండి ఆఱువేలసైన్యము ముసల్మానుల సహాయమునకువచ్చి చేరెను. ఆసైన్యము కొద్దికొద్దిగా పగలంతయు వచ్చుచుండెను. అదిచూచి ఈరానులకు చాల భీతిగలిగెను. సిరియా నుండి వచ్చినసైనికులు తమ యొంటెలపై నల్ల గుడ్డలు వేసి ఈరానుల సైన్యములో విడిచిరి. దీని వలన ఈరాను సైన్యములో చాల యుపద్రవము గలిగెను. సగము రాత్రివఱకు ఘోరయుద్ధము జరుగుచుండెను. ఆదినము యుద్ధములో ముసల్మానుల పై చెయ్యిగా నుండెను. దీనిని యౌమె అగ్వాస్ అనుదురు.

మూఁడవదినము మొట్టమొదట స్వర్గవీరులను సమాధి చేసిరి. గాయములు తగిలిన వారిని చికిత్సకొఱకు స్త్రీలకు అప్పగించిరి. ఆదినముకూడ ఏనుఁగుల వలన ముసల్మానులకు ఉపద్రవముండెను. అందులకు ఇస్లాములో క్రొత్తగాఁజేరిన ఇద్దఱు ఈరానీలను పిలిచి సాదుగారు సలహా అడుగఁగా వారిద్దఱు "ఏనుఁగులకన్నులును పగులఁగొట్టి వాని తొండములను నఱికి వేయవలెను"అని పలికిరి. దానికిఁగాను సాదుగారు

కొందఱు ముసల్మాను వీరులను నియమించిరి. ఆఏనుఁగులలో రెండు ఏనుఁగులు పెద్దవిగానుండెను. ముందు వానికన్నులను బల్లెముతో పొడువఁగా అవి పాఱిపోసాగెను. వాని వెనుక మిగిలిన ఏనుఁగులు పాఱిపోయెను. అట్లు ఏనుఁగుల యుపద్రము తొలఁగెను. ఈరానుల సైన్యము చెల్లాచెదరాయెను. ఘోర యుద్ధము ప్రారంభమై రాత్రిఅంతయు యుద్ధమేజరుగు చుండెను. తెల్లవాఱినను ఏమియు తేలకుండెను. తుదకు కొందఱు నాయకులు పురికొల్పఁగానే కొందఱు తమ గుఱ్ఱ ములనుండిదిగి శత్రుసైన్యములో దూరి మహా శౌర్యముతో శత్రువులను తెగనఱక సాగిరి. ప్రొద్దువాలకమునుపే ఈరా నీల రెండుప్రక్కల సైన్యము స్థానమువదలి చెల్లాచెదరుకాఁ గానే ముసల్మానులు మధ్యనున్న సైన్యమును వధింపసాగిరి. రుస్తుము పీఠముపై కూర్చుండి యుద్ధము చేయించుచుండెను. ఆతఁడు తన సైన్యము యొక్క దుర్గతిని చూచి రోషముతో పీఠముదిగివచ్చి మహాశౌర్యముతో యుద్ధము చేయసాగెను. ఆతనికి చాలగాయములు తగులఁగానే సహింపలేక పాఱిపో సాగెను. అపుడు హిలాల్ అను ముసల్మాను సిపాయి చూచి వానినివెంబడించి వధించివేసెను. మరల రుస్తుము యొక్క పీఠముపై నెక్కి "దేవునిసాక్షి! నేను రుస్తుమును వధించితిని" అని కేకవేసెను. ఈవిషయము ఈరానులకుఁ దెలియఁగానే యు ద్ధరంగము వదలి పాఱిపోసాగిరి. పాఱిపోవుచున్న ఈరానీలను ముసల్మానులు వెంటబడి వధింపసాగిరి. ఖాదిసియా యుద్ధము ఈరాను దేశములో జరిగిన యుద్ధములలోచాల ముఖ్యమైనది. దీనిపిదప ముసల్మానులప్రభుత్వ పతాకము ఈరాను దేశములో

స్థిరపడెను. ఈరానుల ప్రభుత్వమునకు వినాశము గలిగెను. ఈయుద్ధములో ముప్పది వేలమంది ఈరానులు వధింపఁబడిరి. ఎనిమిదివేలమంది ముసల్మానులు స్వర్గలోకముచేరిరి. ఈ దినమును యౌమె అర్మాస్ అనుదురు.

హజ్రత్ ఉమరుగారికి ఖాదిసియా యుద్ధము యొక్క ఫలితమును గూర్చిచాల చింతయుండెను. ప్రతిదినము మదీనా పట్టణమునకు బయటవచ్చి కబురుతెచ్చు వానికిఁగాను ఎదురు చూచుచు పోవుచుండిరి. ఒకదినము తమ అలవాటుననుసరించి మదీనాకు బయట కూర్చుండి ఎదురుచూచుచుండిరి. అపుడు ఒకఁడు ఒంటెపై నెక్కి వచ్చెను. హజ్రత్ ఉమరుగారు "మీ రెచ్చటినుండి వచ్చుచున్నారు" అని అడుగఁగా ఆయన "ఖాదిసియానుండి వచ్చుచున్నాను" అని పలికెను. అపుడు ఖలీఫా ఓ దేవుని భక్తుఁడా! అచ్చట ఏమిసంభవించినది. నాకుఁదెలుపుము అని అడుగఁగా ఆతఁడు "దేవుఁడు శత్రువునకు అపజయము నొసంగెను" అని పలుకుచు మదీనావైపునకు పరుగెత్తసాగెను. హజ్రత్ ఉమరుగారు కూడ వాని వెనుకపరుగెత్తుచు వానితో విజయవివరము అడుగుచుండిరి. వారిద్దఱును మదీనా పట్టణములో ప్రవేశింపఁగానే ముసల్మానులు "యాఅమీరల్ మూమినీన్ (ముసల్మానుల ప్రభువు) మీకు సలామ్" అని పలుకసాగిరి. అపుడు ఒంటెనెక్కి వచ్చుచున్న యాతఁడు తెలిసికొని భయపడి "ఓప్రభువా! మీరు ముందే మీ పేరు నాకెందులకుఁదెలుపలేదు" అని మనవిచేయసాగెను. అందులకు హజ్రత్ ఉమరుగారు అది పోనిమ్ము. విజయవివరములు తెలుపుము అని సెలవిచ్చిరి. తుదకు ఒక సభ గావించి

ముసల్మానులందఱిని రప్పించి ఖాదిసియా విజయమును గూర్చి సర్వసేనాధిపతి పంపిన సంతోషవార్త అందఱకు వినిపించిరి

—: అభయ మిచ్చుట :—

కొంతకాలము తరువాత సాదుగారు హజ్రత్ ఉమర గారికి నొకలేఖవ్రాసిరి. అందు "ఖాదిసియా యుద్ధములోపాల్గొన్న ఈరానీలులో కొందఱు తమకు ఇష్టములేకున్నను బలాత్కారముగా యుద్ధములో పాలుగొనునట్లు చేయఁబడెను.' అని పలుకుచున్నారు. మఱికొందఱు యుద్ధకాలములో తమ యిండ్లు వదలిపాఱిపోయి తిరిగివచ్చియున్నారు. వీరందఱు అభయము వేఁడు చున్నారు. వీరివిషయమున మీ సెలవు ఏమున్నది అని వ్రాసిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు గొప్పగొప్ప నాయకుల (సహాబా)ను రప్పించి సలహా తీసికొని క్షమించి వారికి అభయమునొసంగ వలెనని సెలవిచ్చిరి.

—: మదాయిన్ జయము :—

సాదుగారు ఖాదిసియాలో జయముపొందిన పిదప రెండు నెలలు అచ్చట మకాముచేసి ఖలీఫా సెలవుననుసరించి మదాయిన్ పట్టణముపై దాడివెడలిరి. మదాయినునకు మధ్యలోనున్న బాబలు, కూసా, బహారాషేర్ అను పురములను సులువుగా జయించుచు దానిని సమీపించిరి. ఈరానీలు బహారాషేర్ నుండి పాఱిపోవుచు దజలా (టీగరస్) నదీపైనున్న వంతెనలను త్రెంపివేసిరి. కాని ముసల్మానులు దేవునిపై నాధారపడి గొప్ప ధైర్యముతో తమ గుఱ్ఱములపై నెక్కి నదిలో నీఁదుచు దాఁటిపోయి సురక్షితముగా దరిచేరిరి. ముసల్మానుల సైన్యము నదిని దాఁటిపోవఁగానే ఈరాన్ రాజు ముఖ్యపట్టణ

మగు మదాయినును విడిచి హుల్వానునకు పాఱిపోయెను. శత్రువులసైన్యము కూడ అచ్చట లేకుండెను. కావున ముసల్మానులు ఏలాటి ఆటంకములేకుండ ముదాయిన్ పట్టణములో ప్రవేశించిరి. అందు ఖస్ రెఅబ్ యజ్ అను రాజభవనము మహావైభముగలది యుండెను. సాదుగారు అందుప్రవేశించి దేవుఁడు తమకు జయమునొసంగినందులకు కృతజ్ఞత సలుపుటకు ప్రార్థన సలిపిరి. అందుచాల విలువైనవస్తువులును ధనమును లభించెను. సైనికులుభవనములకుఁగానితోఁటలకుఁగానిఏలాటి నష్టముగలిగింపలేదు. సమస్త విజయధనము ఏలాటిలోటు లేకుండ న్యాయముగా సేకరింపఁబడెను. యుద్ధ ధర్మమునను సరించి విజయధనములోని అయిదవ భాగము మదీనాపురమునకు పంపఁబడెను. మిగిలినధనము ముసల్మాను వీరులకు పంచఁబడెను. ఒక్కొక్క సిపాయి భాగమునకు పండ్రెండు వేల దీనారములు వచ్చెను. మదీనాపురమునకు చేరినధనము కూడ అందఱికి చూపి తగినవారికి పంచఁబడెను.

## —: జలోలా యుద్ధము :—

ఈరానీయుల సైన్యము మదాయినునుండి పాఱిపోయిజలోలాలో చేరుకొనెను.జలోలా చాలముఖ్యమైనది. అచ్చటినుండి ఆజర్ బాయిజాన్ బాబ్ జిబాల్ మఱియుఫారసు దేశములకుపోవు దోవలుండెను. కావున ఈరాన్ నాయకులందఱును చేరి"ఇచ్చట నుండి మేముతొలఁగిపోయినచో మఱొకతావున మేము కలియ లేము. కావున మేము ఇచ్చటనే ధైర్యముతో ముసల్మానులను మార్గొనితుది ప్రయత్నముచేసి తీరవలెను అని సలహాచేసికొని యుద్ధమునకై గొప్పగొప్పసన్నాహములుచేయ సాగిరి. యజ్ద

గిర్దు(ఈరాన్ రాజు)కూడహులువ్యానునుండి గొప్పసైన్యమునుపం పెను. మహ్రాను రాజీ అనువానిని సర్వసేనాధిపతిగా నెన్నుకొనిరి. జలోలాపట్టణమునకు చుట్టుఅగడ్త త్రవ్వి దానికిముందు కంప చెట్లు పాతి చాలభద్రపఱచిరి. సాదుగారు ఖలీఫాయొక్క సెలవు ననుసరించి ఈరానులను మార్కొనుటకై హాషిమును సేనాధి పతిగాఁ జేసిపంపి తాము మదాయినులోనే మకాముచేసిరి.

హాషిముగారు హి॥ శ॥ 16 వ, సం, సఫరు నెలలో పండ్రెండు వేలమంది సైనికులను దీసికొని జలోలాపై దాడి వెడలి దానిని ముట్టడించిరి. ఈరానీయులు అపుడపుడు అగడ్తను దాఁటివచ్చి యుద్ధము సలుపుచు తిరిగి పోవుచుండిరి. ఇట్లుకొన్ని నెలలు జరిగెను. తుదకు ఒకదినము ముసల్మానులు ఘోర యుద్ధము సలుపుచు అగడ్తదాఁటిపోయి పురములో ప్రవేశించిరి. ఈరానీయులుకూడ మహాధైర్యముతో ముసల్మానులతోయుద్ధము సలిపిరి. కాని తుదకు ఈరానీయులు యుద్ధరంగములోనిలువలేక వీఁపిచ్చిపాఱిపోసాగిరి. ముసల్మానులు వారిని ఖానకీన్ అను ప్రదేశమువఱకు తఱిమివేసిరి. ఈ యుద్ధము నందు దాఁదాపు ఒకలక్ష ఈరానీయులు వధింపఁబడిరి. మఱి మూఁడు కోట్లధనము విజయధనముగా ముసల్మానులకు లభించెను. సాదుగారు విజయధనమును మదీనాపురమునకు పంపుచు విజయవార్తను గూర్చి ఖలీఫాహజ్రత్ ఉమరుగారికిఁ దెలిపిరి. జయమువలన మదీనాలోని ముసల్మానులందఱు చాలసంతసించిరి. విజయధనము మసీదు ముంగటిలోకుప్పగా పడియుండుటను చూచి హజ్రత్ ఉమరుగారు కన్నీరు విడువసాగిరి. అపుడు ఒకరు "ఏమయ్యా! కన్నీరు విడుచుటకు ఇది

సమయముకాదు గదా! అని విన్నవించిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు "ఏజాతిలో ధనము అధికముగా వచ్చునో ఆజాతిలో అసూయకూడ వచ్చును. అసూయ ప్రబలినపుడు, ఆ జాతి వైభవము నశించిపోవును" అని సెలవిచ్చిరి. ఆపిదప విజయ ధనము అక్కడగలవారికి పంచఁబడెను.

## —: తక్రీతు యుద్ధము :—

మూసలులోనున్న రోమనులును అరబ్బుక్రైస్తవులును ముసల్మానులను మార్కొనవలెనని తక్రీతులో సర్వయత్నములు చేయుచున్నారు అని సాదుగారికి మదాయినులో తెలియ నాయెను. అందులకు వారు అబ్దుల్లాః బిన్ మోతమ్‌గారిని సేనాధిపతిగాఁజేసి అయిదువేల సైన్యమును తక్రీతునకు పంపిరి. ఈ విషయము రోమనులకుఁదెలిసి తమ పురమునకు చుట్టుఅగడ్త త్రివ్వికోట తలుపులు వేసికొనిరి. రోమనులు సమయము దొరకినపుడెల్ల అగడ్తదాఁటివచ్చి ముసల్మానులతో యుద్ధమాడుచుండిరి. కాని ప్రతిసమయములోను రోమనులకు అపజయమే గలుగుచుండెను. అట్లు 24 సార్లు పోరుసలిపిరి. తుదకు రోమనులబలము తగ్గిపోయి ముసల్మానుల సైన్యమును మార్కొనలేకపోయి పడవలెక్కి దజ్లా (టీగరస్) నదిదాటి పాఱిపోవలెనని యుద్దేశించిరి. వారి యుద్దేశము అబ్దుల్లాః బిన్ మోతమ్ గారికిఁదెలిసి రహస్యముగా తక్రీతులోనున్న అరబ్బుక్రైస్త్ర వులకు "మీరు ఇస్లామ్‌లో చేరినచో ముసల్మానులకున్న హక్కులుమీకునుండఁగలవు. కావున మీరు ఇస్లాములోచేరి మాకుతోఁడు పడవలెను" అని కబురుపంపెను. ఆక్రైస్తవులు ఇస్లాము మతముస్వీకరించిరి. ఆపిదప ముసల్మానులు రోమను

లను మార్కొనిరి. రోమనులు నదివైపునుండి పాఱిపోవ యత్నించుచుండఁగా క్రొత్తగా ఇస్లామఁలోచేరిన ముసల్మానులు రోమనులను పోనీయక అడ్డగించి యుద్ధముచేయసాగిరి. ఇట్లు రెండు వైపులనుండి రోమనులపై ముసల్మానులు యుద్ధము చేయసాగిరి. రోమనులు అందఱును వధింపఁబడిరి. తక్రీతు ముసల్మానుల వశమాయెను. అచ్చటకూడ విజయధనము చాల లభించెను.

తక్రీతును జయించిన పిదప అబ్దూల్లాఃగారు నైనవా, మూసలను జయించుటకై కొంత సైన్యము పంపిరి. అందు క్రొత్తగా ముసల్మానులైన అరబ్బులుకూడ నుండిరి. వారు ముందుగానేపోయి తక్రీతులో రోమనులకు జయము లభించినది. రోమనులు వచ్చుచున్నారు అని ప్రకటించిరి. అది విని నైనవా, మూసలు జనులు చాల సంతోషపడి తమ పురద్వారములను తెఱచిరి. అపుడు ముసల్మానులు యుద్ధము సలుపకుండనే ఆరెండు పురములను పట్టుకొనిరి.

సాదుగారు మదాయినునకు చుట్టుపట్లనున్న మూసబ్‌జాన్, ఖర్‌ఖైసా, హీతు అను పురములపై తమ సైన్యము పంపి పట్టుకొనిరి. ఈవిజయముల పిమ్మట ఇరాఖ్ దేశమంతయు ముసల్మానుల వశమాయెను. హజ్రత్ ఉమరుగారి యాజ్ఞను అనుసరించి కొద్ది పన్ను నియమించి ఎవరి భూమి వారికే నొసంగఁబడెను. జిమ్మీలపై కొద్దిగా జిజ్యాపన్ను విధింపఁబడెను. ఇరాఖ్ దేశమంతటను శాంతి నెలకొలుపఁబడెను. సరిహద్దులపై భద్రతకుఁగాను సైన్యము నియమింపఁబడెను.

## —: కూఫా, బసరా పురముల నిర్మాణము :—

హిజ్రీ శకము 16 సం॥ నుండి 17 వఱకు ఇరాఖ్‌లో నున్న ముసల్మానుల సైన్యమునకు మదాయిను పురము ప్రధాన స్థలము (Head Quarter)గా నుండెను. కాని యచ్చటి నీళ్లు గాలి (Climate) అరబ్బులకు పట్టలేదు. వారి దేహము లలోని బలము తగ్గిపోయెను. వారి రంగు మాఱిపోయెను. కావున హజ్రత్ ఉమరుగారు, అరబ్బుల యారోగ్యమునకుం దగిన స్థలము వెదకవలెనని ఆస్థలమునకును మదీనాపురమునకు మధ్య సముద్రముగాని వంతెనగాని యుండకూడదు. మఱియు అది సముద్రమునకును భూమికిని సంబంధము గలదిగా నుండ వలెను అను అని సాదుగారికివ్రాసిరి. సాదుగారు దానికింగాను సలమానుగారిని హుజైఫాగారిని నియమించిరి. వారిద్దఱు కూఫా స్థలమును అరబ్బుల నివాసమునకుంగాను ఎన్నుకొనిరి. అచ్చటి నేల యిసుకగులకఱాళ్ళు గలిగియుండెను. ఫురాతు నది అచ్చటినుండి 1 ½ మైలు దూరములో నుండెను. దాని ప్రాంతములోనే నోమానుకట్టిన గొప్పమేడలుండెను.ఇచ్చట హజ్రత్ ఉమరుగారి సెలవు ననుసరించి మొట్టమొదట కస వుతో నిండ్లుకట్టిరి. కాని అగ్నిప్రమాదము వలన ఇండ్లు కాలి పోంగా ఇటిక రాళ్ళతో నిండ్లు కట్టించిరి. అందు నలుబదివేల మంది నమాజు చేయుటకు వసతిగల పెద్ద (జుమా) మసీదు నిర్మింపంబడెను. మసీదునకు నెదుట ఇరాఖ్ అధికారి నివసిం చుటకు ప్రభుత్వ గృహము నిర్మింపంబడెను. ప్రభుత్వ గృహ మునకు మధ్యభూమిలో రెండు వందల గజముల పొడవుగల యిల్లు ప్రభుత్వ ఖజానాకొఱకు నిర్మింపంబడెను. మసీదునకు

కొంత దూరమున 40 వేల మంది నివసించుటకుఁగాను వీథులు నియమించి యిండ్లు కట్టఁబడెను. ప్రతి వీథిలో నొక మసీదు నిర్మింపఁబడెను. కూఫాపురములోని మార్గములన్నియు జుమా మసీదునుండి వెడలు చుండెను. రాజబాటలు 40 గజముల వెడల్పును సాధారణమైన బాటలు 30 లేక 20 గజముల వెడల్పును వీథులు 6 గజముల వెడల్పును గలిగి యుండెను. అన్ని విధముల వసతులు గలిగి చాల విశాలమైన పురము ఏర్పడెను. సాదుగారు హి : శ : 17 సం॥ (638 జనవరి) లో మదాయినునుండి లేచి కూఫాపట్టణములో నివాసము ఏర్పాటు చేసికొనిరి.

దీనికి రెండు వర్షముల పూర్వము హజ్రత్ ఉమరు గారి సెలవు ననుసరించి బసరా పట్టణము ఏర్పడెను. అచ్చటి నేలకూడ ఇసుక గులకరాళ్ళు గలిగియుండెను. చుట్టుపట్ల నీళ్ళు, మేఁత వసతి చాల యుండెను. అచ్చట కూడ జుమా మసీదు, ప్రభుత్వగృహములు కట్టఁబడెను. దజలానదినుండి పదిమైళ్ళ దూరమునుండి బసరా వఱకు నీటికాలువ నిర్మింపఁబడెను. బసరాలోకూడ మొట్టమొదట కసవుతో నిండ్లుకట్టిరి. అగ్నిప్రమాదము గలిగినందున ఇటికరాళ్ళతోను మట్టితోను మిద్దెలు కట్టించిరి. కూఫా, బసరా పురములు ఏర్పడిన పిమ్మట ఆరెండు పట్టణములును ముసల్మానుల సైన్యమునకు ప్రధాన స్థలము లాయెను. హజ్రత్ ఉమరుగారు ఇరాఖ్ దేశమును రెండు భాగములుగఁ జేసిరి. ఇరాఖ్ పై భాగమునకు కూఫాను ముఖ్యపట్టణముగా నియమించి సాదుగారిని దానికి అధికారిగా నియమించిరి. ఇరాఖ్ క్రింది భాగమునకు బసరా

ముఖ్యపట్టణముగా నేర్పాటుచేసి ఉతబాగారిని దానికి అధి కారిగా నియమించిరి. ఈరాను దేశము జయింపఁబడిన పిమ్మట బాబ్, అజర్ బాయిజాన్, హమ్దాన్, రై, అస్ఫహాన్, మాహ్, మూసల్, ఖర్ఖైసా మొదలగు పురముల సంబంధము కూఫాతోను, ఖారాసాన్, సజిస్థాన్, మకరాన్, ఫారసు, అహ్వాజుపురముల సంబంధము బసరాతోను సంధింపఁ బడెను.

—: ఫారసుపైదాడి వెడలుట :—

అలాబిన్ హాజ్రమీఅను వారు గొప్ప యుద్ధవీరులు. వారు హజ్రత్ అబూకరుగారి ప్రభుత్వకాలములో మత భ్రష్టులతో యుద్ధముచేయుటలో గొప్ప కార్యము నిర్వహించిన వారు. కావున హజ్రత్ ఉమరుగారు అలాబిన్ హజ్రమీ గారిని బహారైనుపై అధికారిగా నియమించిరి. వీరు, సాదు గారు గావించియున్న విజయ కార్యములను విని తాముకూడ అట్లు చేయఁదలఁచి హజ్రత్ ఉమరుగారి సెలవుపొందకయే తమంతటతామే సముద్రమార్గమున ఫారసుపై యుద్ధము చేయుటకై యొక సైన్యమునుపంపిరి. ముసల్మానుల సైన్యము ఖస్తఖరు చేరఁగానే ఈరానీయులు ముసల్మానుల యోడలను పట్టుకొనిరి. ముసల్మానుల సేనాధిపతి గొప్ప ధైర్యముతో ఈరానీయులతో యుద్ధమునలిపి ఈరానీయులను పెక్కండ్రను వధించెను. కాని ముసల్మానులు తమ యోడలను ఈరానీయులనుండి లాగుకొనలేక పోయిరి. ఇక ముసల్మానులు తమ కొలది సైన్యముతో ఈరాను దేశమందు నిలుచుట ఉచితము కాదని తలఁచి భూమార్గమున బస్రాపురమునకు తిరిగి పోవలె

నని తలంచిరి. కాని ఈరానీయుల సైన్యము వారి మార్గమును ఆటంకపఱచెను. కావున ముసల్మానులు విధిలేక తావ్వాసు అనుచోట ముట్టడింపఁబడిరి. ఈవిషయము హజ్రత్ ఉమరు గారికిఁదెలిసి "తత్క్షణమే ముట్టడింపఁబడినముసల్మానుల సహాయమునకుఁగాను ఒక గొప్ప సైన్యము పంపవలసినది" అని బసరాఅధికారియగు ఉత్బాకు ఉత్తరువుపంపిరి. ఉత్బా 12 వేల సైన్యమును అబూబస్రి ఆధిపత్యమునపంపెను. అబు బస్రిసముద్రతీరమార్గమునుండి ప్రయాణముసాగించి ముసల్మానులు చుట్టఁబడియుండిన స్థలముచేరి వారిని శత్రువులనుఁడి రక్షించెను. అలాబిన్‌హజ్రిమీ గావించిన ఈఅపాయకరమైన పనినిచూచి హజ్రిత్ ఉమరుగారు చాలఅసహ్యపడి అలాగారిని బహరైను అధికారమునుండి తొలగించి కూఫాకుపోయి సాదు గారిక్రింద పని చేయువలసినది అని సెలవుగావించిరి.

—: అహ్వాజు విజయము :—

అహ్వాజు సరిహద్దులు బసరా సరిహద్దులతో కలియుచుండెను. ఇచ్చట ఈరానుల గొప్ప సర్దారగు హుర్ముజాను అధికారిగా నుండెను. అతడు అపుడపుడు ముసల్మానుల పురములపై దాడి సలుపుచుండెను. కావున బస్రిఅధికారియగు ఉత్బా, హుర్ముజాను గావించుచున్న శాంతిభంగమునకుఁగాను వానిపై యుద్ధము సలుపవలెనని నిశ్చయించుకొని కూఫా అధికారియగు సాదుగారి సైన్యసహాయముకోరెను. కూఫా నుండి ముసల్మానుల సైన్యమువచ్చి బస్రిసైన్యమునకుతోడు పడెను. రెండుసైన్యములును కలిసి హుర్ముజానుపై యుద్ధము గావించెను. యుద్ధములో హుర్ముజాను ఓడిపోయి అహ్వాజు,

మహార్జాను అను భూభాగమును ముసల్మానులకిచ్చి సంధి చేసికొనెను. మనాజిర్ నహరెతీరీ అను ప్రదేశమున ముస ల్మానుల సైన్యము నివాసము ఏర్పఱచుకొనెను. కొన్నాళ్ల పిమ్మట సరిహద్దుల విషయము ముసల్మానులకును హుర్ము జానునకు కలహముకలిగెను. హుర్ముజాను తాను గావించిన సంధిని త్రెంపివేసి కుర్దుల సహాయము వేడి యుద్ధమునకు సిద్ధ మాయెను. హజ్రత్ ఉమరుగారి సెలవుననుసరించి ఉత్బా, హుర్ముజానును మార్కొనెను. జసరెసూఖె అహ్వాజు నొద్ద యుద్ధము సంభవించెను. యుద్ధములో హుర్ముజాను ఓడిపోయి రామహుర్ముజునకు పాఱిపోయెను. దీని ఫలితముగా అహ్వాజు పూర్తిదేశము తస్తరువఱకు ముసల్మానులవశమాయెను.

—: జీమ్మిరైతులయెడ న్యాయము :—

హుర్ముజాను గావించిన ద్రోహమునకుఁగాను ముస ల్మానులు ఈరానుపై నన్యాయము చేయుచున్నారేమో అను తలంపుతో విచారింపవలెనని కూఫానుండిపదిమంది పెద్దనాయ కులను ఉమరుగారు రప్పించివారితో "ముసల్మానులు జిమ్మీ రైతు(ఈరానీ)లపై నేలాటి అన్యాయము జరుగుటలేదుగదా అనిప్రశ్నించిరి. ఆనాయకులు "ఏలాటి అన్యాయము జరుగుట లేదు. మీరు సెలవొసంగినట్టు న్యాయము జరుగుచున్నది" అని హజ్రత్ ఉమరుగారితో నాయకులు విన్నవించిరి. అపుడు హజ్రత్ ఉమరుగారికి మనశ్శాంతిగలిగెను. వచ్చిననాయకులకు బహుమానములిచ్చితిరిగి కూఫాకు సాగనంపిరి.

—: ఒకలేఖ :—

" ముసల్మానులు ఈరానురైతులపై అన్యాయము

చేయకుండునట్లు చూడవలెను. జిమ్మీ రైతుల విషయమున దేవునికి భయపడవలెను. మీరు అన్యాయముచేసినచో రైతులు కూడ అన్యాయము, ఉపద్రవములు చేయుదురు సుమా! ఆడినమాట నెఱవేర్చుటవలననే దేవుఁడు మీకు రాజ్యము నొసంగి యున్నాఁడు. కావున మీరు గావించిన వాగ్దానము ప్రకారము నడచుకొనవలెను. ఆడినమాట తప్పగూడదు జిమ్మీ రైతుల విషయము బాగుగా ప్రవర్తింపవలెను. ఈ విషయమున దేవుని యాజ్ఞలను సరిగాననుసరింపవలెను. ఇట్లు మీరు రైతులయెడ న్యాయముగ నడచుకొన్నచో దేవుఁడు మీకు తోడుపడును''అని బస్రా అధికారియగు ఉత్బాకు నొక లేఖ వ్రాసిరి.

—: రామహుర్ముజు, తస్తరుల విజయము :—

యజ్దగిర్దురాజు మరూలో నిలిచియుండెను. మరూనుండి అహ్వాజులోనున్న ఈరానీయులయొద్దకు రహస్యముగా లేఖలువ్రాసి వారు ముసల్మానులకు లోఁబడినందులకు వారిని చీవాట్లుపెట్టెను. మఱియు ఆరాజుఫారసునాయకులను ప్రోత్సాహపఱచిముసల్మానులతోయుద్ధము సలుపవలెననిపురికొల్పెను. దాని ఫలితముగా అహ్వాజు ప్రాంతములో పెక్కుచోట్ల ఉపద్రవములు చెలరేగెను. ఫారసు వారును అహ్వాజువారును కలిసి ముసల్మానులను మార్కొనవలెనని ప్రయత్నములు చేయసాగిరి. ఈవిషయము హజ్రత్ ఉమరుగారికిఁదెలిసి అహ్వాజుపై మతతమ సైన్యములు పంపవలెనని కూఫా అధికారియగు సాదునకును, బస్రాఅధికారియగు అబూమూసా అష్అరీకిని ఉత్తరువు చేసిరి. హజ్రత్ ఉమరుగారి యుత్తరువు రాఁగానే

నూమానుగారు గొప్పసైన్యమును దీసికొని కూఫానుండి బయలుదేఱి రామహుర్ముజునకుచేరి అచ్చట హుర్ముజానుతో యుద్ధము సలిపిరి. యుద్ధములో హుర్ముజాను ఓడిపోయి తస్తరునకు పాఱిపోయెను. నూమానుగారు రామహుర్ముజును ఆక్రమించుకొనిరి. అచ్చటనుండి నూమానుగారు తస్తరునకు బయలుదేఱిరి. వారు అచ్చట చేరఁగానే బస్రానుండి బయలుదేఱిన సైన్యముకూడ వారితో కలిసికొనెను. బస్రానుండి వచ్చిన సైన్యమునకు సహల్ బిన్ అదీగారు సేనాధిపతిగానుండిరి. ముసల్మానుల సైన్యమువచ్చిన విషయము హుర్ముజానుకుఁ దెలిసిపురద్వారములు వేసికొని పురములోనే నిలిచిపోయెను. ఈరానీయులు సమయము దొరకినపుడెల్ల బయటికి వచ్చి ముసల్మానులతో యుద్ధము చేయుచుండిరి. ఇట్లు ఒక నెలలోపల ఎనుబదిసార్లు యుద్ధము జరిగెను. ఒకపుడు ముసల్మానులకును మఱొకపుడు ఈరానీయులకును విజయముగలుగుచుండెను. ఇట్లు జరుగుచుండఁగ ఒక దినము ముసల్మానుల సైన్యములో నొక ఈరానీవచ్చి "నాకు అభయము నొసంగినచో పురములో ప్రవేశించుటకుఁగల మార్గము నేనుచూపఁగలను" అని సర్వసేనాధిపతి యగు అబూబస్రాతో విన్నవింపఁగా ఆయన తత్క్షణమే వాని మనవిని అంగీకరించెను. ఆయీరానీ తనవెంట అష్రస్ అను ముసల్మాను సిపాయి దీసికొని భూమిలోపలనున్న కాలువ మార్గమున పట్టణములోనికి ప్రవేశించెను. అష్రసు పురములో బాగుగ తిరిగి అన్నితావులను గమనించి చూచుకొనిన పిదప మరల ఆమార్గముననే ఈరానీ అష్రసును దీసికొని వచ్చి వదలిపోయెను. అష్రసువచ్చి సేనా

ధిపతితో "నేను రెండు వందల మంది సిపాయిలతో పుర మును జయింపఁగలను"అని విన్నవింపఁగానే రెండువందల మంది యుద్ధవీరులు దానికై సిద్ధమై అమ్రినువెంట బయలు దేఱిరి. అమ్రను ఆరహస్యమార్గమున సైనికులను దీసికొని పురములో ప్రవేశించి ద్వారపాలకులను వధించి పురద్వార ములను తెఱచివేసెను. అచ్చటముసల్మానుల సైన్యమంతయు వేచికొని నిలిచియుండెను. తలుపులు తెఱవఁబడఁగానే అల్లా హుఅక్బరు అను విజయధ్వనులు గావించుచు పురములో ప్రవేశించెను. ఆకస్మికముగ వచ్చిన ముసల్మానుల సైన్య మునుగూర్చి హుర్ముజాను విని పురములోనున్న కోట తలు పులు వేసికొని కోటబురుజుపైనెక్కి "నన్ను ముసల్మా నుల ఖలీఫా (హజ్రత్ ఉమరుగారి) యొద్దకు పంపవలెను. వారు నావిషయము గావించు తీర్మానము నేను ఒప్పుకొం దును. ఇది సమ్మతించినచో నేను కోటబురుజునుండి దిగి వత్తును" అని ముసల్మానుల సర్వసేనాధిపతితో పలికెను. దానికిసర్వసేనాధిపతి సమ్మతింపఁగా హుర్ముజాను కోటతలుపు తెఱచి తన్ను ముసల్మానులకు అప్పగించుకొనెను. ఇట్లు తస్తరుజయింపఁబడిన పిమ్మట అబూబస్రాగారు దానికి చుట్టు పట్ల ప్రదేశములకు కొద్దికొద్ది సైన్యము పంపిరి. ఆసైన్యము చుట్టుపట్లనున్న గ్రామాలను వశపఱచుకొనెను. ఆ యుద్ధ ములో హజ్రత్ బరాబిన్ మాలిక్ మొదలగు గొప్పగొప్ప సహాబాలు స్వర్గము చేరిరి.

—: హుర్ముజాన్ మదీనాపురమునకు పోవుట :—

అబూబసా్రి, రాయబారుల వెంట హుర్ముజానును

మదీనాపురమునకు సాగనంపెను. హుర్మజాన్ గొప్పవిలువైన పట్టు వస్త్రములుధరించి రాజవైభవముతో మదీనాపురము ప్రవేశించెను. వజ్రములు చెక్కిన కిరీటము ధరించియుండెను. వానివెంట గొప్పగొప్ప నాయకులుండిరి. ముసల్మానులు అతని దీసికొని మసీదె నబవీకిపోఁగా హజ్రత్ ఉమరుగారు మసీదులో నేలపైపరుండి నిద్రపోవుచుండిరి. వారిచేతిలో చర్మపు చబుకముండెను. ముసల్మానుల ఖలీలా ప్రభువు ఎక్కడ అని యడిగెను.ప్రజలు పరుండియున్నవారే ఖలీలా అని పలికిరి. హుర్మజాను చాల ఆశ్చర్యము నొంది ఏమి వీరికి రక్షకభటులును ద్వారపాలకులును లేరా అని ప్రశ్నించెను. హజ్రత్ ఉమరుగారికి దీని యక్కఱలేదు అనిప్రజలు పలికిరి. "వీరిసాధారణత్వమునుబట్టి చూచిన వీరు రాజులుకారే ప్రవక్తలుగానున్నారే"అని హుర్మజాను పలికెను. వీరు ప్రవక్తలు కారు. కాని హజ్రత్ మహమ్మదు ప్రవక్తలవారి ప్రతినిధులు (నాయిబులు)ను నిజమైన అనుచరులును అని ప్రజలు పలికిరి. పైసంభాషణవలన హజ్రత్ ఉమరుగారు నిద్రనుండి మేలుకొనిరి. హుర్మజానును బాగుగాఁజూచి "నేనునరకాగ్ని నుండి రక్షణ పొందుటకై దేవుని శరణుచొచ్చుచున్నాను." అని హజ్రత్ ఉమరుగారు పలికిరి. ముసల్మాను రాయబారులు "ఓఖలీఫతుల్ ముస్లిమీన్ ఈతడు అహ్వాజు యొక్క రాజు అయిన హుర్మజాను. ఈతనితో సంభాషింపుఁడు" అని విన్నవించిరి. వారు మొట్టమొదట ఈతని పట్టుజల్తారు వస్త్రములు దీసివేయుఁడు. ఆపిదప నేను ఈతనితో మాటలాడెదను అని పలికిరి. అపుడు వానిదుస్తులు దీసివేసిసాధారణమైన

నూలుబట్టలు వానికిధరింపఁజేసిరి. ఆవల హజ్రత్ ఉమరుగారు "ఓయి హుర్ముజాను నీవుగావించిన సంధిభంగమునకును దేవుని యాజ్ఞకు విరుద్ధముగా నడుచుకొనినందులకును గలిగిన ఫలితముచూచితివిగదా!" అని హుర్ముజానుతో పలుకఁగా "ఓ ఉమరు ఇస్లామునకు పూర్వము దేవుఁడు మీపక్షమున గాని మాపక్షమునగాని లేకుండెను. కావున మేము మీపై గెలుపు పొందుచుంటిమి. ఇపుడు దేవుఁడు మీకుతోడుగా నున్నాఁడు. కాఁబట్టి మీరు గెలుపుపొందినారు" అని హుర్ముజాను జవాబిచ్చెను. అపుడు హజ్రత్ ఉమరు ఇస్లామునకు పూర్వము మీరు ఐక్యముగలిగియుంటిరి. మేము ఐక్యములేక యుంటిమి. కావున మీరు గెలుపుపొందు చుంటిరి" అని పలికిరి.

ఆపిదప "ఓ హుర్ముజాను నీవెందులకు మాటిమాటికి సంధిని త్రెంపుచు శాంతి భంగముగలిగించుచుంటివి" అని హజ్రత్ ఉమరుగారు హుర్ముజానుతో ప్రశ్నింపఁగా "ఓఉమరుముందు నాకుత్రాగుటకు నీళ్లుదయచేయుము." అని హుర్ముజాను పలికెను. తత్క్షణమే నీళ్లతోనిండిన గిన్నె వానికి నొసంగఁబడెను. నీళ్లుచేతిలో తీసికొని "ఈనీళ్లునేను త్రాగక పూర్వమే, మీరు నన్ను వధింతురేమో" అని హుర్ముజాను పలుకఁగా అట్లుకానేరదు అని హజ్రత్ ఉమరుగారు పలుకఁగానే హుర్ముజాను తనచేతిలో నున్ననీళ్లను పాఱవేసి నేను ఈ నీళ్లనుత్రాగలేదు. కాఁబట్టి ఇంక మీరునన్ను వధింపఁజాలరు అని పలికెను. హుర్ముజాను గొప్పగొప్ప సహాబా పైగంబరులవారి శిష్యులను వధించియుండెను. కావున

హురుమ్మజానును ప్రాణములతో వదలిపెట్టవలెనని హజ్రత్ ఉమరుగారికి అభిప్రాయము లేకుండెను. కాని హురుమ్మజాను తన ప్రాణరక్షణమునకుఁగాను గావించిన తంత్రమునుచూచి ఆశ్చర్యమునొంది "ఓహురుమ్మజాను! దేవునిసాక్షి! నీవు నన్ను బొంకించితివి. కాని ముసల్మాను కాకుండు వీని మోసములో నేను పడుటకు సమ్మతింపను" అని హజ్రత్ ఉమరుగారు పలుకఁగా తత్క్షణమే హురుమ్మజాను ఇస్లాము మతము స్వీకరించెను. హురుమ్మజాను మదీనాపురములోనుండ వచ్చును అని హజ్రత్ ఉమరుగారు సెలవిచ్చి సంవత్సరమునకు రెండు వేలు రూపాయలు వాని ఖర్చునకుఁగాను ఏర్పాటు చేసిరి. ఈరాను దేశమును జయించు విషయములో హజ్రత్ ఉమరుగారు హురుమ్మజాను సలహా తీసికొనుచుండిరి.

—:ఈరాను దేశముపై దాడివెడలుటనుగూర్చి తీర్మానము:—

హజ్రత్ ఉమరుగారికి జిమ్మీరైతుల విషయమును చాల శ్రద్ధయుండెను. వారికి న్యాయము గలుగవలెనని ముసల్మాను అధికారులకు మాటిమాటికి ఉత్తరువు చేయుచుండిరి. హురుమ్మజానుతోఁబాటువచ్చిన ముసల్మాను రాయబారులతో "ఎందులకు జిమ్మీరైతులు మాటిమాటికి ఒడంబడికకు విరుద్ధముచేయుచు విప్లవములు గావించుచున్నారు. ఏమి ముసల్మానులు, వారికేమైన కష్టము పెట్టుచున్నారా" అని ప్రశ్నించిరి. అపుడు ఆరాయబారులు "ఓఅమీరుల్ మూమినీన్, ముసల్మానులు జిమ్మీరైతుల హక్కులను పూర్తిగన్యాయముగా వారి కొసంగుచున్నారు. అందేలాటి కొఱఁత గావించుట లేదు" అని విన్నవించిరి. అటులైన దీనికి కారణమేమి అని

హాజ్రత్ ఉమరుగారు ప్రశ్నింపఁగా అహ్నాఫు "ఓ అమీరుల్ మూమినీన్! ఈరానీయుల దేశముపై దాడివెడలఁగూడదు" అని మీరు మమ్ము నిషేధించి యున్నారు. మాకు లభించిన ఈ విజయములు ఈరానీలు గావించిన సంధివిరుద్ధములకును వారి విద్రోహములకును ఫలితములు. ఈరానీల చక్రవర్తి వారి దేశములో నున్నంత కాలము ఈవిప్లవములును శాంతి భంగములును గలుగుచునే యుండును ఆచక్రవర్తి తన జాతిని ముసల్మానులకు విరుద్ధముగా ప్రోత్సాహపఱచుచుండును. కావున మీరు సెలవు నొసంగినచో మేము వారి దేశముపై దాడివెడలి వారి ఆశయములను భంగపఱతుము. అపుడు దేశములో శాంతి నెలకొనును" అని విన్నవింపఁగా హజ్రత్ ఉమరుగారు వాస్తవము తెలిసికొని ఆసలహాను సమ్మతించి అటులే చేయవచ్చును అని సెలవు నొసంగిరి.

—:సహావందు విజయము:—

జలోలా యుద్ధమునకు పిమ్మట యజ్దగిర్దు (ఈరాను చక్రవర్తి) రై పట్టణమునకు వెళ్ళిపోయెను. కాని అచ్చటి అధికారి ద్రోహము చేయఁగా రై నుండిపోయి ఖురాసాన్ ప్రాంతములో మర్వ అను పురములో తన నివాసము ఏర్పఱచుకొనెను. అచ్చట ఆతఁడొక అగ్నిగుండము నిర్మించి తాను తెచ్చిన అగ్నిని అందుంచెను. మఱియు క్రొత్తగా ప్రభుత్వము చేయ మొదలిడెను. ముసల్మానులనుండి తన దేశమును తిరిగి లాగుకొనవలెనని సర్వప్రయత్నములు చేయ సాగెను. ఈమధ్యలో హుర్ముజాను ఓడిపోయెను. ఖోజస్తాను ముసల్మానుల వశమాయెను అను విషయము తెలిసి మఱింత

కుపితుఁడై ముసల్మానులతో కట్టకడపటి యుద్ధముచేసి తీర వలెనని తీర్మానించుకొనెను. యజ్దగిర్దురాజు, మర్వనుండి తన రాజ్యములోనున్న నాయకులను, అధికారులకును లేఖలు వ్రాసి తనకు సహాయము చేయవలెనని ప్రోత్సాహపఱచెను. దీని ఫలితముగాసింధు, ఖురాసాను, హుల్వాను మొదలగు దేశముల నాయకులు గొప్పసైన్యములు దీసికొని తమ చక్రవర్తి సహాయమునకువచ్చి నహావందుచోట నిలిచిరి. సాదుగారు ఈ విషయమును హాజ్రత్ ఉమరుగారికిఁ దెలిపిరి. అపుడు హాజ్రత్ ఉమరుగారు పెద్దపెద్ద సహాబాలను రప్పించి దీనిఁ గూర్చి సలహా తీసికొనిరి. "ఇట్టి కఠిన సమయములో స్వయముగా హాజ్రత్ ఉమరుగారే సర్వసేనాధిపతులై సైన్యములు దీసికొనిపోవుట ఉచితము" అని హాజ్రత్ ఉస్మానుగారు సలహా నిచ్చిరి. కాని హాజ్రత్ అలీగారు "ఇది సరికాదు. ఇట్టి హాని కరమైన కాలములో హాజ్రత్ ఉమరుగారు మదీనాపురము లోనే యుండవలెను" అని సలహానిచ్చిరి. హాజ్రత్ ఉమరుగారు, హాజ్రత్ అలీగారి సలహానుసమ్మతించి నేను ఈకార్యమునకై తగిన సేనాధిపతిని నియమింతును. ముందు ఆతఁడే బల్లెమును తాకును. ఆతఁడు నూమానుబిన్ ముఖ్రిన్ అని సెల విచ్చిరి. అందఱును హాజ్రత్ ఉమరుగారి అభిప్రాయమును సమ్మతించిరి. నూమానుగారు కస్కరులో పన్నువసూలు చేయు పనిలోనుండిరి. వారికి యుద్ధమందు చాల యిష్టము. పన్ను వసూలుచేయుపనిలో వారికి ఉత్సాహము లేకుండెను. కావున నూమానుగారు "యుద్ధవీరుఁడు ఒక సుందరి యొడిలో నుండునట్లు నేను కస్కరులో నున్నాను. కావున దయచేసి నన్ను

యుద్ధరంగమునకు పంపవలెను "అని హజ్రత్ ఉమరుగారికి నొక విన్నపము గావించుకొని యుండిరి. కావున నహావందుపై దాడివెడలు సైన్యముపై సేనాధిపతిగా నూమానును హజ్రత్ ఉమరుగారు నియమించిరి. ఇట్లు నూమాను కోరిక సఫలమాయెను.

—: నూమానుగారి పయనము :—

హజ్రత్ ఉమరుగారి సెలవుపొంది నూమానుగారు ముప్పదివేల సైన్యముతో నహావందుపై దాడివెడలిరి. నహావందు చేరి తమ సైన్యమును యుద్ధనియములనుబట్టి యుద్ధరంగనుందు నిలిపిరి. ఈరానీలుకూడ తమ సైన్యమును సిద్ధపఱచిరి. తుదకు ఉభయుల మధ్యఘోరయుద్ధము ప్రారంభమై రెండు దినముల వఱకు జరిగెను. మూడవ దినము ఈరానీయులు యుద్ధరంగములో నిలువలేక మైదానము వదలి రక్షణప్రదేశములలో శరణాగతులైరి. ముసల్మానులు యుద్ధమును త్వరగా ముగింపవలెనని కోరుచుండిరి. అందఱి సలహాతో కొంతసైన్యము ఈరానీల రక్షణస్థలములలో ప్రవేశించెను. ఈరానీలు ముసల్మానులను మార్కొనుటకై సిద్ధమై వచ్చిరి. అపుడు ముసల్మానులు వెనుకకు కదలుచు ముసల్మానుల సైన్యము వద్దకువచ్చి చేరిరి. ఈరానీలు ముసల్మానులను వెంబడించుచు వచ్చుచుండిరి. వారు ముసల్మానుల సైన్యమును సమీపింపఁగానే ముసల్మానుల సైన్యమంతయుచేరి ఈరానీయులతో ముఖాముఖియుద్ధము సలుపసాగెను. ఘోరయుద్ధము జరుగసాగెను. నెత్తురు కాలువలై ప్రవహింపసాగెను. వాని వలన గుఱ్ఱముల కాళ్లు కూడ జాఱసాగెను. నూమానుగారి

గుఱ్ఱము జాఱగానే నూమాగారు నేలపై పడిపోయిరి. వారికి అపాయకరమైన గాయముకూడ తగిలెను. తత్క్షణమే నయీముగారు తమ అన్నగారిని ఒకచోట దాఁచిపెట్టి వారి కుల్లాయిని వారి జుబ్బాను తాము ధరించి అన్నగారి గుఱ్ఱముపై నెక్కిరి. సైన్యములో ఎవరికిని ఈవిషయము తెలియకుండెను. అందఱు తమ సేనాధిపతి నూమాను యుద్ధము చేయించుచున్నాఁడు అని మహాధైర్యముతో యుద్ధము సలుపుచుండిరి. తమ సేనాధిపతి పడిపోయెను అను విషయము సైనికులకుఁదెలియుట చాల హానికరముగదా! యుద్ధము రాత్రివఱకు జరుగుచునే యుండెను. రాత్రి చీకఁటి క్రమ్మకొనగాఁనే ఈరానీలు యుద్ధరంగము వదలి పాఱిపోసాగిరి. ముసల్మానులు వారిని వెంబడించి వధింపసాగిరి. ఈరానీయులు అగ్నిపూజకుఁగాను తమవైపున ఒక అగ్నిగుండము నిర్మించి యుండిరి. పాఱిపోవు తొందఱలో అనేకులు అందుపడి కాలి భస్మమైరి. తుదకు ఒకటిన్నరలక్ష సైనికులలో కొందఱు మాత్రము తమ ప్రాణములు దక్కించుకొని పాఱిపోఁగలిగిరి.

—: ముసల్మానుల సేనాధిపతి స్వర్గముచేరుట:—

నూమానుగారికి చాల గాయముతగిలి యుండెను. ముసల్మానులకు జయములభించిన పిమ్మట వారి యొద్దకు ఒక సిపాయిపోఁగా వారు అంత్యదశలోనుండిరి. నూమానుగారు తమకన్నులు తెఱచి యుద్ధఫలితమేమాయెను అని ప్రశ్నింపఁగా ఆసిపాయి ముసల్మానులకు జయము లభించెను అని విన్నవించెను. అపుడు నూమానుగారు దేవునికి కృతజ్ఞత! ఈవిజయవార్తను, హజ్రత్ ఉమరుగారికిఁ దెలుపుఁడు అని

పలికి తమ ప్రాణమువదలి స్వర్గనివాసులైరి. ఈ యుద్ధములో ముసల్మానులకు చాలవిజయధనములభించెను. నూమానుగారు హుజైఫాను తమకుబదులుగా నియమించియుండిరి. కావున హుజైఫాగారు విజయధనమును సైనికులకుపంచిపెట్టి విజయ ధనములోని అయిదింటి ఒకభాగము మదీనాపురమునకు పంపుచు హాజ్రత్ ఉమరుగారికి జయవార్తపంపిరి. హాజ్రత్ ఉమరు గారు మదీనాపురమునకు బయటవచ్చి యుద్ధ విషయమును గూర్చి వేచియుండిరి. రాయబారినిచూచి విషయమేమి అని హాజ్రత్ ఉమరుగారు ప్రశ్నింపఁగా ముసల్మానులకు జయము లభించెను. సేనాధిపతి నూమానుస్వర్గము పొందెను అని తెలిపెను. అపుడు వారు జయమునకు దేవునికృతజ్ఞత సలిపి నూమానుగారు మరణించినందులకు చాలదుఃఖము పొందిరి. ఈయుద్ధము తరువాత ఈరానీల బలము తగ్గిపోయెను. అందులకే అరబ్బులు ఈజయమునకు ఫత్ హుల్ ఫుతూహ్ (జయములకు జయము) అని పేరు పెట్టిరి. ఇది హి॥శ॥ 19వ సం॥ లో సంభవించెను.

—: ఈరానుదేశమును ఆక్రమించుకొనుట :—

హాజ్రత్ ఉమరుగారు ఈరానుదేశమును ఆక్రమించుకొనుటకు కోరలేదు. అరబ్బుల దేశమును పరదేశరాజులచేతి నుండి తీసికొనుటకు నుద్దేశించి యింతవఱకు యుద్ధములు సలిపి జయములు పొందిరి. ఈజయములవలన పరదేశరాజులు భీతిల్లి అరేబియాదేశముపై యుద్ధము మానుకొనిరి. దీనిపిదప హాజ్రత్ ఉమరుగారికి పరదేశముపై దాడి వెడలవలెనని యిష్టములేకుండెను. అందులకే "మాామధ్యను పరరాజుల మధ్యను అగ్ని

పర్వతముండి వారు మాపై యుద్ధముచేయక మేమువారిపై దాడివెడలక యుందుముగదా! అని పలుకుచుండిరి. కాని ఈరానీలు శాంతముతోనుండలేదు. ఎల్లపుడు దేశములో శాంతిభంగములు గలిగించుచు కుట్రలు ద్రోహములు చేయుచు విప్లవములుగావించుచుండిరి. దీని ఫలితములే అహ్వాజు, నహావందుయుద్ధములు. హజ్రత్ ఉమరుగారు దేశములో సంపూర్ణ శాంతి నెలకొల్పవలెనని యుద్దేశించుచుండిరి. ఈరాను చక్రవర్తి మఱియువాని ప్రభుత్వముండునంతవఱకు శాంతము ఏర్పడదు అని దృఢమాయెను. కావున నహావందువిజయము పిమ్మట ఈరాను దేశమంతటను జయింపవలెనని తీర్మానించుకొని కూఫా, బస్రానుండి సైన్యములను ఈరాను పర్గణాలపై నంపిరి. హి॥ శ॥ 18వ॥ సం॥ నుండి హి॥ శ॥ 23 సం॥ వఱకు ఈరాను దేశములో యుద్ధములుజరిగి అయిదు సంవత్సరముల లోపల ఈరాను ప్రభుత్వముయొక్క యెక్కువభాగము ముసల్మానుల వశమాయెను. ఇఁక దీనివివరము వ్రాయుదుము.

హమ్జాను విజయము:- ప్రముఖుఁడైన ఈరాను నాయకుఁడగు ఫేరోజాను నహావందుయుద్ధము నందు పరాజితుఁడై హమ్జానునకు పాఱిపోయెను. హుజైఫాగారు కొంతమందిని వాని వెంబడించుటకు పంపిరి. వారు ఫేరోజానును హమజాను నొద్ద మార్గ్కాని వధించిరి. ఈవిషయము హమజాను వారికిఁ దెలిసివారు సంధికిఁగాను విన్నపముచేసికొనిరి. ముసల్మానుల సేనాధిపతి వారివిన్నపమును అంగీకరించెను. ఈవిషయము మాహావారికిఁదెలిసి వారుకూడ సంధిని గూర్చి విన్నపముచేసికొనిరి. వారివిన్నపము కూడ అంగీకరింపఁబడెను. హుజైఫా

గారు తమసైన్యము తీసికొని మరలిపోవుచుండఁగా మార్గమధ్యమందు "హమజానువారు ద్రోహముచేసి విప్లవముగలిగించిరి అనువిషయము తెలియనాయెను. అందులకు హుజైఫాగారు నయీముగారిని హమజానునకు సైన్యముతోపంపిరి. నయీముగారు హమజానును ముట్టడించిరి. తుదకు ఈరానీలు లొంగి తిరిగి సంధిగావించుకొనిరి. అచ్చటనుండి నయీముగారు దాజరూదునకు పయనమైరి. అచ్చట రూము, దైలము, అజర్‌బైజాను, రైపురముల వారందఱును ఏకమై దాజరూదులో ఘోరయుద్ధము ముసల్మానులతో సలిపిరి. తుదకు యుద్ధములో ఈరానీలు ఓడిపోయి ముసల్మానులకు జయముచేకూరెను. ఈవిజయవార్త నయీముగారు హజ్రత్ ఉమరుగారికిఁదెలియఁజేసిరి. ఆపిదప హజ్రత్ ఉమరుగారు "రైపై దాడివెడలవలెను" అని నయీముగారికి నుత్తరువుపంపిరి.

నయీముగారు రైపురమును సమీపింపఁగా దానిఅధికారియగు సయూవఖు గొప్పసైన్యముతో ముసల్మానులను మార్కొనెను. ఘోరయుద్ధము సంభవించెను. ఇంకను యుద్ధము జరుగుచుండెను. ఆసమయమందు అబుల్ ఫర్రాన్ అను రైపురనాయకుఁడువచ్చినయీముగారితోఁగలసిమీరునావెంట కొందఱిని పంపుఁడు. నేను రహస్యమార్గమున పట్టణములో ప్రవేశింతును అనిపలికెను. నయీముగారు దానికి సమ్మతించి కొందఱిని వానివెంట పంపిరి. వారు పట్టణములో రహస్యమార్గమున ప్రవేశించిరి. నయీముగారు పురమునకు బయట నుండి యుద్ధము సలుపుచుండిరి. అక్షణమే రహస్యముగా లోపలప్రవేశించిన ముసల్మానులు అల్లాహుఅక్బరు అని

ధ్వనులుచేయుచు యుద్ధము చేయసాగిరి. నయూవఖుభీతిల్లిమైదానము విడిచిపాఱిపోయెను. రైపురము ముసల్మానుల ఆధీనమాయెను. నయీముగారు, అబుల్ ఫర్ఖానును రైపురమునకు అధికారిగా నియమించిరి.

—: తబరిస్తాను విజయము :—

నయీముగారు తమ సహోదరుఁడగు సువైదును ఖోమసుపై దాడిసలుపుటకై నియమించిరి. సువైదు తన సైన్యముతో ఖోమసును సమీపింపఁగా అచటివారు యుద్ధముసలుపలేదు. ఏలాటియుద్ధము లేకయే ఆపురము ముసల్మానుల వశమాయెను. అచ్చటనుండి సువైదు జుర్జానునకు పయన మాయెను. జుర్జానుఅధికారి సంధిని గూర్చి విన్నపముగావించెను. ఆతని విన్నపము ప్రికారముసంధిగావింపఁబడెను. అచ్చటనే తబరిస్తాను అధికారి సంధినిగూర్చి సువైదునకుకబురు పంపుచు ఒకేసారి కప్పముగా మొత్తము కట్టుచుందును. నాపురమును గూర్చి ముసల్మానులు ఏలాటి జోక్యముపుచ్చుకొనకూడదు అని తెలిపెను. సువైదు దానినంగీకరించెను. సంధిని గూర్చి యిట్లు వ్రాయఁబడెను. "తబరిస్తాను అధికారికి ఈ దిగువ వ్రాయఁబడు షరతులనుబట్టి అభయము ఒసంగఁబడుచున్నది. ఆతఁడు తబరిస్తాను దేశస్థులు ముసల్మానులను విరోధింపకుండ చేయవలెను. మావిరోధులకు శరణము నొసంగఁ గూడదు. అయిదు లక్షల దిర్హములు (ఒకదిర్హముపావులా విలువగలది) ప్రతి సంవత్సరము కప్పముగా నియ్యవలెను. ఈషరతు ప్రికారము నడచుకొను నంతవఱకు ఆతని దేశముతో ముసల్మానుల కేలాటి అధికారసంబంధముండదు. ఆతని సెలవుపొంది ఆతని

దేశములో ముసల్మానులు రావచ్చును. ఇటులే తబరిస్తాను దేశస్థులు ముసల్మానుల దేశములోరావచ్చును. ఒక వేళతబరి స్తానుఅధికారి మావిరోధులకును శత్రువులకు శరణముగాని సహాయముగాని యొసంగి వారితో సంబంధముంచినచో ఈ సంధి రద్దు అయినదని భావింపఁబడును."

—: అస్ఫహాను విజయము :—

హజ్రత్ ఉమరుగారు "అస్ఫహానుపై దాడివెడల వలెను"అని బస్రాఅధికారియగు అబ్దుల్లాబిన్ ఉత్బానుకు ఉత్తరువు గావించిరి. అబూమూసా అష్‌అరీగారు బస్రా అధికారికి సహాయము చేయవలెను అనిఏర్పాటుచేసిరి. అబ్దుల్లాః తన సైన్యముతోఁబాటు అస్ఫహాను సమీపింపఁగా అచ్చట అస్‌బీజాను గొప్ప సైన్యముతో ముసల్మానులతోఘోరయుద్ధము సలిపెను. అందుముసల్మాలకే జయము లభించెను. అపుడు అస్‌బేజానుసంధికిఁగాను మనవిచేసికొనెను. దానిని ననుసరించి సంధిగావింపఁబడెను. ఆపిదప అబ్దుల్లాః అస్ఫహానునకు ముఖ్యపట్టణమగు జైపురముపై దాడిసలిపెను. అస్ఫహాను అధికారియగు ఫాజూసఖాన్ స్వయముగా యుద్ధరంగములోదిగి పోటీయుద్ధమునకై అబ్దుల్లాఃను పిలిచెను. వారిద్దఱికి యుద్ధముప్రారంభ మాయెను. మొట్టమొదట ఫాజూసఖాను అబ్దుల్లాఃపై ఖడ్గముదూసి యొక దెబ్బ వేసెను. కాని అబ్దుల్లాః గొప్పచాతుర్యముతో వానిదెబ్బ నుండి తప్పించుకొనెను. ఆపిదప అబ్దుల్లాః యొక్క వంతు రాఁగాఫాజూసఖాన్ నేను మీతోయుద్ధము చేయను. సంధి చేసికొనుటకు కోరుచున్నాను. ఇచ్చటి వారిలో ఇష్టపడినవారు

జిజ్యా పన్ను చెల్లించి యిచ్చటనే యుండవచ్చును. ఇష్టపడని వారు దేశమువదలి పోవచ్చును అను షరతుతో సంధిగావింప వలెను అని మనవిచేసికొనెను. అటులే సంధిగావింపఁబడెను.

—: ఆజర్ బైజాను విజయము :—

బుకైరు, ఉత్బా, ఆజర్ బైజానుపై దాడి సలుపుటకై పయనమైరి. హజ్రత్ ఉమరుగారు "సమాకునకు వెంట సైన్యము పంపి బుకైరునకు సహాయమియ్యవలెనని నుఐమునకు ఉత్తరువు చేసిరి. బుకైరు జరై మైదానము యొక్క కొండలను సమీపింపఁగా వాజ్‌రోజ్ లోపరా జితులైన ఈరానీలు అస్ఫందయారునాయకత్వమున ముసల్మానులతో యుద్ధముచేయ సాగిరి. (ఖాదిసియా యుద్ధములో వధింపఁబడిన రుస్తుము సహోదరుఁడే ఈఅస్ఫందయారు.) ముసల్మానులు అస్ఫన్దయారును యుద్ధములో ప్రాణముతోపట్టుకొనిరి. అస్ఫన్దయారు బుకైరుతో "మీరుశాంతముకోరుదురా లేక యుద్ధము కోరుదురా" అని ప్రశ్నింపఁగా బుకైరు "మేము శాంతమును కోరుదుము" అనిపలికెను. "అపుడుమీరునన్ను వధింపకుఁడు. నేను మీతోసంధిచేయునంతవఱకు ఆజర్ బైజానువారు సంధిచేయరు" అని అస్ఫన్దయారు పలుకఁగా బుకైరు ఆతని మాటను అంగీకరించెను. నుఐముగారుపంపిన సైన్యసహాయము బుకైరుకుచేరెను. ముసల్మానులు ఆజర్ బైజానును సమీపించిరి. అచ్చటివారు అస్ఫన్దయారు మాటనువిని మేము జిజ్యాపన్ను చెల్లింతుము అని యొప్పుకొని ముసల్మానులతో సంధిగావించుకొనిరి. ఈవిజయమును గూర్చి బుకైరు హజ్రత్ ఉమరుగారికిఁ దెలుపఁగా ఉత్బాను ఆజర్ బైజానుపై అధికారిగా నియమించి

బుకైరు, బాబ్ పురముపై దాడిసలిపిన ముసల్మానుల సైన్యము నకు తోడుపడవలెను అనివారు ఉత్తరువుగావించిరి.

—: బాబ్ విజయము :—

ఈరాన్, ఆర్మీనియా, రష్యా సరిహద్దుకలియుచోటున బాబ్ పురముగలదు. దానిపై దాడి సలుపుటకై సురాఖా గారు పయనమైరి. వారికి ముందు అబ్దుర్ రహ్మానుగారు కొంత సైన్యముతోఁబాటు పయనమై యుండిరి. సురాఖా, బాబ్ పురమును చేరకముందే బుకైరుగారు అచ్చటచేరి మకాము చేసిరి. బాబ్ అధికారి స్వయముగా ముసల్మానుల సేనాధిపతి సన్నిధికివచ్చి "నేను ఈరాను ప్రభుత్వమునకు లోఁబడినవాఁడను. మీరు ఈరాను ప్రభుత్వమునే జయించినపుడు నేను మీకులోఁబడక యెట్లుందును. నాయొద్ద మీరు జిజ్యా పన్ను వసూలు చేయవలదు. దీనికిబదులుగ నేను సైన్యముతో మీకు తోడు పడుదును" అని మనవి గావించుకొనెను. ఆతనిమాట విని ముసల్మానుల సేనాధిపతి అంగీకరించి హజ్రత్ ఉమరు గారికిఁదెలుపఁగా వారు కూడ అంగీకరించిరి. యుద్ధములో సేవ చేయని వారలకు దానిబదులుగ జిజ్యాపన్ను విధింపఁబడును. యుద్ధసేవచేయువారిపై ఆపన్ను విధింపఁబడదు. బాబ్ పురమును జయించిన పిదప సురాఖాగారు తమసైన్యమును ఆర్మీనియా సరిహద్దులలోఁగల కొండల ప్రదేశమునకుఁదీసికొని వెడలిరి. బుకైరుగారు మూఖాను వైపునకు పయనమై దానిని జయించిరి. మూఖాను పట్టణము ఇస్లాము రాజ్యములో చేరిపోయెను. ఇది హి॥ శ॥ 21వ సం॥ సంభవించెను.

సురాఖాగారు చనిపోఁగా వారి స్థానమున అబ్దుర్

రహ్మానుగారు నియమింపఁబడిరి. అబ్దుర్ రహ్మానుగారు హజ్రత్ ఉమరుగారి సెలవు ననుసరించి బాబ్ పురమునుండి ఖజర్ దేశముపై దాడి సలిపిరి. షహర్ బరాజ్ అనునాతఁడు "మీరెక్కడికి పోవనుద్దేశించినారు" అని అబ్దుర్ రహ్మాను గారిని ప్రశ్నింపఁగా ఖజర్ దేశమునకు ముఖ్య పట్టణమైన బలన్జరు పోయిఅచ్చటనున్న తురష్కులను మార్కొనుటకు నుద్దేశించినాను అని పలికిరి. అపుడు షహరు బజార్ "తురుష్కులు మాపైదండెత్తి రాకుండుటయే చాల మేలు అని మేము తలంచుచుంటిమి" అని ఆశ్చర్యముతో పలికెను. అపుడు అబ్దుర్ రహ్మానుగారు "నేను తప్పక వీరి దేశములో ప్రవేశించితీరుదును. దేవుని సాక్షి! నా వెంటనున్నవారికి సేనాధిపతి యాజ్ఞ అయినచో వారు సికందరు (అలెగ్జాండరు) నిర్మించిన గోడయొద్దకు పోఁగలరు" అని పలుకఁగా వారెవరు అని షహర్ బరాజ్ ఆశ్చర్యముతో ప్రశ్నించెను "నా వెంటనున్న వారలు హజ్రత్ ముహమ్మద్ రసూలువారి శిష్యులు. వీరు మనః పూర్వకముగా ఇస్లాములో చేరి మహాభక్తితో ఇస్లాము మతసేవగావించినవారలు. ఇతరజాతులవారు వీరిని జయించి వీరి మనస్సులను మార్చినంతవఱకు వీరికి ఇస్లాము మతమందు గలభక్తి విశ్వాసములును క్షీణించునవికావు. ఆపిదప అబ్దుర్ రహ్మానుగారు బాబ్ పురమునుండి పయనమై ఏలాటి అడ్డు లేకుండ బలన్జరు పట్టణముచేరిరి. బలన్జరులోనున్న తురుష్కులు ముసల్మానుల ధైర్యసాహసములను చూచి వీరు మానవ మాత్రులుకారు. వీరు దేవునిదూతలు (ఫరిస్తే) అని గ్రహించి తురుష్కులు ముసల్మానులను ఆటంకపఱచలేదు. ముసల్మా

నుల సైన్యము బలన్గరును వశపఱచుకొని అచ్చటినుండి రెండు వందల కోసులదూరముదాఁటిపోయి నిలిచెను. బాబ్ పురము నకు చుట్టుపట్లనున్న దేశమంతయు జయింపఁబడిన పిదప అబ్దుర్ రహ్మానుగారు బాబ్ పురమునకు అధికారిగా నియమింపఁబడిరి. ఆపిదపవారు అచ్చటనే తమనివాసము ఏర్పఱచుకొనిరి.

## —: ఖురాసాను విజయము :—

ఈరాను చక్రవర్తి యజ్దగిర్దు, మర్వోషాజహానుఅనుపట్టణమును క్రొత్తగా తన ప్రభుత్వమునకు ముఖ్యపట్టణముగాఁ జేసికొని ముసల్మానులతో యుద్ధము సలుపవలెనని ప్రయత్నములు చేయుచుండెను. అహానఫుగారు, యజ్దగిర్దును మారొక్కానవలెనని పయనమైరి. మొట్టమొదట హిరాతు పట్టణమును జయించిరి. ఆపిదప మర్వోషాజహానుపై దాడిసలిపిరి. ముసల్మానుల సైన్యము వచ్చుచున్న దని విన యజ్దగిర్దుమర్వోషాజహానును వదలి మర్వోరూదునకు పాఱిపోయెను. అచ్చట నుండి చైనాను, తురకిస్తానురాజుల సహాయము వేడుకొనెను. అహానఫుగారు మర్వోషాజహానును పట్టుకొనిరి. ఆ పపిద మర్వోరూదుపై దాడిసలిపిరి. అపుడుయజ్దగిర్దుఅచ్చటనుండిపాఱిపోయి బలఖుపురము చేరెను. అహానఫుగారు మర్వోరూదునుకూడ వశము చేసికొనిరి. అహానఫుగారికి కూఫానుండి సైన్యసహాయము వచ్చెను. వీరు క్రొత్తసైన్యముతో బలఖ్ పై దాడిసలిపిరి. యజ్దగిర్దు ఇచ్చట గొప్పధైర్యముతో నిలిచి ముసల్మానులతో యుద్ధము సలిపెను. కాని యుద్ధములో

నోడిపోయి జైహూను నదిదాఁటిపోయి తురకిస్తాను ప్రాంత
ములోనికిపోయి నిలిచెను.

యజ్దగిర్దు తురకిస్తానునకు ముఖ్యపట్టణమగు ఫరగానా
పోయిచేరఁగా తురకిస్తానురాజు ఆతనికి గొప్ప ఆతిథ్యముసలిపి
ఆతని సహాయమునకై గొప్పసైన్యము సిద్ధపఱచెను. మరల
యజ్దగిర్దు తురకిస్తానురాజుతోఁబాటు గొప్ప సైన్యము తీసికొని
జైహూనునది దాఁటి వచ్చెను. యజ్దగిర్దు స్వయముగా మర్వో
షాజహానుపై దండెత్తెను. మఱియు తురకిస్తాను రాజు మర్వో
రూదుపై దాడిసలిపెను. ఆహనఫుగారు తురకిస్తాను రాజుతో
మర్వోరూదుయొద్ద ఘోరయుద్ధము సలిపిరి. యుద్ధములో ముస
ల్మానులకు విజయములభించెను. తురకిస్తానురాజు పరాజితుఁడై
మిగిలిన తన సైన్యమును దీసికొని తన దేశమునకు తిరిగి
పోయెను. యజ్దగిర్దునకు ఈవార్త దెలియఁగానే ఆతఁడుధైర్యము
వీడి తనయొద్దనున్న వజ్రములు బంగారు మొదలగు ఖజానాలు
దీసికొని తురకిస్తానునకు పాఱిపోయెను. ఆతని వెంటనున్న
వారలు "ప్రభుత్వము పోయెను. ఇఁక మా దేశధనముకూడ
తురకిస్తానునకు పోవుచున్నది" అని తలఁచి యజ్దగిర్దు యొద్ద
నున్న ధనమును సామగ్రిని దోఁచుకొనిరి. యజ్దగిర్దు అన్ని విధ
ముల యాసవదలి ఫరగానా రాజుయొద్దకుపోయి అచ్చటనే
నివాసము ఏర్పఱచుకొనెను. హజ్రత్ ఉమరుగారి జీవితకాలము
వఱకు యజ్దగిర్దు ఫరగానాలోనే యుండెను. హజ్రత్ ఉస్మా
నెగనీవారి ప్రభుత్వకాలములో సైన్యము సేకరించుకొని ముస
ల్మానులతో యుద్ధముచేసి యోడిపోయి పాఱిపోవుచుండఁగ
మార్గమధ్యమందు వధింపఁబడెను. ఇఁకమీఁద దానిఁ గూర్చి

వ్రాయుదుము. ఖురాసాను దేశములోనున్న అధికారులు (సామంత రాజులు) అహనఫుగారితో అభయమునుగూర్చి మనవిగావించి జిజ్యా పన్ను చెల్లింతుమని సంధిచేసికొనిరి. ఖురాసాను దేశస్థులు పూర్వముకంటె నెక్కుడు శాంతముతో ఏలాటి భయము లేకుండ ఇస్లామ్‌మతప్రభుత్వములో నివసింప సాగిరి.

—: ఫసా, దారా బ్రజద్ విజయము :—

సారియాగారు, ఫసామఱియు దారాబ్రజద్, పురములపై దండెత్తివెడలిరి. అచ్చటిఈరానీలు తమపొరుగుననున్న కుర్దులసహాయముతో ముసల్మానులతో ఘోరయుద్ధము సలిపిరి. యుద్ధము జరుగుచున్నపుడు సారియాగారిని విరోధులుక్రమ్ముకొనిరి. చాలఅపాయకరమైన స్థితిలోనుండిరి. అపుడు పెక్కువందలమైళ్ళ దూరముననున్న మదీనాపురమునుండి "యాసారియా! అల్ జబల్ అల్ జబల్" ఓసారియా కొండను ఆశ్రయింపుము. కొండను ఆశ్రయింపుము, అని హజ్రత్ ఉమరుగారు పలుకఁగా దేవుని మహిమచే ఆశబ్దము సారియాగారు వినఁగలిగిరి. అపుడు సారియాగారు తమసైన్యమును దీసికొని కొండను సమీపించి ఆకొండ తమవీఁపువెనుక ఉండునట్లు నిలిచి యుద్ధము సలుపసాగిరి. ఆపిదప ముసల్మానులకు జయము లభించెను. యుద్ధములో జయముపొందిన పిదప సారియాగారు విజయవార్తను, విజయధనము నిచ్చుటకుఁగాను మదీనాపురమునకు ఒక రాయబారిని పంపిరి. మదీనావారు ఆరాయబారితో "హజ్రత్ ఉమరుగారు ఫలానిసమయమందు ఉపన్యాసమిచ్చుచు యాసారియా! అల్ జబల్ అల్ జబల్ అని

యకాయకీ కేక వేసి మాకు అనేకప్రాణులు (దేవదూతలు) గలరు. బహుశః ఎవరైన ఈ నాశబ్దమును సారియాకు అందఁ జేయఁగలరు" అని పలికిరి, ఈ శబ్దమును మీరువింటిరా అని ప్రశ్నించిరి. అపుడు ఆరాయబారి "హజ్రత్ ఉమరుగారి శబ్దమువినిన పిమ్మటనే సారియా తనసైన్యమును కొండచేరువకు దీసికొనిపోయి యుద్ధముచేసి జయము పొందఁగలిగెను" అని పలికెను.

—: కిర్మాను విజయము :—

సుహైలుబిన్ అదీగారు కిర్మానుపై దండెత్తిపోయిరి. వీరికి సహాయముగా అబ్దుల్లాఃగారు సైన్యము దీసికొనిపోయిరి. కిర్మానులో ఈరానీలు తమ గొప్పసైన్యముతో ముసల్మానులతో యుద్ధము సలిపిరి. కిర్మాను అధికారి యుద్ధరంగములో వధింపఁబడెను. ముసల్మానులకు జయములభించెను. కిర్మాను పట్టణము ముసల్మానులు ప్రవేశించి తమవసము గావించుకొనిరి.

—: సజిస్తాను విజయము :—

ఆసిముబిన్ ఉమరుగారు సజిస్తానముపై దండెత్తిరి. సజిస్తానువారు ముసల్మానులతో యుద్ధము సలిపిరి. కాని యుద్ధరంగములో నిలువలేక పరాజితులై పాఱిపోయిరి. ముసల్మానులు సజిస్తానునకు ముఖ్యపట్టణమైన జరస్జును ముట్టడించిరి. ముట్టువడినవారు తుదకు విసుగుపొంది "అడవి ప్రాంతమంతయు మాపశువుల మేఁతకొఱకు ప్రత్యేకముగా వదలిపెట్టవలెను. ఈ షరతుతో మేము సంధిగావింతుము అని విన్నవింపఁగా ముసల్మానులు ఆషరతును అంగీకరించిరి.

ముసల్మానులు తాము గావించిన వాగ్దానమును చాలకాలము పాలించిరి. ఆ ప్రాంతములో నుండిపోవలసి వచ్చి నపుడు చాలతొందఱగా దానిని దాటిపోవుచుండిరి. ఆప్రాంతములో తమపశువులను మేపకుండిరి.

—: మక్రాను విజయము :—

మక్రాను సింధు మఱియు బలఖ్ నది ప్రాంతము. దీనిపై హజ్రత్ హాకమ్‌గారు దండెత్తివెడలిరి. సహాలుగారును అబ్దుల్లాగారును కిర్మాను విజయము పిమ్మట హాకమ్‌గారికి సహాయముగా వచ్చిచేరిరి. ముసల్మానుల సైన్యము మహా వైభవముతో విజయపతాకములు ఎగురవేయుచు సింధునది వఱకు పోయిచేరెను. అచ్చట మక్రానువారు ముసల్మానులతో యుద్ధముచేయుటకై సిద్ధమైవచ్చిరి. సింధురాజుకూడ మక్రానువారికి సహాయముగా తన గొప్పసైన్యమునుపంపెను. మక్రాను సింధుసైన్యములు ఏకమై మహాధైర్యముతో ముసల్మానులతో యుద్ధము సలిపిరి. కాని తుదకు వారు ముసల్మానుల దెబ్బకు తాళలేక యుద్ధరంగమువదలి పరాజితులై పాఱిపోయిరి. ముసల్మానులు మక్రాను పట్టణమును వసపఱచుకొనిరి. హాకమ్‌గారు విజయవార్తను విజయధనమును హజ్రత్ ఉమరుగారికి పంపిరి. హాకమ్‌గారు హిందూదేశములో ప్రవేశింపవలెనని కోరుచుండిరి. కాని హజ్రత్ ఉమరుగారు దానికి ఇష్టపడలేదు. ఇంతవఱకు లభించినవిజయములే చాలును. హిందూదేశములో ప్రవేశింపనక్కఱలేదు అని హాకమ్ గారికి ఉత్తరువు పంపిరి.

—: సిరియా, పాలస్తీన, దమస్కుపురముల విజయము :—

హాజ్రత్ ఉమరుగారు ఖలీఫాగా నెన్నుకొనఁబడిన ప్రారంభములో ముసల్మానులు రోమనులతో యర్మూకునందు యుద్ధముచేసి జయముపొంది అచ్చట నిలిచియుండిరి. ఓడి పోయిన రోమనులు ఫహాలునందు నిలిచియున్నారు అనియు రోమనురాజు కైజరు ముసల్మానులతో యుద్ధము చేయవలెనని గొప్ప సైన్యము సేకరించి దమస్కులో నిలిచియున్నాఁడు అని ముసల్మానుల సేనాధిపతులగు అబూఉబైదాగారికిఁ దెలిసెను. దీనిఁగూర్చి ఏమిచేయవలెనని అబూఉబైదాగారుహాజ్రత్ ఉమరుగారికి వ్రాయఁగావారు "కొంతసైన్యమును ఫహాలువైపునకు పంపి మిగత సైన్యముతీసికొని సిరియాదేశమునకు ముఖ్యపట్టణమగు దమస్కుపై దాడిసలుపవలసినది"అని అబూఉబైదాగారికి ఉత్తరువు పంపిరి.

అబూఉబైదాగారుహాజ్రత్ ఉమరుగారిసెలవుననుసరించి కొంతసైన్యమును ఫహాలువైపునకుపంపిరి. ఈ సైన్యముపోయి ఫహాలు పట్టణమును ముట్టడించెను. దమస్కులోనున్న రోమను సైన్యమునకు సహాయము రాకుండుటకై అబూఉబైదాగారు తమ కొంత సైన్యమును దమస్కు, హిమ్మ్సులకు మధ్యను మఱికొంత సైన్యము దమస్కు పాలస్తీవల మధ్యను నియమించిరి. మిగిలిన సైన్యమును దీసికొని అబూఉబైదాగారు స్వయముగా దమస్కుపై దాడిసలిపిరి. దమస్కులో రోమను సైన్యమునకు నస్తూరు సేనాధిపతిగా నుండెను. అతఁడు ముసల్మానుల సైన్యము వచ్చుచున్నది అనువార్త వినగాఁనే పురద్వారములు మూసికొని లోపలకోటలో నిలిచిపోయెను. ముస

ల్మానులు దమస్కు పట్టణమును ముట్టడించిరి. దమస్కునకు నాలుగు ద్వారములుండెను. ఒక ద్వారముపై అబూఉబైదా గారు సైన్యముదీసికొని నిలిచిరి. రెండవతలుపు నొద్ద అమర్ బిన్ ఆసుగారుండిరి. మూఁడవతలుపునొద్ద ఖాలిదుగారు నిలిచి యుండిరి. నాల్గవద్వారము నొద్దయజీదుబిన్ అబూసుఫ్యాను గారుండిరి. ముసల్మానులు డెబ్బది దినములవఱకు పట్టణమును ముట్టడించి యుండిరి. ఆమధ్య అపుడపుడు రోమనులు కోట బురుజులపై నిలిచి బాణములు వేయుచుండిరి.

—: ఖాలిద్‌గారి ధైర్యము :—

ఖాలిద్‌గారు రాత్రియందుచాల తక్కువ నిద్రపోవు చుండిరి. శత్రువుయొక్క విషయములు దెలిసికొనుటకై చాల ప్రయత్నములు చేయుచుండిరి. ఒక రాత్రి దమస్కులో మామూలుకు విరుద్ధముగా చాల ధ్వనులును కేకలును వినఁబడెను. గూఢచారులనుపంపి విచారింపఁగా దమస్కురుయొక్క పెద్ద పాదరీకి కుమారుఁడు పుట్టినసంతోషములో ఆటలు పాటక చేరీలు, నటనములు జరుగుచున్నవి. రోమనులు మద్యము త్రాగి మతిచెడి పొర్లాడు చున్నారు. అని ఖాలిద్‌గారికిఁదెలియ నాయెను. ఖాలిద్‌గారు ఈయవకాశమును పోఁగొట్టకొనఁగూడదు. లాభముపొందవలెనని యుద్దేశించి కొందఱు యుద్ధ వీరులను వెంటఁదీసికొని అగడ్త (ఖన్దఖు) దాఁటికోట గోడను సమీపించిరి. త్రాళ్లతో నిచ్చెనలు నిర్మించిరి. ఆనిచ్చెనల కొనలలో ఉచ్చులు తగిలించి ఉచ్చులను కోటగోడపై నుండు ధిమ్మ (కంగురు)లపై తగిలించిరి. ఆనిచ్చెనలపై నెక్కి కోట లోపలదిగి ద్వారపాలకులను వధించి తలుపును తెఱచివేసిరి.

అల్లా హుఅక్బర్ అని గట్టిగా పలికిరి. ఆశబ్దమును విని బయట నిలిచియున్న ముసల్మానుల సైన్యము పురములో ప్రవేశించెను. ఆకస్మికముగా వచ్చిపడిన యాపదను చూచిభయాక్రాంతులై యేమియు తోఁచక రెండవతలుపును తెఱచి అబూఉబైదా గారి యొద్దకుపోయి సంధినిగూర్చి మనవి చేసికొనిరి. ఖాలిద్ గారుగావించినధైర్యము అబూఉబైదాగారికిఁదెలియకుండెను. కావున ఇస్లాముయొక్క యుద్ధ ధర్మములనుబట్టి తత్క్షణమే అబూఉబైదాగారు సంధినిసమ్మతించి తమ సైన్యముతో శాంతిగా పురములో ప్రవేశించిరి. ఖాలిద్ గారును అబూ ఉబైదాగారును పట్టణములో మార్గమధ్యమున కలిసికొనిరి. అపుడు రోమనుగావించిన యుక్తి అబూఉబైదాగారికిఁదెలి యనాయెను. ఇఁకపురము సంధిమూలమున జయింపఁబడెనా లేక యుద్ధ మూలమున జయింపఁబడెనాఅను ప్రశ్న గలిగెను. పరస్పరము చర్చజరిగెను. తుదకు అబూఉబైదాగారుపూర్తి పట్టణము సంధిమూలము జయింపఁబడనది అని తీర్మానించిరి. రోమనులతో అబూఉబైగారుగావించిన సంధిషరతులను పుర మంతటికిని అన్వయించునట్లు చాటించిరి. సంధిషరతులు ఇట్లు న్నవి:- రోమనులు తమయొద్దనున్న వెండి బంగారము, ఆస్తి లోని అయిదింట నొక భాగము ఇయ్యవలెను. తల ఒకటికి ఒకదీనారమును, ప్రతి యెకరమునకు ఒకతూము గోధుమ లును చెల్లించుచుండవలెను. దీనిపిదప రోమనుల ప్రాణములు సొత్తు, ధనము, ఆస్తి, గుడులు మొదలగునవి సురక్షిత ముగా నుండఁగలవు. వీనిఁగూర్చి ముసల్మానులు తమ యేలాటి అధికారముచలాయింపరు. దమస్కు హి॥ శ॥ 14వ॥ సంవత్స

రము రజబు నెలలో జయింపఁబడెను. అబూఉబైదాగారు హాజ్రత్ ఉమరుగారికి దమస్కు విజయమును గూర్చి లేఖ వ్రాసిదెలిపిరి. యజీద్ బిన్ సుఫ్యాయనుగారు దమస్కునకు అధికారిగా నియమింపఁబడిరి. వారు దమస్కునకు చుట్టు పట నున్న సబీదా, అర్ఖా, జబీలు, బేరూతు మొదలగు పురములను జయించి వసపఱచుకొనిరి. వారితమ్ములగు మఆవియాగారు ఖైసారపై దండెత్తి దానిని జయించిరి.

—: ఫహలు యుద్ధము :—

దమస్కును జయించిన పిదప అబూఉబైదాగారు ఫహాలుపై దండెత్తిరి. ఖాలిద్ బిన్ వలీదు. మొదలగు గొప్ప యుద్ధవీరులు వీరివెంటనుండిరి. రోమనులు ఫహాలుపట్టణ రక్షణార్థము దాని చుట్టునున్న నీటికాలువల కట్టలను కోసివేసిరి. దాని వలన ఫహాలునకు చుట్టు నీళ్లే కనఁబడుచుండెను. ముసల్మానుల సైన్యము ఫహాలును సమీపించి దానిని ముట్టడించెను. ఒకరాత్రి రోమనుల సేనాధిపతియగు సఖ్లా గొప్ప సైన్యము దీసికొని ఆకస్మికముగా రాత్రి చీఁకటిలో ముసల్మానులపైఁబడవలెనని బయలుదేఱెను. హాజ్రత్ ఉమరుగారి సెలవు ననుసరించి షురహబీలుగారు తమ సైన్యమును సిద్ధముగాఁజేసికొని రాత్రియంతయు మేలుకొని యుండుచుండిరి. అందువలన రోమను సేనాధిపతి షురహబీలుగారి సైన్యముతో యుద్ధము సలుపవలసి వచ్చెను. ఘోరయుద్ధము ప్రారంభమాయెను. రాత్రియంతయు యుద్ధముజరుగుచుండెను. మరుసటి దినముకూడ ఘోరయుద్ధము జరుగుచునే యుండెను. దినము గ్రుంకి రాత్రికాఁగానే రోమనుల సేనాధిపతి

యుద్ధరంగములో ముసల్మానులచే వధింపఁబడెను. రోమనులు పరాజితులై యుద్ధరంగమువీడి పాఱిపోసాగిరి. పురమునకు చుట్టు నీళ్ళుక్రమ్ముకొని యుండెను. రాత్రిచీఁకటిలో ఎచ్చటికి పాఱిపోఁగలరు. దాఁదాపు ఎనుబదివేల రోమనులు వధింపఁబడిరి. అమితముగా విజయధనము ముసల్మానులకు లభించెను. ఫహాలుపురము ముసల్మానుల వసమాయెను. అచ్చటను షురహబీలుగారు బైసానుతబరీయాపై దండెత్తిరి. ఆరెండు పట్టణములును జయింపఁబడెను. దమస్కువారు గావించుకొనిన షరతులపై అచ్చటివారు కూడ సంధిచేసికొనిరి.

—: మిర్జెరూమ్‌యుద్ధము :—

అబూఉబైదాగారు హిమ్మసువైపునకు పయనమైరి. ఖాలిద్‌గారుకూడ నుండిరి. మార్గమధ్యమందు మిర్జెరూమ్ అనుచోట రోమనుల రెండు గొప్పసైన్యములు ముసల్మానులను మార్కొనుటకై వచ్చియుండెను. ఈరెండు సైన్యములను రోమనురాజు పంపియుండెను. అందు ఒక సైన్యమునకు తోజరును మఱొక సైన్యమునకు షనసును సేనాధిపతులుగా నుండిరి. అబూఉబైదాగారు షనసు సైన్యముతో యుద్ధము చేయుటకై సిద్ధమైరి. ఖాలిద్‌గారు తోజరు సైన్యమును మార్కొనుటకై సిద్ధమైరి. ఉదయము కాఁగానే ఆకస్మికముగా దమస్కులోనున్న ముసల్మానులపైఁబడి యుద్ధము సలుపుటకై తోజరు పయనమాయెను అని ఖాలిద్ గారికిఁ దెలియనాయెను. ఈవిషయము తెలియఁగానే ఖాలిద్ గారుకూడ తోజరును మార్కొన వలెనని దమస్కువైపునకు పయనమైరి. దమస్కులోనున్న ముసల్మానుల సేనాధిపతి

యజీద్ బిన్ అబీ సుఫ్యానునకు తోజరు సైన్యము తీసికొని వచ్చుచున్నాఁడు అని దెలిసెను. అప్పుడు ముసల్మానులుకూడ యుద్ధమునకై సంసిద్ధులైరి. దమస్కసకు బయట మైదానములో ముసల్మానులకును రోమనులకును మధ్య యుద్ధము ప్రారంభమాయెను. యుద్ధము జరుగుచున్న సమయములోనే ఖాలిద్ గారుకూడ వచ్చిచేరిరి. ఖాలిద్ గారు తోజరు సైన్యముపై వెనుకనుండి యుద్ధము ప్రారంభించిరి.

రోమనులు ముసల్మానుల రెండు సైన్యముల మధ్య చిక్కుకొనిరి. ఒక్క రోమను సిపాయి మిగులకుండ అందఱు రోమనులు యుద్ధములో వధింపఁబడిరి. మిర్జైరూములో అబూ ఉబైదాగారు షనస్ సైన్యముతో యుద్ధము సలిపిరి. రోమనులు ఓడిపోయిరి.

## —: హిమ్మసు విజయము :—

రోమనురాజు కైజరు హిమ్మసులో మకాము చేసియుండెను. తోజరు, షనసు ఓడిపోయిరి. ముసల్మానులు ముందుకు బయలుదేఱి వచ్చుచున్నారు అను విషయము కైజరునకుఁ దెలిసిన వెంటనే యాతఁడు హిమ్మసును వదలి అన్తాకియాకు వెళ్ళిపోయెను. అబూఉబైదాగారు బఅల్ బక్కను జయించి హిమ్మసుపై దాడిసలిపి దానిని ముట్టడించిరి. హిమ్మసు పురమువారు తమకు రాజు సైన్యసహాయము పంపును అని చాల కాలము వఱకు వేచియుండిరి. కాని రోమను రాజు వారికెలాటి సహాయము పంపలేదు. తుదకు హిమ్మసువారు విసుగుచెంది అబూఉబైదాగారితో దమస్కవారికి విధింపఁబడిన సంధిషరతులతో సంధిగావించుకొనిరి. అబూఉబైదా

గారు హిమ్మసుపురములో ప్రవేశించిరి. ఆపిదప ఉబాదా బిన్‌సామిత్‌గారిని హిమ్మసునకు అధికారిగా నియమించి అబూఉబైదాగారు అచ్చటనుండి పయనమైరి. హీమా, షీజర్, మఅర్రా అను పురముల వారు దమస్కువారు గావించిన షరతులతో సంధిచేసికొనిరి. దీని పిమ్మట ముసల్మానులు లాజిఖియ్యాపై దాడిసలిపిరి. అచ్చటివారు ముసల్మానులతో యుద్ధముచేసి ఓడిపోయిరి. ఓడిపోయిన వారు తమ పురమును వదలి పాఱిపోయి ముసల్మానులతో అభయమును గూర్చియు తిరిగి వారు తమ పురములో వచ్చుటకు సెలవును గూర్చియు మనవి చేసికొనిరి. అబూఉబైదాగారు లాజిఖియావారి మనవిని అంగీకరించిరి. వారందఱు తిరిగి తమ పురములో శాంతితో ప్రవేశించి నివసింపసాగిరి. ముసల్మానులు లాజిఖియాలోనొక జుమామసీదు నిర్మించిరి.

—: ఖన్సరీను విజయము :—

అబూఉబైదాగారు, ఖన్సరీనుపై దాడిసలుపుటకై ఖాలిద్‌గారిని నియమించిరి. హాజిరు అనుచోట రోమనుల గొప్ప సేనాధిపతి గొప్పసైన్యముతో ముసల్మానులతో యుద్ధము సలిపెను. కాని యుద్ధములో ఓడిపోయెను. ఖాలిద్‌గారు హాజిరునుండి పయనమై ఖన్సరీను పట్టణమును ముట్టడించిరి. అపుడు ఖన్సరీను వారు పురద్వారములు మూసికొని లోపలనే నిలిచి పోయిరి. అపుడు అచ్చటి వారికిట్లు ఖాలిద్‌గారు కబురు పంపిరి:— "మీరు తలుపులు వేసికొని పురములో నిలిచిపోవుట వలన ప్రయోజనము లేదు. మీరు ఆకాశముపైకెక్కి పోయినను దేవుఁడు మమ్ము అచ్చటికి చేర్చును. లేదా మీరేదిగి

మా యొద్దకు వచ్చునట్లు చేయును.'' తుదకు విధిలేక ఖన్సరీను వారు ముసల్మానులకు లొంగిపురద్వారముల తెఱచి దమస్కు వారి షరతులవంటి షరతులపై సంధిగావించు కొనిరి.

ఖాలిద్ గారుగావించిన మహాకార్యములు హజ్రత్ ఉమరుగారికిఁ దెలిసిచాల సంతోషపడిరి. "ఖాలిద్ తన ఘన కార్యములచే తన్ను తాను సేనాధిపతిగాఁ జేసికొనెను. దేవుఁడు హజ్రత్ అబూబకరుగారిని అనుగ్రహించుగాత! వారు నాకంటె నెక్కువ జనులయోగ్యతను గుర్తించియుండిరి. అందులకేవారు ఖాలిద్ గారికిఁదగిన స్థానములో నియమించి యుండిరి. నేను ఖాలిద్ ను ఆస్థానము (సర్వసేనాధిపత్యము) నుండి తొలగించుటకు కారణము ఖాలిద్ యొక్క బలహీనతకాదు. కాని జనులు ఆతనిపైననే ఆధారపడి ఇస్లాము విజయములన్నియు ఆతని వలననేలభించుచున్నవి అని తలఁచి మోసపోకుండుటకై అట్లు చేసితిని" అని పలికి హజ్రత్ ఉమరుగారు ఖాలిద్ గారి పదవిని అధికారములను హెచ్చించిరి.

—: రోమనురాజు సిరియానువీడుట :—

రోమనురాజగు హిర్ ఖలు, అన్తాకియాలో నుండెను. సిరియా దేశములో ముసల్మానులకు లభించుచున్న జయములనుచూచి తానుసిరియా దేశమునుగూర్చి నిరాశ చెంది ఖుస్తున్ తున్యా (కాన్ స్టాన్ నోపిలు)కు పోవలెనని నిశ్చయించుకొనెను. హిర్ ఖలురాజు ప్రతిసంవత్సరము ఎరూషలేమునకు యాత్రికై వచ్చునాతఁడు. సిరియా సరిహద్దులను దాఁటిపోవుచు "ఓసిరియా! యాత్రికునినుండి సలామ్ (వందనములు) అంగీకరింపుము. నీయందేమనస్సు తగిలియున్నది. తిరిగినీయొ

ద్దకు రానున్నాఁడు" అని పలుకుచు ఖుస్ తుస్తున్యాకుపయ
నమై పోవుచుండెను. కాని యీసారి షమ్సాతు అనుచోట
చేరి ఒకకొండపై నెక్కి బైతుల్ ముఖద్దసువైపున ముఖముచేసి
"ఓసిరియా! నీనుండి వీడిపోవునట్టి వానివందనములు అంగీక
రింపుము. ఈవియోగముపిమ్మట తిరిగికలియుట అసాధ్యము.
ఇఁక నీకు వీడుకోలుపలుకుచున్నాను" అనిపలికెను. అట్టుహిర్ఖలు
నిరాశచెంది ఖుస్తున్ తున్యాచేరెను. ముసల్మానుల చెఱనుండి
తప్పించుకొని ఒకరోమను ఖుస్తున్ తున్యాచేరెను. హిర్ఖలు
రాజు వానితో ముసల్మానులనుగూర్చి అడిగెను. ఆరోమను
"ఓరాజా! ముసల్మానులు పగటిపూఁట గొప్పశౌర్యముతో
యుద్ధమాడుదురు. రాత్రిపూఁట దేవునిప్రార్థనలలో గడుపు
దురు. ముసల్మానులు జయించిన పట్టణములలో లోఁబడిన
వారిసొత్తును వెలకుగైకొనుదురు. ఉచితముగా నొకవస్తువు
నైనను బలాత్కారముగాఁ దీసికొనరు. ముసల్మానులుజయిం
చిన దేశములలో శాంతమేయుండును. రైతులుఏలాటి భయ
ములేకుండ స్వేచ్ఛగానుందురు. ఎవరైన ముసల్మానులతో
యుద్ధమునలిపినచో ముసల్మానులు తమశత్రువును ఓడించు
నంతవఱకు వదలరు" అని పలుకఁగా రాజువిని "ఇట్టిసుగుణములు
ముసల్మానులు గలిగియున్నచో వారుతప్పక నాపాదముల
క్రిందనున్న భూమినికూడ జయింతురు" అని పలికెను.

—: హలబ్ విజయము :—

అబూఉబైదాగారు హలబ్ పై దాడి సలిపిరి. హలబ్
వారు కోట తలుపులు వేసికొని పురములో నిలిచిపోయిరి. ముస
ల్మానులు పురమునుముట్టడించిరి. హలబ్ వారు విసిగి విధిలేక

అబూఉబైదాగారితో "మాప్రాణములకును, ఆలుబిడ్డలకును సొత్తునకును, గుళ్లకును, కోటలకును, అభయమునొసంగవలెను" అని మనవిచేసికొనిరి. అబూఉబైదాగారు వారిమనవిని అంగీకరించి దమస్కు వారి షరతులపై సంధిగావించుకొనిరి.

—: అన్తాకియా విజయము :—

అబూఉబైదాగారు హాలబ్‌ను జయించిన పిమ్మట అన్తాకియాపై దాడి సలిపిరి. అన్తాకియా రోమనురాజునకు ఏషియా దేశములో ముఖ్యపట్టణముగా నుండెను. అది సేనలకు ముఖ్యస్థానము గనుక రాజకీయ విషయములలో చాలప్రధానముగా నుండెను. ఖన్సరీను మొదలగు పట్టణముల నుండి ఓడిపోయిన క్రైస్తవులు అన్తాకియాలో శరణాగతులై యుండిరి. ముసల్మానులు అన్తాకియాను సమీపింపఁగానే క్రైస్తవులు పురమునకు బయట ముసల్మానులతో యుద్ధము సలిపిరి. కాని ముసల్మానుల దెబ్బకు తాళలేక పరాజితులై పాఱిపోయి పురములో ప్రవేశించి పురద్వారములు వేసికొనిరి. ముసల్మానులు పురమును నలుప్రక్కల నుండి ముట్టడించిరి. అట్లుకొన్ని దినములుగడచెను. తుదకు అన్తాకియావారు అబూఉబైదాగారి యొద్దకు సంధిని గూర్చి మనవిచేయుచు "ఇష్టపడినవారు అన్తాకియా వదలి పోవచ్చును. అన్తాకియాలోనే యుండఁదలఁచినవారు దమస్కుషరతులప్రకారము జిజ్యాపన్ను చెల్లింతురు" అని కబురుపంపిరి. అబూఉబైదాగారు అన్తాకియావారి మనవిని అంగీకరించి సంధిగావించికొని పురములో ప్రవేశించిరి. అన్తాకియా జయింపఁబడిన పిదప అది ముసల్మానుల సైన్యమునకు ముఖ్యస్థానముగా

నియమింపఁబడెను. ఆపిదపఅబూఉబైదాగారు చుట్టుపట్లనున్న పురములపై సైన్యమును పంపి అనేకపురములను జయించిరి. ముసల్మానుల సైన్యము సిరియాయొక్క తూర్పు ప్రాంతమును ఫురాతునది సరిహద్దుల వఱకును పశ్చిమమున ఆసియామైనరు వఱకును జయించెను. అబూఉబైదాగారు సిరియాదేశమును జయించిన పిదప దాని ప్రతి పరగణాలో నొక్కొకఅధికారిని నియమించి, దాని రక్షణార్థము సైన్యమును నియమించిరి. అబూఉబైదాగారు తిరిగి పాలస్తీనాకువచ్చిచేరిరి. అచ్చట నుండి కొంత సైన్యమును ఆసియామైనరు వైపునపంపిరి. రోమనులును అరబ్బు క్రైస్తవులును ముసల్మానులతో యుద్ధము చేసిరి. కాని పరాజితులై చెల్లాచెదరై పోయిరి. ఖాలిద్ గారు మర్ అషుపై దాడి సలిపిదానిని జయించిరి. తిరిగి రోమనులు అచ్చటి కోటలో తమస్థానము ఏర్పఱచుకొని యుద్ధమునకై సన్నాహములు చేయుచుండుటకై దానిని ముసల్మానులు పడఁగొట్టిరి.

## —: అజ్నాదైను యుద్ధము :—

మిశ్రైరూమ్ను ముసల్మానులు జయించిన పిదప రోమను రాజు తన కొంతసైన్యమును రమ్లాఅనుచోట నియమించెను. మఱొక గొప్ప సైన్యమును బైతుల్ ముఖద్దసులో సేకరించెను. ముసల్మానులతో యుద్ధముచేయు నుద్దేశముతో అజ్నాదైను అనుచోట గొప్ప సైన్యముతోనిలిచి యుండెను.

అమర్ బిన్ ఆసుగారు ఉర్దును నుండి సైన్యము దీసికొని అజ్నాదు వైపునకు పయనమైరి. మఱియు అల్ ఖమాను మసూ్రఖును బైతుల్ ముఖద్దసు వైపునకు పంపిరి. అబూ

అయ్యూబును రమ్లావైపునకు పంపిరి. ఈ విషయములన్నియు హాజ్రిత్ ఉమరుగారికి అమర్ బిన్ ఆసుగారు దెలియఁజేసిరి. అజ్నాద్లోనున్న సేనాధిపతి అరతబూను యుద్ధతంత్రము లోను ధైర్యములోను చాల ప్రసిద్ధికెక్కి యుండెను. అమర్ బిన్ ఆసుగారు ఈవిషయములో వానికిమించినవారు. కావున సరియైన పోటిపడెను.

అమర్ బిన్ ఆసుగారు అజ్నాదుపురముచేరి దానిని ముట్టడించిరి. ఒక దినము ఆసుగారే స్వయముగా ముసల్మా నుల పక్షమున రాయబార్లుగా అరతబూను యొద్దకు పోయి అచ్చటి సైన్యవిషయములను దెలిసికొనివచ్చిరి. ఆపిమ్మట అరతబూను సైన్యము ముసల్మానులతో ఘోర యుద్ధము చేసెను. తుదకు అర్తబూను యుద్ధములో ఓడిపోయిబైతుల్ ముఖద్దసునకుపాఱిపోయెను. అమర్ బిన్ ఆసుగారు అజ్నాదును జయించి దానికి చుట్లుపట్లనున్న గజ్జా, అమ్వాసు, నాబలస్, యూఫా మొదలగుపురములను జయించిరి. ఆపిదప బైతుల్ ముఖద్దసు వైపునకు పయనమైపోయిరి.

—: బైతుల్ ముఖద్దసు విజయము :—

అమర్ బిన్ ఆసుగారు బైతుల్ ముఖద్దసునకు పోయి దానిని ముట్టడించి దాని నలుప్రక్కలు తమ సైన్యమును వ్యాపింపఁజేసిరి. దీని మధ్యకాలములో అబూఉబైదాగారును ఖాలిద్గారును తమ విజయకార్యము నెఱవేర్చి బైతుల్ ముఖద్దసునకు వచ్చిచేరిరి. బైతుల్ ముఖద్దసువారు, రోమను రాజు తమకుసైన్యసహాయము చేయును అని చాల వేచియుం డిరి. కాని రాజు వారి కేలాటి సహాయము పంపలేదు. మఱి

యు ముసల్మానుల గొప్ప గొప్ప సేనాధిపతులు తమ తమ సైన్యములతో వచ్చి యుండిరి. అజ్నాదైన్ యుద్ధములో ఓడి పోయి వచ్చిన అరతబూను కూడ ఒకరాత్రి పురమువదలి ఈజిప్టునకు పాఱిపోయెను. కావున బైతుల్ ముఖద్దసువారు అన్ని విధముల నిరాశచెంది తమ పురమును ముసల్మానుల వసముచేయవలెనని నిశ్చయించుకొనిరి. కాని ముసల్మానులు తమ పవిత్రపురమును గూర్చి ఏమిచేయుదురో అని వారు భీతిల్లిరి. ఎందుకన ఎట్లు క్రైస్తవులకు బైతుల్ ముఖద్దసు పుణ్యాస్థలమో అటులే ముసల్మానులకు కూడ చాలపుణ్యస్థలము. ముసల్మానులు తమ చేతినుండి పురములాగు కొనుదురేమో అని క్రైస్తవులకు భయముండెను. ఇంతవఱకు ముసల్మానులు జయించిన పురములను ఆయాపురవాసులకు వదలి ఏలాటి శాంతి భంగముచేయలేదు. ఈ విషయము బైతుల్ ముఖద్దసు వారికిఁదెలిసియు పై కారణమువలన భీతిల్లిరి. కావున బైతుల్ ముఖద్దసువారు "స్వయముగా మీఖలీఫా (హజ్రత్ ఉమర్ గారు) వచ్చి మాతో సంధిచేసికొని వారి చేతులార సంధి పత్రము వ్రాసియిచ్చినచో మేము మాపురమును ముసల్మానుల వసము చేయుదుము" అని ముసల్మానుల సేనాధిపతులకు కబురుపంపిరి. ఈవిషయము అబూఉబైదాగారు హజ్రత్ ఉమరుగారికిఁదెలియఁజేయుచు "మీరు బైతుల్ ముఖద్దసునకు స్వయముగావచ్చి సంధి చేసికొనినచో ఏలాటి యుద్ధముగాని రక్త ప్రవాహముగాని లేకుండ పురముజయింపఁబడును" అని మనవిచేసిరి. [బైతుల్ ముఖద్దసులో ముసల్మానులకు కూడచాల పవిత్రస్థలము. ఇందు పూర్వముగడచిన అనేకప్రవక్తల చిహ్నా

ములుగలవు. హజ్రత్ ముహమ్మద్ రసూవారు ఇచ్చట నుండి యే తమ గగన ప్రయాణము (మేరాజ్) సాగించిరి.]

—: ఖలీఫాగారు సిరియాకు పయనమగుట :—

హజ్రత్ ఉమరుగారు, ఉబైదాగారువ్రాసిన ప్రకారము బైతుల్ ముఖద్దసునకు పోవుటకు సిద్ధమై తమకు బదులుగా హజ్రతు అలీగారిని మదీనాలో అధికారిగా నియమించి పయనమైరి. హజ్రత్ ఉమరుగారు ఏలాటి వైభవము లేక సాధారణముగా నొక గుఱ్ఱముపై నెక్కి తమ వెంట కొద్దిమంది ముహాజిర్లను, అన్సారులను దీసికొని వెడలిరి. పయనము కాకముందే సిరియాలోనున్న అందఱు ముసల్మాను సర్దారులు జాబియా అను చోటునకు రావలెనని హజ్రత్ ఉమరుగారు ఉత్తరువు చేసిరి. వీరి యుత్తరువు ననుసరించి యజీదు, ఉబైదాగారు, ఖాలిద్ గారు జాబియాలోవచ్చి ఖలీఫాకు స్వాగతము నొసంగిరి. ఆసర్దార్లు పట్టువస్త్రములు ధరించి యుండిరి. ఇది చూచి హజ్రత్ ఉమరుగారు చాల కుపితులై వారిపై రాతి బెడ్డలు విసరికొట్టి, "ఏమి! మీరు రెండు సంవత్సరములలోనే మాఱిపోయి పరుల (అజమీల) వైఖరి అనుసరించినారా! మీరేలాటి దుస్తులు ధరించి నాయెదుటికి వచ్చియున్నారు! రెండు వందల సంవత్సరముల పిదపకూడ మీరిట్లు చేసినచో మిమ్ము ఈ పదవులనుండి తొలఁగింతును" అని మందలించుచు పలికిరి. అపుడు సర్దార్లు "ఓ అమీరల్ మూమినీన్! మా దేహములను ఆయుధములనుండి కాపాడుటకై పట్టువస్త్రములను ధరించితిమి. వేఱు ఉద్దేశము మాకులేదు" అని విన్నవించిరి.

అపుడు "సరే! అటులైనచో పర్వాలేదు" అని హజ్రత్ ఉమరుగారు సెలవిచ్చిరి.

—: సంధిపత్రము :—

హజ్రత్ ఉమరుగారు జాబియాలో మకాము చేసి యున్నారు అను విషయము బైతుల్ ముఖద్దసులోని క్రైస్తవులకుఁ దెలిసి వారిలో కొందఱు నాయకులు జాబియాకువచ్చి హజ్రత్ ఉమరుగారిని సంధినిగూర్చి మనవి చేసికొనిరి. హజ్రత్ ఉమరుగారు వారి మనవిని అంగీకరించి యిట్లు సంధి పత్రము వ్రాసి తమ దస్ఖతుతో వారికి నొసంగిరి.

"దేవుని సేవకుఁడును ముసల్మానుల ఖలీఫాయును అగు ఉమరు తరఫున ఏలియా (బైతుల్ ముఖద్దసు) వారికి అభయపత్రము ఒసంగఁబడుచున్నది. ఏలియావారి ప్రాణములకును, వారి ధనమునకును వారి గుడులకును వారి సిలువలకును అభయము ఒసంగఁబడుచున్నది. రోగులకును, ఆరోగ్యముగల వారికిని అన్ని మతముల వారికిని ఈఅభయము అన్వయించును. ముసల్మానులు వీరి గుళ్ళనుగాని దేవాలయములనుగాని వశపఱచుకొనరు. మఱి వానిని పడఁగొట్టరు. వారి మత విషయములో నేలాటి జోక్యము పుచ్చుకొనరు. (అనఁగా అన్ని మతముల వారు తమ మతాచారములను స్వేచ్ఛగా జరుపుకొన వచ్చును.) వారి కేలాటి కష్టముకలుగింపఁబడవు. దీనిఁగూర్చి గట్టివాగ్దానము చేయఁబడుచున్నది. యూదులు మాత్రము వీరితోఁబాటు ఏలియాలో నుండ నేరరు ఏలియావారు జిజ్యాపన్ను చెల్లించుచు నుండవలెను. ముసల్మానులతో యుద్ధము చేయుచున్న రోమనులను తమ పురము

నుండి ఏలియాావారు తఱుమఁగొట్టవలెను. పురమును విడిచి పోవు రోమనులు తమ పురములకు సురక్షితముగాఁ జేరునంత వఱకు వారి ప్రాణములకును వారి సొత్తులకును అభయము గలదు. వారికేలాటి ఆటంకముండ నేరదు. ఏలియాాలోవారిలో నెవరైన రోమనుల వెంటఁబోవఁదలఁచినచో వారుకూడ సురక్షితముగాఁ బోవచ్చును. రోమనులలో నెవరైన శాంతితో ఏలియాాలో నుండఁదలఁచినచో సంధిషరతులకులోఁబడియుండ వచ్చును. ఈఅభయ పత్రమునకు, దేవుఁడు, ఆతని ప్రవక్త ఆతని ఖలీఫాలు, అందఱు ముసల్మానులు జిమ్మాదారులుగా నున్నారు.''

—: బైతుల్ ముఖద్దసులో ప్రవేశించుట :—

పై విధమున సంధిజరిగిన పిమ్మట బైతుల్ ముఖద్దసు వారు తమ పురద్వారములను తెఱచిరి. హాజ్రత్ ఉమరు గారు పురమునకుఁబోవ నుద్దేశించిరి. హాజ్రత్ ఉమరుగారు మదీనానుండి యెక్కివచ్చిన గుఱ్ఱము అలసియుండెను. దాని గిట్టలు అఱిగిపోయి నడవలేకుండెను. అందులకుఁగాను మంచి తుర్కీగుఱ్ఱము వారికొఱకు తేఁబడెను. వారు దానిపై నెక్కఁగా అది ఎగురసాగెను. అదిచూచి ఉమరుగారు దానినుండిదిగి ఓ గుఱ్ఱమా! ఈగర్వము నీవెచ్చట నేర్చుకొంటివి అని పలికి దాని వదలిపెట్టి నడచిపోవుటకు సిద్ధమైరి. హాజ్రత్ ఉమరు గారు ధరించియున్న దుస్తులు చాల సాధారణమైనవి. క్రైస్తవులు ఏమి అనుకొందురో అని తలఁచి అబూఉబైదాగారు విలువైన వస్త్రములను హాజ్రత్ ఉమరుగారి యొద్దకుఁదెచ్చిరి. అదిచూచి హాజ్రత్ ఉమరుగారు ఈవిలువైన దుస్తులు నాకు

వలదు. దీనివలన గౌరవమేమియులేదు. దేవుఁడు ఇస్లాము మూలమున మాకొసంగిన గౌరవమే గౌరవము. ఇదియే మాకు చాలును అని పలికి ఆదుస్తులను ధరింపక వాపసుచేసి వేసిరి. అట్లు సాధారణమైన స్థితిలోనే బైతుల్ముఖద్దసులో రాత్రివేళ ప్రవేశించిరి. మొట్టమొదట మస్జిదెఅఖ్సాకు పోయిరి. అచ్చట మెహ్రాబెదావూదు (హజ్రత్ దావూదు ప్రవక్త ప్రార్థన చేయుచుండిన) గూడులో రెండు రకాతులు నమాజు సలిపిరి. ఆపిదప ఉదయము అచ్చటనే నమాజెఫజర్ ముసల్మానులతోఁబాటు నమాజు సలిపిరి. క్రైస్తవుల ముఖ్యమైన ఖమామా గుడికిపోయిరి. అచ్చట తిరిగి చూచుచుండు సమయములో నమాజువేళ ఆయెను. వారివెంటనున్న పెద్ద పాదరీ మీరిచ్చటనే నమాజు చేసికొనుఁడు అని హజ్రత్ ఉమరుగారితో విన్నవింపఁగా దానిని సమ్మతింపక గుడికి బయట మెట్లపై ఒంటరిగా నమాజు చేసికొని "నేను మీగుడి లోపల నమాజు చేసినచో నాపిమ్మట ముసల్మానులు "మాఖలీఫా ఇచ్చట నమాజు సలిపెను. ఇది మా హక్కు అని పలికి మీనుండి గుడిని లాగుకొని స్వాధీనపఱచుకొందురు." అని పలికిరి. ఆపిదప "ముసల్మానులు గుడిమెట్లపైన గూడ నమాజు చేయకూడదు. ఇచ్చట అజానుకూడ నియ్యఁగూడదు" అని వ్రాసి గుడిపాద్రికి నొసంగిరి.

—: ఉమరుగారి మసీదు నిర్మాణము :—

హజ్రత్ ఉమరుగారు పాదరీతో "నేను ఒక మసీదు నిర్మింపను ద్దేశించుచున్నాను, ఎచ్చట కట్టవలెను" అని అడుగఁగా పాద్రి సఖ్రారాతిపై నిర్మింపుఁడు ఇచ్చట దేవుఁడు,

యాఖూబు ప్రవక్తతో సంభాషించి యున్నాఁడు అని విన్న వించెను. సఖ్రారాయి ఉండుచోటు యూదులకు చాలపుణ్యా స్థలము. క్రైస్తవులకును యూదులకును చాల విరోధము. ఈ ద్వేషముతోనే ఆస్థలమును కసవుదిబ్బగాఁ జేసియుండిరి. హజ్రత్ ఉమరుగారు అచోటిని శుద్ధిచేయుటకు ఆజ్ఞాపించిరి. తాముకూడ తమ అంగీకొంగులో మట్టినింపి పాఱవేయసాగిరి. కాబెఆహ్బరు ఇది చూచి అల్లాహుఅక్బరు అని పలుకఁగా ముసల్మానులందఱును అల్లాహు అక్బరు అని గట్టిగా పలికిరి. హజ్రత్ ఉమరు "ఇట్లుచేయుటకు కారణమేమని" కాబుతో ప్రశ్నింపఁగా కాబు "ఓఅమీరల్ మూమినీన్ ఇపుడు మీరు చేయుచున్న పనినిగూర్చి ఇస్రాయీలీయు ప్రవక్త 5 వందల సంవత్సరముల పూర్వము ప్రకటించి యున్నాఁడు. ఈవిష యము మామతగ్రంథములలోఁ గలదు"అని పలికెను.

సఖ్రా చోటును శుద్ధిచేసిన పిమ్మట హజ్రత్ ఉమరు గారు "ఓకాబు! మసీదు ఖిబ్లా ఏవైపున నియమింప వలెను" అని కాబుతో ప్రశ్నింపఁగా సఖ్రావైపున నియమింపుఁడు అని విన్నవించెను. అదివిని "ఓకాబు! ఇంకను మీయందు యూద త్వమున్నదిగదా! మీరు సఖ్రా యొద్దకు వచ్చినపుడు మీరు మీ చెప్పులను విడుచుట నేను చూచితిని. అపుడే మీయం దున్న యూదత్వమును గమనించితిని"అనిపలుకఁగా"ఓఅమీ రల్ మూమినీన్! ఈపుణ్యాస్థలమును నాపాదములు తాకిన శుభ ములభించును అని అట్లు చేసితిని కాని సఖ్రాను గౌరవించు టకుఁగాదు" అని పలికెను. (ముందు కాబు యూదుల గొప్ప విద్వాంసుఁడు. ఆయన యూదమతమును వదలి ఇస్లాము

మతము స్వీకరించి యుండెను.) ఆపిదప కాబావసీదుండు దిక్కున మసీదు ఖిబ్లా నియమింపవలెనని సెలవిచ్చిరి. ఆమసీదు మస్జిదెఉమరు అను పేరుతో ప్రఖ్యాతి గాంచెను. రమలాపురము వారుకూడ బైతుల్‌ముఖద్దసుయొక్క సంధి షరతులపై సంధి గావించుకొనిరి. అట్లు రమలాపురముకూడ ముసల్మానులకు వసమాయెను. హజ్రత్ ఉమరుగారు ఫాలస్తీనా పరగణాను రెండు భాగములుగాఁజేసిరి. ఒక భాగమునకు బైతుల్‌ముఖద్దసును ముఖ్యపట్టణముగాఁజేసి అల్ఖమాను అధికారిగా నియమించిరి. మఱొక భాగమునకు రమలాపురమును ముఖ్యపట్టణముగాఁజేసి అల్ఖమాబిన్‌హాకీమును అధికారిగా నియమించిరి. అన్నివిధముల యేర్పాటులు గావించి హజ్రత్ ఉమరుగారు మదీనాపురమునకు తిరిగి పయనమైరి. ఇది హి॥శ॥ 16 వ యేఁట సంభవించెను.

—: హిమ్మసుపై రోమనులు దాడిసలుపుట :—

ముసల్మానుల గొప్ప విజయముల వలన రోమనులు ధైర్యము వీడిరి. హిర్ఖలు రాజుయొక్క గొప్ప రోమను ప్రభుత్వములోని తూర్పుభాగము తెగిపోయెను. అదిముసల్మానుల వసమాయెను. హిర్ఖలురాజు, ఫాలస్తీనా, సిరియాదేశముల గూర్చి ఆసవదలెను. ఇట్టి స్థితిలో జజీరా(ఫ్రురాతు దజ్లానదుల మధ్య భూభాగము) వారు "మీరు ముసల్మానులతో అంతిమ యుద్ధము చేయుటకు ధైర్యము పూని దానికి సిద్ధమైనచో మేము మీకు గొప్ప సహాయము చేయుదుము "అని హిర్ఖలు రాజునకు కబురుపంపిరి. జజీరావారి సందేశము వినినంతనే రాజుయొక్క హృదయములో ఆసయును ధైర్యమును గలిగి ముస

ల్మానులతో యుద్ధము చేయుటకు సిద్ధమై చెల్లాచెదరై యున్న రోమనుల బలమును సేకరింపసాగెను. హిర్ఖలు గొప్పసైన్యముతో సముద్రమార్గమున హిమ్మనుపై దండెత్తి వెడలెను. జజీరావారుకూడ ముప్పదివేలసైనికులతో అతని సహాయమునకు వచ్చిరి.

హజ్రత్ ఉబైదాగారు స్వయముగా హిమ్మనులో నుండిరి. వారు, ఖన్సరీనునుండి ఖాలిద్‌గారిని రప్పించి యుద్ధమును గూర్చి సలహా దీసికొనిరి. మేము పురమునకు బయట మైదానములోనుండి శత్రువును మార్కొనవలెనని ఖాలిద్ గారు సలహానిచ్చిరి. కాని యితర సర్దారులు ఖాలిద్‌గారి యభిప్రాయమును సమ్మతింపక "శత్రువుల సైన్యము చాల గలదు. మాయొద్దకు ఖలీఫానుండి సహాయము వచ్చునంత వఱకు మేము పురములోనేయుండి శత్రువును మార్కొనవలెనని సలహాచెప్పిరి. అబూఉబైదాగారు ఈసలహాను సమ్మతించి పురద్వారములను మూసి వేసిలోపల నేనిలిచిరి. రోమనుల సైన్యము పురమును ముట్టడించెను. సిరియాదేశములో నచ్చటచ్చట ముసల్మానుల సైన్యముండెను. ఆయాపట్టణముల నుండి సైన్యములను రప్పించుట ఉచితము కాదు అని తలఁచి అబూఉబైదాగారు విషయమంతయు హజ్రత్ ఉమరుగారికిఁ దెలిపి సైన్యసహాయము కోరిరి. అందులకు హజ్రత్ ఉమరుగారు కూఫాలోనుండిన ఖాఖాగారిని అబూఉబైదాగారి సహాయమునకు సైన్యమిచ్చిపంపవలెను. అయాజును సైన్యముతో జజీరావాని మందలించుటకై జజీరాకు పంపవలెను అని సాదుగారికి ఉత్తరువు పంపిరి. ఆపిదప హజ్రత్ ఉమరుగారు స్వయ

ముగా కొంత సైన్యమునుదీసికొని, తమకుబదులుగ హజ్రత్ అలీగారిని మదీనాలో నియమించి హిమ్మ్సునకు పయనమైరి. ముసల్మానుల సైన్యము జజీరాలో ప్రవేశించెను అను విషయము జజీరావారికిఁ దెలియఁగానే తమ దేశమును రక్షించుకొనుటకై రోమనురాజును వదలి జజీరాకు పాఱిపోయిరి. స్వయముగ హజ్రత్ ఉమరుగారు సైన్యము దీసికొని ముసల్మానుల సహాయమునకు వచ్చుచున్నారు అను విషయము రోమనులకుఁ దెలియఁగానే రోమనులు ధైర్యము వీడసాగిరి. ఆపిదప అబూఉబైదాగారు ముసల్మానులను యుద్ధమునకై పురికొల్పుచు గొప్ప యుపన్యాసమునొసంగి పురమునకు బయట వెడలి మైదానములో శత్రువులను మార్కొనవలెనని సెలవిచ్చిరి. వారి యుత్తరువును అనుసరించి ముసల్మానులు పురమునకు బయటవచ్చి మహా ధైర్యముతో రోమనులపైఁబడి యుద్ధము సలుపసాగిరి. ముసల్మానుల దెబ్బకు రోమనులుతాళలేక బిత్తరపోయి పరుగెత్తసాగిరి. యుద్ధరంగములో నిలువలేక పోయిరి. ఖాఖాగారిసైన్యము ముసల్మానులు జయముపొందిన మూడవ దినముహిమ్మ్సునకు వచ్చిచేరెను. హజ్రత్ ఉమరుగారు సరాఅనుచోట చేరఁగానే ముసల్మానులు జయముపొందిరి అను సంతోషవార్త వారికిఁ దెలియనాయెను. ఇది హి॥ శ॥ 17 వయేఁట సంభవించెను.

—: జజీరా విజయము :—

జజీరావారు ముసల్మానులకు విరోధులై రోమనులకు తోడుపడి హిమ్మ్సుపై దాడివెడలిరి. అందులకు జజీరాపై దండెత్తుటకై అయాజుగారు ఖలీఫాచే నియమింపఁబడిరి.

అయూజుగారు జజీరాపై దాడి సలిపి అందలి పురములన్నిటిని జయించిరి. వారు పడమటి దిక్కున బాదియెషామ్ వఱకును తూర్పుదిక్కున ఆర్మీనియా కుర్దిస్తాను వఱకును జయించిరి. ఆ పిమ్మట దరబును జయించుచు తల్బీసుచేరిరి. అచ్చట నుండి ఖలాతు, ఐనెహామిజావఱకు పోయిచేరిరి.

జజీరాజయింపఁబడిన పిమ్మట అచ్చటి అరబ్బు క్రైస్తవుల రాయబారులు హజ్రత్ ఉమరుగారి సన్నిధికిపోయి "మేము జిజ్యాపన్ను చెల్లింపలేము. ఇది మాకుచాల అగౌరవము. దీనిని మేముసహింపలేము. మీరు జిజ్యా పన్నును గూర్చి మమ్మునిర్బంధించినచో మేము దేశము విడిచిగ్రోమనుల దేశముకకు పోవుదుము" అని విన్నవించిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు "మీరు రోమనుల దేశమునకుఁ బోయినచో రోమను రాజునకు వ్రాసిమిమ్ము పట్టిరప్పింతును" అని పలికిరి. అపుడు హజ్రత్ ఆలీగారు సిఫారసుచేసి జిజ్యాపన్నుకంటె రెండింతలు పైకము జజీరావారు చెల్లింతురు. ఇది జిజ్యాపన్నుగా భావింపఁగూడదు అని తీర్మానము చేయునట్లుచేసిరి. దీనిని జజీరావారు సమ్మతించిరి. ఇది హి॥ శ॥ 17వ యేఁట సంభవించెను.

—: అమ్వాసులో ప్లేగు :—

హిజ్రి॥ శ॥ 18వ యేఁట సిరియా, ఇరాఖు, ఈజిప్టు దేశములలో తీవ్రముగా ప్లేగు వ్యాధి వ్యాపించెను. ఈ విషయము హజ్రత్ ఉమరుగారికిఁదెలిసి దానిఁ గూర్చి యేర్పాట్లు చేయుటకై స్వయముగా సిరియా దేశమునకు పయనమైరి. మార్గమధ్యమున సరాఅనుచోటు చేరఁగా అచ్చట సేనాధిపతులం వచ్చి ఖలీఫాకుస్వాగత మొసంగి వ్యాధిచాలబలముగా నున్నది.

మీరు అచ్చటికి వచ్చుట ఉచితముకాదు అని విన్నవించిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు మహాజిర్లను అన్సారీలను సమావేశపఱచి సలహాఅడిగిరి. అందు భేదాభిప్రాయము గలిగెను. తుదకు సరానుండియే మదీనాకుతిరిగి పోవుట ఉచితమని తీర్మానించుకొనిరి. అపుడు అబూఉబైదాగారు ఏమిదేవుని నియామకము (తఖ్దీరు) నుండి పాఱిపోవుదురా అని హజ్రత్ ఉమరుగారితో పలుకఁగా "అవును దేవుని నియామకమునుండి అతని నియామకము వైపునకు పాఱిపోవుచున్నాను." అని హజ్రత్ ఉమరుగారు పలికి ఏకాంతమున దీనిగూర్చి అబూఉబైదాగారితో సంభాషించిరి. రెండవదినము అబ్దుల్ రహ్మాన్ బిన్ ఔఫుగారువచ్చి "ఒక పురములో ప్లేగువ్యాధి యున్నది అని విన్నచో ఆపురములో ప్రవేశింపఁగూడదు అనియు వ్యాధి వ్యాపించియున్న పురమునుండి భయపడి అచ్చట నుండి పాఱిపోఁగూడదు అని హజ్రత్ ముహమ్మద్ రసూలువారు ఉపదేశించుచుండగా నేనువింటిని"అనిహజ్రత్ ఉమరుగారితోపలికిరి. అది వినఁగానే హజ్రత్ ఉమరుగారు తాము నిశ్చయించుకొన్నది హజ్రత్ రసూలు వారి యుపదేశము ననుసరించి యున్నది అని దేవుని కృతజ్ఞతసలిపి సరానుండియే తిరిగి మదీనాపురమునకుఁ బోయిచేరిరి.

హజ్రత్ ఉమరుగారు మదీనాపురము చేరినపిమ్మట సిరియాలో ప్లేగు వ్యాధివలన చాల ప్రాణ నష్టముగలుగుచున్నది అని తెలిసికొని అబూఉబైదాగారికి "మీతోనాకొక పనిగలదు. కావున మీరు మదీనాకువచ్చి కొన్నిదినములుండవలసినది" అని వ్రాసిరి. అపుడు అబూఉబైదాగారు "నేను

ఇతర మునల్మానులను వదలియొంటరిగారాలేను. నాతో మీకున్నపని నాకుఁదెలియును. మీరు నాక్షేమము, ప్రాణ రక్షణకోరి రప్పించుచున్నారు. నేను ఇఁక జీవించు వాఁడను కాను. మీరునన్ను క్షమింపవలెనను బదులు వ్రాసిరి. ఆపిదప అబూఉబైదాగారు జబ్బుపడిరి. వ్యాధితీవ్రముకాఁగానే మును ల్మానులను సత్కార్యములు చేయుచుండ వలెనని బోధించి తమకు బదులుగ మఆజుగారిని అధికారిగా నియమించిరి. తుదకు ఆవ్యాధితోనే వారు పరలోకము చేరిరి.

అమరుబిన్ ఆసుగారు "పూర్వము ఇస్రాయీలీయులపై వచ్చిన ఆపదవంటిదే యీ ఆపద. కావున నిచ్చటనుండి పాఱి పోవలెను అని ప్రజలతో చెప్పిరి. ఈమాట మఆజుగారు విని మునల్మానులను సమావేశపఱచి గొప్ప యుపన్యాసము గావించి ఈవ్యాధి ఆపదకాదు. ఇది దేవుని యనుగ్రహము లోనిది. పాఱిపోనక్కఱలేదు అని పలికి తమగుడారము లోనికిపోఁగా వారి కుమారుఁడు జబ్బుపడి యుండెను. అది చూచి "ఓకుమారా! ఇది దేవునియొద్దనుండి వచ్చిన సత్యము. నీవు ఏలాటి సందేహము పడకుము అని పలుగా ఆతఁడు దేవుఁడు కోరినచో నేను సహించువారిలో నుండుటను మీరు చూచెదరు అని పలికెను. ఆపిదప కొంతసేపటికి వారి కుమా రుఁడు పరలోకము చేరెను. వారి కుమారుఁడు చనిపోయిన కొంతసేపటికి మఆజుగారుకూడ జబ్బుపడిరి. కొంత కాలము తరువాత వారుకూడ మహాశాంతితో ప్రాణము విడిచి పర లోకము చేరిరి.

మఆజుగారు జబ్బుపడినపుడు తమకు బదులుగ అమర్ బిన్ ఆసుగారిని అధికారిగా నియమించి యుండిరి. అమరుగారు సైన్యమును కొండలపైకి దీసికొనిపోయి అచ్చటచ్చట మకాము చేయించిరి. ఆపిదప ఆవ్యాధినుండి ముసల్మానులకు రక్షణలభించెను. అమరుగారు గావించిన యత్నమును హజ్రత్ ఉమరుగారు సమ్మతించిరి. ఈవ్యాధి వలన సిరియా దేశములో ముసల్మానుల బలమునకు చాల నష్టము కలిగెను. సగము లోకమును జయింపఁగలనట్టి ఇరువదైదు వేల ముసల్మానులు ఆవ్యాధిలో పరలోకముచేరి దేవుని కృపకు పాత్రులైరి. ముసల్మానులు జయించిన దేశములో వారు తమ రైతుల యెడ న్యాయముచేసి వారి హృదయములను జయింపకయున్నచో వ్యాధివలన ముసల్మానులకుఁ గలిగిన కష్టములో రోమనులు ముసల్మానులపై తిరుగుఁబాటు సలిపి గొప్ప లాభము పొందియుందురు. కాని అట్లు సంభవించలేదు.

—: హజ్రత్ ఉమరుగారి సిరియా ప్రయాణము :—

వ్యాధిబలముతగ్గి శాంతము గలిగిన తరువాత వ్యాధిలో మృతినొందినవారి యాస్తిని వారి వారసులకు పంచిపెట్టుటకుఁగాను సిరియాలో మంచి యేర్పాటులు చేయుటకుఁగాను హజ్రత్ ఉమరుగారు హజ్రత్ అలీగారిని తమకు బదులుగ మదీనాలో అధికారిగా నియమించి సిరియా దేశమునకు పయనమైరి. హజ్రత్ ఉమరుగారు ఏలాపురమును సమీపించినపుడు తమ గుఱ్ఱమును తమ బానిసకునిచ్చి యాతని యొంటెపై నెక్కిపోయిరి. ప్రజలు "ఖలీఫాగారెక్కడ నున్నారు"అని ప్రశ్నింతురు. అప్పుడు హజ్రత్ ఉమరుగారు "ఖలీఫా మీామె

దుట నున్నాఁడు" అని పలుకుచు సాధారణ స్థితిలోనే ఏలా పురములో ప్రవేశించిరి.

హజ్రత్ ఉమరుగారు సిరియాచేరి మొట్టమొదట, మృతినొందినవారి యాస్తిని వారివారసులకు పంచిపెట్టిరి. దేశములో తిరిగి అచ్చటచ్చట తగునేర్పాటులు గావించి లోపములనుసవరించి సిరియా యొక్క సరిహద్దులపై సైన్యము నియమించి మఆవియాబిన్ అబీసుఫ్యానుగారిని దమస్కుపై అధికారిగానియమించిరి. ఇచ్చటనే ఒకదినము నమాజునకుఁగాను హజ్రత్ బిలాలుగారు అజానుపలుకునట్లు సెలవునొసంగవలెనునని హజ్రత్ ఉమరుగారితో ముసల్మానులు విన్నవింపఁగా హజ్రత్ బిలాలుగారు అజాన్ పలుకునట్లుగ హజ్రత్ ఉమరుగారు నియమించిరి. హజ్రత్ బిలాలుగారు అజానుపలుకఁగానే ముసల్మానులందఱు హజ్రత్ ముహమ్మద్ రసూలువారి కాలమునుజ్ఞప్తికిఁదెచ్చుకొని గడ్డములు తడయునట్లుగ నేడ్చిరి. (హజ్రత్ బిలాలుగారు హజ్రత్ పైగంబరుల వారి కాలములో అయిదుపూఁటలునమాజునకుఁగాను అజానుపలుకుచుండిరి. హజ్రత్ రసూలువారి పిదపదుఃఖముతో ఆపదవిని మానుకొని యుండిరి).

—: గొప్ప కఱవు :—

అరేబియా దేశములో గొప్పకఱవు సంభవించెను. పూర్తి తొమ్మిదినెలలవఱకు వర్షముకురియలేదు. దానితోఁబాటు విషవాయువులు వీఁచిపైర్లను నాశముచేసెను. ధాన్యములేక జనులు అల్లాడసాగిరి. అట్టి కష్టకాలములో హజ్రత్ ఉమరుగారు గొప్పశ్రద్ధవహించి అతిశీఘ్రముగా ఈజిప్టు సిరి

యా దేశములనుండి వలయుధాన్యము రప్పించి జనులకుపంచి పెట్టుటకు గొప్ప యేర్పాటులు చేసిరి. తామునకఱవు పోవునంత వఱకు నెయ్యిగాని తేనెగాని భుజింపనని శపథముగావించు కొనిరి. వారు ఆలవినూనెతో రొట్టెతినుచుండిరి. తుదకు వారి కడుపులో బాధకూడకలిగెను. ఒకదినము సేవకుఁడు హజ్రత్ ఉమరుగారి అనారోగ్యమును చూచి నెయ్యి తేనె బజారునుండి కొని తెచ్చి "ఓ అమీరల్ మూమినీన్! మీరు మీశపథమును వదలి దానికి పరిహారమిచ్చి దీనిని భుజింపుఁడు. మీ ఆరోగ్యము చెడి పోవుచున్నది" అని విన్నవింపగా అట్లుకానేరదు. స్వయముగా నేను కష్టపడనిచో నితరులకష్టములనెట్లు గుర్తింపఁ గలను అని హజ్రత్ ఉమరుగారుపలికి నెయ్యిని తేనెను బీదలకు దానముచేయుము అని తమ సేవకునికి సెలవిచ్చిరి. రైతులకష్టములను గుర్తించుటకుఁగాను ప్రభువుకూడ వారితోఁ బాటు కష్టము అనుభవించుటయే రాజనీతిగదా! వర్షములేక దేశము మాడిపోవుచుండెను. హజ్రత్ ఉమరుగారు మదీనా పురములో ముసల్మానులతోఁ బాటు నమాజుసలిపి భయభక్తులతో దేవుని ప్రార్థించిరి. దేవుఁడు కరుణించి వర్షము పంపెను. దేశమంతటను మంచివానలుకురిసి కఱవుతొలఁగెను. అపుడు హజ్రత్ ఉమరుగారు దేవునికి కృతజ్ఞతసలిపి శాంతమువహించిరి

## —: ఈజిప్టు విజయము :—

అమర్ బిన్ ఆసుగారు ఈజిప్టును జయింపవలెనని చాల కోరుచుండిరి. ఎందుకనవారు ఇస్లామునకు పూర్వము ఈజిప్టు దేశమునకుపోయి అచ్చట వైభవములను ధనధాన్యములను పైరుపంటలను చూచియుండిరి. సిరియా (అమ్వాను)లో ప్లేగు

వ్యాధి తగ్గిన పిదపఅచ్చట ఏర్పాటుచేయుటకుఁగాను హజ్రత్ ఉమరుగారు పోయియుండిరి. అపుడు అమరుగారు హజ్రత్ ఉమరుగారితో ఈజిప్టుపై దాడివెడలుటకు సెలవడిగిరి. ఆకాల మందు ముసల్మానుల సైన్యములు సిరియా, జాజీరా, పారసు దేశములోనుండెను. మఱియు ప్లేగు వ్యాధివలన ముసల్మా నుల బలమునకు చాలనష్టము గలిగియుండెను. అందులకు హజ్రత్ ఉమరుగారు ఈజిప్టుపైదాడివెడలుటకు సెలవునొసంగ లేదు. అమరుగారుదాని గూర్చిచాల పట్టుపట్టిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు అమరుగారికి సెలవిచ్చుచు ఒక వేళనేను దానిఁ గూర్చి రద్దుచేయవచ్చును. అట్లునాలేఖ మీకు వచ్చి నచో తిరిగిరావలెను అని పలికి అమరుగారిని నాల్గువేలమంది సైనికులతో ఈజిప్టు (మిసరు) పైదండెత్తుటకై సాగనంపిరి.

అమరుగారు ఈజిప్టుసరిహద్దులలో చేరకమును పే హజ్రత్ ఉమరుగారి లేఖవచ్చెను. కాని అమరుగారు దానిని అరీషు అనుచోటికిపోయి రాయబారినుండిలేఖతీసికొని చూడఁ గా"మీరు ఈజిప్టు సరిహద్దులో చేరకయున్నచో తిరిగి రావల సినది. సరిహద్దులో చేరియుంటిరేని ఈజిప్టుపై దండెత్తి పోవల సినది. నేను మీకు సైన్యసహాయము పంపుదును అని యుం డెను. అరీషుపురము ఈజిప్టు దేశములో చేరినది. కావున ఖలీఫాగారి సెలవు ననుసరించి అమరుగారు తమ సైన్యమును ఈజిప్టుపై దీసికొని వెడలిరి.

ఈజిప్టు రోమను ప్రభుత్వమునకు లోఁబడిన దేశము. అచ్చటి అధికారియగు మఖోఖసు రోమను రాజునకు కప్పము చెల్లించుచుండెను. ఈజిప్టులో రోమనుల సౌకర్యములకుఁ

గాను రోమనురాజు ఒక అధికారిని అచ్చట నియమించి యుం డెను. రోమనుఅధికారి నాయకత్వమున ఖసరేషమాలోను అలగ్జాండ్రియాలోను రోమనుల గొప్ప సైన్యముకూడ నుండు చుండెను. ముసల్మానులు దండెత్తి వచ్చుచున్నారను వార్త రోమనులకుఁ దెలిసి ఫర్మా అనుచోట ముసల్మానులతో యుద్ధముచేసిరి. ఒక నెలవఱకు యుద్ధము జరుగుచుండెను. తుదకు రోమనులు ఓడిపోయిరి. ముసల్మానులు ఖవాసిరుపై దండెత్తి దానిని సుళువుగానే జయించిరి. దాని పిదప బల్బేసు పురమును ముట్టడించిరి. అచ్చట మఖోఖసుయొక్క కుమార్తె 'అర్మానూసా' నివసించుచుండెను. అర్మానూసా యొక్క పెండ్లి హిర్ఖలురాజుయొక్క కుమారునితోనాయెను. ఈమహా వైభవముతో ఖైసారియాపురమునకు పోవుచుండెను. బల్బేసు ముసల్మానులు జయించినపుడు అర్మానూసాకూడ పట్టువడె ను. కాని అమరుగారు, అర్మానూసాను మహాగౌరవముతో ఆమెయొక్క సామగ్రితో ఆమె తండ్రి మఖోఖసు యొద్దకు పంపివేసిరి. అమరుగారు గావించిన ఈగొప్ప యుపకారము వలన మఖోఖసు హృదయములో అమరుగారిపై గౌరవము నెలకొనెను.

—: ఖసరేషమా విజయము :—

ముసల్మానులు బల్బేసునుండి ఖసరేషమాపై దండె త్తిరి. అది నైలునది యొడ్డున నుండెను. దానికోట చాల గట్టిగా నుండెను. దానికి నెదురుగ నైలునది అవతలి యొడ్డున ఈజిప్టుయొక్క ముఖ్యపట్టణము మనఫ్ యుండెను. ఖసరేషమా లో రోమనుల సేనాధిపతియగుఅయారజు గొప్పసైన్యముతో

నుండెను. మనఫులో ఈజిప్టురాజు మఖోఖసు ఉండెను. ముసల్మానులు ఆఱు, ఏడు, మాసముల వఱకు ఖసరెపమాను ముట్టడించి యుండిరి. కాని విజయ మార్గము కానరాలేదు. తుదకు అమరుగారు హజ్రత్ ఉమరుగారికి సైన్యసహాయము కోరి వార్త పంపిరి. హజ్రత్ ఉమరుగారు పండ్రెండు వేల సైన్యమును అమరుగారికి సహాయముగా పంపిరి. అందు హజ్రత్ జుబైరుబిన్ అవాముపంటి గొప్ప యుద్ధవీరులు నుండిరి. ఆసహాయము చేరగానే ముసల్మానులకు చాల ధైర్యము వచ్చెను. అమరుగారు రాళ్లురువ్వునట్టియంత్రముతో కోటగోడలపై రాళ్ళు రువ్వసాగిరి. హజ్రత్ జుబైరుగారు గొప్ప ధైర్యము గలవారు. కావున వారు నిచ్చెన తగిలించి కోటగోడపై నెక్కి అల్లాహు అక్బరు అని గట్టిగా పలికిరి. వారి తరువాత నితర ముసల్మానులుకూడ నిచ్చెన నెక్కి కోట గోడపై నెక్కి అల్లాహు అక్బరు అని నినాదములు చేయసాగిరి. బురుజులనుండి అల్లాహుఅక్బరు అను శబ్దమువిని శత్రువులు బిత్తర పోయిరి. రోమనులు ముందుగానే కోటవెనుక నదిలో పడవలు సిద్ధముగానుంచి యుండిరి. ఆపడవలలో నెక్కి రోజాద్వీపమునకు పాఱిపోయిరి. ఖసరెపమాలో ముసల్మానులు ప్రవేశించి దానిని తము వసముగావించు కొనిరి.

ఇంక ఖసరుపమాను జయించిన పిదప ముసల్మానులు మఖోఖస్ రాజుండు ముఖ్యపట్టణమగు మనఫ్పపై దాడి వెడల వలసియుండెను. మఖోఖసురాజు రోమనులు ఓడిపోయిన విషయమువిని యుండెను. మఱి ముసల్మానులు ఆతని కుమార్తెను గౌరవించివదలిపెట్టి ఆతనికిఁగావించిన యుపకారమును

తలఁచి తన నాయకులతో సలహాచేసి అమరుగారి యొద్దకు తన రాయబారులను సంధినిగూర్చి మాటలాడుటకు పంపెను. రాయబారులు ముసల్మానుల విషయము బాగుగఁదెలిసికొన వలెనని అమరుగారు, రాయబారులను రెండుదినముల వఱకు తమ అతిథులుగా నుంచుకొని ఉచితమైన జవాబునిచ్చి వారిని సాగనంపిరి. రాయబారులు మఖోఖుసురాజు నొద్దకుఁబోఁగా రాజు తనరాయబారులతో ముసల్మానులఁగూర్చివిచారించెను. ఆరాయబార్లు ఇట్లు జవాబిచ్చిరి:- "ఓరాజా! ముసల్మానులకు బ్రతుకుకంటె చావు చాల యిష్టమైనది. వారికి గర్వముకంటె అడంకువ చాల ప్రియమైనది. వారిలో నెవ్వరును ఇహలోక తుచ్ఛభోగములను ఆసించువారు లేరు. వారందఱు నేలపై కూర్చుందురు. అందు అగౌరవము గలదు అని తలంపరు. దస్తరుఖాను లేకుండనే సాధారణముగానే భోజనము చేయు దురు. వారి సేనాధిపతికూడ వారివలె నున్నాఁడు. ఆతనికే లాటి ప్రత్యేక సౌకర్యములేదు. ఆతని యందును ఒక్క సిపాయి యందునుఏలాటి వ్యత్యాసములేదు. దాసునియందును యజమానునియందు నేలాటి భేదములేదు. ఏలాటి వ్యత్యా సములేక అందఱు సమానులుగా నున్నారు. నమాజువేళ రాఁగానే అందఱు వజూచేసి ఒక్కవంక్తిలో నిలిచి భయ భక్తులతో దేవుని ప్రార్థనలో నిమగ్నులై నమాజు సలుపుదురు." మఖోఖుసురాజు ముసల్మానుల విషయము విని తన జనులతో నిట్లు పలుకసాగెను:- "ఓజనులారా! ఇట్టి ముస ల్మానులు పర్వతములను ఢీకొన్నచో వానినికూడ వాని స్థా ములనుండి తొలఁగింపఁగలరు. కావున ముసల్మానులు మా పై

దండెత్తి రాకమునుపే మేము వారితో సంధి గావించుకొనుట మాకు మేలు." అపిమ్మట మఖోఖసురాజు స్వయముగ అమరు గారిని దర్శించుటకుఁగాను మనవి చేసికొనెను. వారిద్దఱు కలిసికొనిరి. ముసల్మానులకును ఈజిప్టువారికిని ఈక్రింది షరతులపై సంధికుదిరెను:-

ప్రతిపురుషుఁడును ప్రతిసంవత్సరము రెండుదీనారములు ముసల్మానులకు నొసంగవలెను. స్త్రీలును బిడ్డలును వృద్ధులును ఇయ్యనక్కఱలేదు. యుద్ధకాలములో ముసల్మానులు ఏమార్గమున పోవుదురో అచ్చటి ఖిబ్తీలు (ఈజిప్టు దేశస్థులు) ముసల్మానులకు సహాయముచేసి సామగ్రి సమకూర్చవలెను. ఖిబ్తీల ధనముతోఁగాని వారి భూమితోగాని ముసల్మానుల కేలాటి పనియుండదు. ఈజిప్టులోనున్న రోమనులు కోరినచో ఖిబ్తీలు గావించుకొన్న సంధిషరతులను అనుసరించి ఈజిప్టులోనుండ వచ్చును లేదా తమ రోమను దేశమునకు పోవచ్చును." మఖోఖసురాజులోఁబడి, ముసల్మానులతోఁ గావించుకొన్న సంధి విషయము రోమనురాజునకుఁ దెలియఁగానే యాతఁడు కోపముతో మండిపడి "నీవు తత్క్షణమే ముసల్మానులతోఁ జేసికొని యున్న సంధిని త్రెంపి ఈజిప్టులోనున్న రోమను అధికారులతోఁబాటు ముసల్మానులతో యుద్ధము చేయవలెను" అని మఖోఖసునకు వ్రాసెను. కాని మఖోఖసు రోమనురాజు యొక్క యుత్తరువును తిరస్కరించి యుద్ధము చేయలేదు. దీనికి కారణమేమనగా ఈజిప్టులోని ఖిబ్తీలు, తూర్పుచర్చి వారలు గావించుచున్న అన్యాయములను అసహ్యించుచుండిరి. మఱివారు (ఖిబ్తీలు) రోమనురాజుయొక్క ఆధిపత్యమునుగూర్చి

చాల రోఁతపడి యుండిరి. ఖిబ్తీల విషయమున ముసల్మానులు వహించిన న్యాయపద్ధతిని ఖిబ్తీలు గమనించియుండిరి. ముసల్మానులు తమ రైతుల మతమునుగూర్చిగాని వారి యాచారమునుగూర్చిగాని యేలాటిఆటంకములు చేయకుండిరి. రైతులకు మతనాగరీక విషయములలో పూర్తి స్వేచ్ఛ యుండెను. మఱియు ముసల్మానుల యుద్ధవీరులు, సిరియా ఈరాను దేశములలో రోమనురాజును ఈరానురాజును ఓడించియున్న విషయము ఖిబ్తీలు తెలిసికొని యుండిరి. ఇఁక ముసల్మానుల దెబ్బకు ఈజిప్టులోనున్న రోమనుల బలము ఎట్లు తాళగలదు అని తలఁచిరి. కావున సహజముగ ఖిబ్తీలు రోమనురాజు యొక్క బానిసత్వమునుండి తప్పించుకొని ముసల్మానులతో సంధిగావించుకొనవలెనను తీర్మానము వారు చేయవలసి వచ్చెను.

## —: ఇతర విజయములు :—

మఖోఖసుతో సంధి జరిగిన పిమ్మట అమరుగారు, మసఫునకు చుట్టుపట్లనున్న పురములను జయించుటకుఁగాను తమ సైన్యములను నియమించిరి. అచ్చటచ్చట రోమను సైనికులు ముసల్మానులను మార్కొని యుద్ధము చేసిరి. ఖిబ్తీలు గావించియున్న సంధిషరతులను అనుసరించి వారు యుద్ధ సమయములలో ముసల్మానులకు అన్ని విధములతోడుపడిరి. కావున ముసల్మానులు రోమనులను ఓడించి ఐనెమస్సు, ఫయూము, ఉష్మూనీన్, అఖీమ్, బష్రూదాత్, ఖురాసయాద్, తనీసు, దమ్యాత్, తూనా, దమీరా, బూసీర్ మొదలగు స్థలములను జయించి తమ స్వాధీన పఱచుకొనిరి.

—: అలెగ్జాండ్రియా విజయము :—

అలెగ్జాండ్రియాలో రోమనుల సైన్యములుండెను. అది సముద్రతీరమున నుండెను. కావున రోమనులకు సులభముగా సముద్రమార్గమున సైన్యసహాయము వచ్చుటకు వీలుండెను. ఈజిప్టులో ముసల్మానుల విజయవార్త రోమనురాజునకుఁ దెలియఁగానే గొప్ప సైన్యము సముద్రమార్గమున అలెగ్జాండ్రియాకు పంపెను. అమరుగారుకూడ తమ సైన్యము దీసికొని అలెగ్జాండ్రియాపై దాడివెడలి దానిని ముట్టడించిరి. అలెగ్జాండ్రియాలో రోమనులకు గట్టికోటలుండెను. అందు రోమనులు స్థిరముగా నిల్చియుండిరి. మఱి రోమనులకు సముద్రమార్గమున ఆహారము మొదలగు సామగ్రి అందుచుండెను. కావున చాల కాలమువఱకు ముసల్మానులు దానిని జయింపలేకుండిరి.

హజ్రత్ ఉమరుగారు అలెంగ్జాండ్రియా విజయమును గూర్చి యెదురు చూచుచుండిరి. దానిఁగూర్చి చాలకాలము వఱకు ఏలాటి వార్తకూడ రాలేదు. అపుడు హజ్రత్ ఉమరు గారు "బహుశః ముసల్మానులు ఖురానెషరీఫ్ ధర్మములను హజ్రత్ రసూలు వారి యాచారములను అనుసరించుటలో ఎక్కువ శ్రద్ధవహించలేదు కాఁబోలు. లేనిచో అసత్యము, సత్యమునకు యెదుట ఇన్నాళ్ళు నిలువఁగలదా!" అని పలికి విజయము గావించుటలో ఆలస్యమైనందులకు అమరుగారిని మందలించుచునిట్లు లేఖవ్రాసిరి:- "ముసల్మానులు తమగుణములను ఆచారములను ఖురానెషరీఫ్ యొక్కయు హజ్రత్ రసూలువారి యొక్కయు నుపదేశములను అనుసరించి చేయు

టలేదు కాఁబోలు! అందులకు అందఱు ముసల్మానులను సమావేశపఱచి వారిపౌరపాటులనుగూర్చి మందలింప వలెను. మఱి యుద్ధమును గూర్చియు కష్టములందు సహనము వహింపవలెనను విషయమును గూర్చియు చిత్తశుద్ధిని గూర్చియు ముసల్మానులకు ప్రోత్సాహ పఱుపవలెను. జుబైరు, మిఖ్దాద్, ముసల్మా, ఉబాదా అను వారిని సైన్యమునకు ముందుగా నుంచి శత్రువులతో నొక తీర్మాన యుద్ధము చేయవలెను." హజ్రత్ ఉమరుగారి లేఖ అమరుగారికిఁ జేరఁగానే అమరుగారు ముసల్మానులను సమావేశపఱచి అందఱకు ఆలేఖను చదివి వినిపించిరి. ఆపిదప ముసల్మానులు మహాధైర్యసాహసములతో రోమనులతో యుద్ధము సలిపిరి. తుదకు దేవుని యనుగ్రహము వలన అలెగ్జాండ్రియా ముసల్మానులు జయించిరి. ఆపిదప అమరుగారు అలెగ్జాండ్రియా రక్షణార్థము సైన్యమును నియమించి తాము ఖుస్తెంతునకు తిరిగి వచ్చిరి.

—: మదీనాకు విజయవార్త పంపుట :—

అమరుగారు, అలెగ్జాండ్రియా విజయమును గూర్చి సంతోషవార్త హజ్రత్ ఉమరుగారికిఁ దెలుపుటకుఁగాను ముఆవియాబిన్ ఖదీజును మదీనాపురమునకుపంపిరి. ముఆవియాగారు ఒంటె పైనెక్కి దానిని త్వరత్వరగాఁ దీసికొని పోయి మిట్టమధ్యాహ్నము మదీనాపురములో ప్రవేశించిరి. "ఇపుడు మధ్యాహ్నము ఎండతీవ్రముగానున్నది. హజ్రత్ ఉమరుగారు విశ్రాంతిగైకొనుచుందు రేమో! వారికి కష్టమిచ్చుట ఉచితము కాదు" అని తలఁచి ముఆవియాగారు మసీదులో కూర్చుండిరి.

అపుడు హజ్రత్ ఉమరుగారి బానిస అచ్చటికి వచ్చుట తటస్థించెను. ముఆవియాగారు విజయవార్తగైకొని వచ్చియున్నారు అని ఆమెకుఁ దెలియనాయెను. ఆమె పరుగెత్తిపోయి ఆవిజయవార్త హజ్రత్ ఉమరుగారికిఁ దెలిపెను. తత్క్షణమే హజ్రత్ ఉమరుగారు ముఆవియాగారిని రప్పించి అలెగ్జాండ్రియావిజయమును గూర్చి వివరములు దెలిసికొని ఆనందముపొంది దేవునికి కృతజ్ఞత సలుపుచు సజ్దా (సాష్టాంగము) చేసిరి. హజ్రత్ ఉమరుగారు యథాప్రకారముగా మదీనావారినందఱిని మసీదులో సమావేశపఱచిరి. ముఆవియాగారు అలెగ్జాండ్రియా విజయమును గూర్చి సర్వవిషయములు ముసల్మానులకుఁ దెలిపిరి. ఆపిదప హజ్రత్ ఉమరుగారు, ముఆవియాగారిని తమ వెంటఁదీసికొని యింటికివచ్చి వారిని ఆతిథ్యముసలిపిరి. తినుటకు, రొట్టె ఆలివినూనె, తెచ్చిబానిసవడ్డించెను. రొట్టెతినుచు హజ్రత్ ఉమరుగారు "ఓముఆవియా! మీరెందులకు మసీదులోనికి పోయికూర్చుండియుంటిరి. అపుడే నాయొద్దకు నెందులకు రాకపోయితిరి" అని అడుగఁగా ముఆవియాగారు "ఓఅమీరల్ మూమినీన్! మిట్టమధ్యాహ్నమున మీరు విశ్రాంతి పుచ్చుకొనుచుందురేమో! పోయిలేపుట ఉచితముకాదు" అని తలఁచి మసీదులో కూర్చుంటిని అని పలికిరి. అపుడు "మీరీలాగు తలఁచుట చాలవ్యసనకరము. నేను పగటిపూఁట నిద్రపోయితినేని ఈఖిలాఫత్ యొక్కభారము నెవరువహింతురు?" అని సెలవిచ్చిరి.

—: ఫుస్తాతు పురనిర్మాణము :—

అమరుగారు అలెగ్జాండ్రియాను జయించిన పిమ్మట,

ఖసరెషమాకువచ్చి చేరిరి. అపుడు వారు హజ్రత్ ఉమరుగారి సలహాను అనుసరించి మనఫునకు ఎట్టయెదుట నైలునది యొడ్డును తూర్పు దిక్కున క్రొత్తగా నొకపురమును నిర్మించుటకు పునాదులు వేసిరి. దానికే ఫుస్తాతు అను పేరు బెట్టఁబడెను. ప్రతికుటంబము వారికి నొక్కొక్క వీధి నిర్మింపఁబడెను. హజ్రత్ ఉమరుగారి సెలవుననుసరించి పురమునకు మధ్య నొక జుమామసీదు నిర్మింపఁబడెను. అది ఏఁబదిగజముల పొడవును వెడల్పును గలిగియుండెను. దానికి మూఁడుద్వారములుంచఁబడెను. అది జామియే అమరు అను పేరుతో ప్రసిద్ధమాయెను. ఇపుడు కూడ రమజానునెలలోని ఆకరు శుక్రివారపు నాటి జుమానమాజు దానియందే చేయఁబడుచున్నది. ఫుస్తాతు పురము ఈజిప్టులో ముసల్మానుల ప్రిభుత్వమునకు ముఖ్య పట్టణముగా నియమింపఁబడెను. ఆపురముచాల వృద్ధిపొందెను.

—: నైలునదికి కన్యకాబలిదానము :—

అమరుగారు ఈజిప్టును జయించినపుడు అచ్చట పురాతనకాలమునుండి యొక దురాచారముండెను. ప్రితి సంవత్సరము బూనా (ఖిబ్తీల) నెల 12వ తేదీన ఒక కన్యను పెండ్లికూతురువలె బాగుగనలంకరించి నైలునదిలో పడవేయుచుండిరి. ఆదినమును గొప్ప పండుగగానెంచి సంతోషపడుచుండిరి. ఇతరవిగ్రిహా రాధకులవలె ఖిబ్తీలు (ఈజిప్టులోని ఆదిమ నివాసులు) కూడ నైలునదిని ఒక దేవతగా విశ్వసించి దానికికన్యను బలిగానియ్యనిచో అది ఆగ్రహముపొంది తమకు నీళ్లు ఒసంగదు అని తలంచుచుండిరి. ఖిబ్తీలు తమ వాడుకప్రికారము ఆబలిని గూర్చి సెలవు ఇయ్యవలెనని మనవిచేయుటకై అమరు

గారియొద్దకు వచ్చిరి. అపుడు అమరుగారు "ఇది అన్యాయము. కన్యాకాహత్యను నేను సమ్మతింపను. ఇట్టి కన్యాకాబలిని నరబలిని ఇస్లాము నిషేధించినది. ఈ మూఢాచారములు వదలవలెను. నేను సెలవియ్యను" అని పలికిరి. దైవికముగా ఆసంవత్సరము నైలునదిలో నీళ్లురాలేదు. సేద్యమునకు చాలకష్టమాయెను. సేద్యముపైననే ఆధారపడియున్న కుటుంబముల వారు తమ యూళ్లను వదలిపోవుటకు సిద్ధమైరి. అపుడు అమరుగారు ఆవిషయమంతయు హజ్రత్ ఉమరుగారికిఁ దెలియఁజేసి దీనిఁగూర్చి వారిసెలవునడిగిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు "ఓ అమరు మీరు అవలంబించిన పద్ధతి ధర్మమైనది. మీరు ఖిబ్తీలతో పలికినమాట నిజమైనది. నేను ఒక లేఖను పంపుచున్నాను. దీనిని నైలునదిలో పడవేయుఁడు" అని తెలుపుచు జాబువ్రాసిరి. హజ్రత్ ఉమరుగారు వ్రాసినలేఖ విషయమీలాగున నున్నది:-

"దేవుని సేవకుఁడును ముసల్మానుల అమీరును అగు ఉమరునుండి నైలునది పేరట. నైలునది! నీవు స్వతంత్రముగా ప్రవహించుచుంటివేని నీవు ప్రవహింపకుము. కాని నీ ప్రవాహము సర్వశక్తుఁడగు దేవుని చేతిలో నున్నయెడల మేము ఆసర్వశక్తుఁడగు దేవుఁడు నిన్ను ప్రవహించునట్లు చేయుగాఁత! అని ప్రార్థించుచున్నారము." అమరుగారు హజ్రత్ ఉమరుగారి సెలవుననుసరించి ఆలేఖను నైలునదిలో పడవేసిరి. ఆ సంవత్సరము దేవుని యనుగ్రహమువలన పూర్వముకంటె హెచ్చుగా నీటిప్రవాహమువచ్చెను. ఖిబ్తీలు మహానందము పొందిరి. కన్యకాబలిదురాచారము రద్దుఆయెను.

—: బరఖా విజయము :—

అమరుగారు ఈజిప్టు దేశమును జయించి అచ్చటవలయు నేర్పాటులుగావించి బరఖాపై దాడివెడలిరి. బరఖాపురము ఈజిప్టునకును పడమరతరాబలుసునకును మధ్యనున్నది. బనగాజీ అను ప్రసిద్ధమైన రేవుదీనిదే. బరఖాపుర నివాసులు ముసల్మానులతో సంధిగావించుకొని జిజ్యాపన్ను చెల్లించుటకు నొప్పుకొనిరి. ఆపిదప అమరుగారు పడమరతరాబలసుపై దండెత్తిరి. అచ్చటి వారు యుద్ధముచేసిరి. తుదకు ముసల్మానులకు యుద్ధములో జయములభించెను. ఆపురము కూడ ముసల్మానుల వసమాయెను. తరాబలసును జయించిన పిదప అమరుగారు "మేము తరాబలసునకు చేరినాము. తరాబలసునకును ఆఫ్రికా (తూనుసు) కును మధ్యతొమ్మిది దినముల ప్రయాణమున్నది. మీరు సెలవిచ్చినచో దానిని కూడ జయింతుము" అని హజ్రత్ ఉమరుగారికి వ్రాసిరి. కాని హజ్రత్ ఉమరుగారు దాని గూర్చి సెలవియ్యలేదు. అందులకు అమరుగారు బరఖాపై అబ్దుల్లాబిన్ నాఫీగారిని అధికారిగా నియమించి తాము ఈజిప్టునకు తిరిగివచ్చిరి. ఇది హి॥ శ॥ 23వ యేటసంభవించెను. ఖిబ్తీలులో అనేకులు ఇస్లామ్ మతధర్మములను అందలిమేలిమిని ముసల్మానుల న్యాయమును, సత్ప్రవర్తనమును భక్తిని చూచి మనస్ఫూర్తిగా ఏలాటిబలాత్కారము లేకయే ఇస్లాము మతములోచేరిరి. దినదినము ఈజిప్టులో ఇస్లాము వ్యాపింపసాగెను.

—: హజ్రత్ ఉమరుగారి హత్య :—

మదీనాపురములో ముగైరాబిన్ షూబాగారికి నొక

ఈరానీ బానిసీఁడుండెను. వానిని అబూలూలూ అనుదురు. ఒకదినము అబూలూలూ, హజ్రత్ ఉమరుగారి సన్నిధికివచ్చి "నాయజమానుఁడు నాపైచాల పన్నువిధించి యున్నాఁడు. మీరు దానిని దగ్గించుఁడు" అని పలికెను. అపుడు హజ్రత్ ఉమరుగారు ప్రతిదినము నీవెంతపన్ను చెల్లించుచున్నావు. అని ప్రశ్నింపఁగ "రెండు దిర్హాము (పావులా)లు" అని పలికెను. నీవేమి వృత్తిచేయుదువు అని హజ్రత్ ఉమరుగారు వాని నడుగఁగా "నేను వడ్రంగిపని, కమ్మరిపని, చిత్రించుపని చేయుదును" అని అబూలూలూ పలికెను. అపుడు హజ్రత్ ఉమరుగారు "అటులైనచో నీకుఆపన్ను హెచ్చుగాలేదు" అని బదులు చెప్పఁగా "సరే నేను చూచుకొందును" అని పలుకుచు అబూలూలూ వెళ్లిపోయెను. అపుడు "ఒకదాసుఁడు నన్ను బెదరించెను" అని హజ్రత్ ఉమరుగారు పలికిరి. రెండవదినము ప్రాతఃకాలమున హజ్రత్ ఉమరుగారు నమాజు చేయుటకు మసీదునకు వచ్చిరి. అందఱు ముసల్మానులు సామాజిక ప్రార్థనకు సిద్ధమై పంక్తులుగానిలిచిరి. హజ్రత్ ఉమరుగారు నమాజు చేయించుటకై ముందునిలిచి అల్లాహు అక్బరు అని పలుకు చుండఁగ అబూలూలూ ఆకస్మికముగా హజ్రత్ ఉమరుగారి పైఁబడి ఖడ్గముతో నాభిపైనను మూఁపుపైనను ఆఱుగాయములు తగిలించి పాఱిపోసాగెను. అచ్చటనున్న ముసల్మానులు వానిని పట్టుకొనుటకు పరుగెత్తిరి. వానిని పట్టుటకు వచ్చిన ముసల్మానులను కూడ వాఁడు ఖడ్గముతో గాయపఱచెను. తుదకు తాను పట్టువడక తప్పించుకొనుటకు మార్గములేదు అని తలఁచి తన ఖడ్గముతోనే తనఆత్మ హత్యచేసి

కొనెను. ఆపిదప హాజ్రత్ అబ్దుర్ రహ్మాను బిన్ ఔఫుగారు నమాజు చేయించవలెను అని హాజ్రత్ ఉమరుగారు సెల విచ్చిరి. అపుడు అబ్దుర్ రహ్మానుగారు నమాజు తొందరగా చేయించిరి. అంతవఱకు హాజ్రత్ ఉమరుగారు నేలపై పడియుం డిరి. నమాజుముగిసిన పిమ్మట హాజ్రత్ ఉమరుగారిని గృహము నకు నెత్తుకొని వచ్చిరి. అపుడు హాజ్రత్ ఉమరుగారు "ఎవఁ డు నన్ను గాయపఱచెను" అని ప్రశ్నింపఁగా "అబూలూలూ" అని ముసల్మానులు పలికిరి. అప్పుడు హాజ్రత్ ఉమరుగారు "దేవునికి కృతజ్ఞత! నాహత్యకు ముసల్మానుఁడు కారకుఁడు కాలేదు" అని పలికిరి. హాజ్రత్ ఉమరుగారి గాయము లకు చికిత్సచేయుట ఒక అన్సారీవైద్యుఁడు రప్పింపఁబడెను. ఆ వైద్యుఁడు హాజ్రత్ ఉమరుగారికి బలమునకై పాలు త్రాగిం చెను. కాని ఆపాలు కడుపులోతగిలిన గాయముల నుండి బయటికి వచ్చెను. అపుడు ఆవైద్యుఁడు "ఓఅమీరల్ మూమి నీన్! ఇఁక మీరు మీప్రతినిధిని (ఖలీఫాను)నియమింపుఁడు" అని పలికెను. (అనఁగా నిఁక మరణకాలము సమీపించినది అని భావము.) వైద్యుని మాటవిని అచ్చటనున్న వారు ఏడ్వ సాగిరి. అపుడు హాజ్రత్ ఉమరుగారు "ఏడ్చువారందఱు నా యొద్దనుండి వెళ్లిపోవలెను. బంధువులు ఏడ్చినచో మృతి నొందిన వానికి శిక్షగలుగును అని హజ్రత్ రసూలువారు ఉపదేశించినది మీరు వినలేదా" అని పలికిరి.

హజ్రత్ ఉమరుగారు తాముఇహలోకమును వదలి పరలోకమునకుఁ బోవుకాలము సమీపించినది అని తెలిసి కొని తమకుమారునితో "ఓ అబ్దుల్లాః! నీవు ఉమ్మల్

మూమినీన్ బీబీ ఆయిషాగారియొద్దకుఁబోయి వారికి నాతరఫున సలాము పలుకుము. నా పేరు చెప్పుము. అమీరుల్ మూమినీన్ అనినన్ను గూర్చి పలుకకుము. ఎందుకన నేను ఇపుడు అమీరుల్ మూమినీన్ (ముసల్మానుల అమీరు) కాను. హజ్రత్ రసూలు వారియొక్కయు హజ్రత్ అబూబకరుగారియొక్కయు సమాధులయొద్ద మీయింటిలోన సమాధికిఁగాను స్థలము నొసంగవలెను అని బీబీ ఆయిషాగారితో మనవిచేయుము'' అని పలికిపంపిరి. అబ్దుల్లాగారు బీబీ ఆయిషాగారి సన్నిధికి పోఁగా వారు దుఃఖముతో ఏడ్చుచుండిరి. అపుడు హజ్రత్ ఉమరుగారి మనవి బీబీ ఆయిషాగారికి విన్నవింపఁగా "ఈస్థలము నాసమాధికిఁగాను ఉంచుకొనవలెనని తలఁచుచుంటిని. కాని మీకు నొసంగుదును'' అని పలికి అబ్దుల్లాగారికి తెలియఁజేసిరి. అబ్దుల్లాగారు బీబీ ఆయిషాగారి యొద్దనుండి తిరిగి హజ్రత్ ఉమరుగారియొద్దకు రాఁగానే తమ యొద్దనున్న జనులతో "నన్ను లేపి కూర్చుండఁబెట్టుఁడు'' అని హజ్రత్ ఉమరుగారు సెలవిచ్చిరి. ఆపిదపవారు ఆనుకొనికూర్చుండి "ఓఅబ్దుల్లా ఏమిజవాబు తెచ్చితివి''అని ప్రశ్నింపఁగామీకోరిక నెఱవేఱినది అని అబ్దుల్లాగారు పలికిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు దేవుని కృతజ్ఞత! నాకోరికలలో అన్నిటికంటె ఇదియే చాల గొప్పది. చూడుఁడు! నాజనాజ (శవము) నెత్తుకొని బీబీఆయిషాగారి యింటియొద్దకుపోయి మరల ఉమరు సెలవు కోరుచున్నాఁడు అని పలుకవలెను. అపుడు బీబీ ఆయిషాగారు రావచ్చును అని సెలవిచ్చినచో మీరు నాశవమును అచ్చట సమాధి గావింపవలెను. లేనిచో అందఱు ముసల్మానుల గోరీ

లతోఁబాటు నన్నుకూడ సమాధిగావింపవలెను అని పలికిరి. బహుశః బీబీ ఆయిషాగారు ఖలీఫాగారి జీవితకాలములో ఇష్టము లేకయున్నను సెలవిచ్చి యుండవచ్చును. కావున మృతినొందిన పిదప తిరిగి సెలవుపొందినచో బీబీఆయిషాగారు మనఃపూర్తిగా సెలవిచ్చిన విషయము తేటతెల్లమగును అని వారిభావము. హజ్రత్ ఉమరుగారికి మరణకాలము సమీపింపఁగా వారు దేవుని భయముతో నేడ్వసాగిరి.

అపుడు హజ్రత్ అబ్దుల్లాః బిన్ అబ్బాసుగారు "ఓఅమీరల్ మూమినీన్. మీరుసంతోష పడుదురుగాత! హజ్రత్ రసూలువారు ఇహలోకమును విడచిపోవునపుడు మీతో సంతోషముగానే యుండిరి. ఇటులే హజ్రత్ అబూబకరుగారు కూడమీతో సంతోషముగానేయుండి పరలోకము చేరిరి. ఇఁకమీరు ఇహలోకమును వదలిపోవుచున్నపుడు ముసల్మానులందఱుమీతో సంతోషముగానున్నారు. మీవిషయమున ఏలాటిఅసమ్మతము ముసల్మానుల హృదయములలో లేదు" అని పలుకఁగా హజ్రత్ ఉమరుగారు "దేవునిసాక్షి! ఏమిమీరు నన్ను మోసములో పడవేయ తలంచుచున్నారా! ఇఁకరానున్నస్థితినిగూర్చి నేను చాల భయపడుచున్నాను. ఈభయమునుండి రక్షణపొందుటకుఁగాను లోకమందున్న అన్ని ఖజానాలద్రవ్యము నాయొద్దనున్నచో అసర్వము నొసంగి నేను మోక్షము పొందఁగోరుదును" అని పలికిరి. అవసానకాలము ప్రారంభమాయెను. అపుడు హజ్రత్ ఉమరుగారు తమకుమారునితో "ఓకుమారా! నా నొసటిని భూమిపై ఆనునట్లు చేయుము అని పలుకఁగానే అబ్దుల్లాఃగారు అటులేగావించిరి.

హజ్రత్ ఉమరుగారు"; నేలపై తమశిరస్సునుంచి "ఓ దేవా! నన్ను క్షమింపుము. నీవుక్షమింపనిచో నాకును, నన్ను కన్న తల్లికిని వ్యసనమగును అని భయభక్తులతో ప్రార్థించుచు తమ ప్రాణమునువదలి స్వర్గలోకము చేరిరి. ఇన్నా-లిల్లాహి-వ-ఇన్నా-ఇలైహి-రాజిఊన్.

హజ్రత్ ఉమరుగారుగాయపడిన మూఁడవదినము హి॥శ॥ 23వ యేఁట జిల్ హాజ్ నెల 27వ తేది బుధవారమునాఁడు రాత్రి పూట మృతినొందిరి. మరుసటిదినము గురువారమునాఁడు ఉదయమున సమాధి గావింపఁబడెను. మృతినొందినపుడు వారికి 63 సంవత్సరముల వయస్సుండెను. వారు, పది సంవత్సరములు ఆఱునెలలు నాలుగుదినములు ప్రభుత్వముచేసిరి.

—: హజ్రత్ ఉమరుగారి సంతానము :—

హజ్రత్ ఉమరుగారికి, అబ్దుల్లాః ఉబైదుల్లాః ఆసిమ్, అబూషహామా, అబ్దుర్ రహ్మాను, జైదు, ముజీరుఅను కుమారులును, హాఫ్సా, రుఖయ్యా, అను కుమార్తెలునుండిరి. వారి కుమార్తెలలో బీబీహాఫ్సా, హజ్రత్ మహమ్మదురసూలు వారి ధర్మపత్ని.కుమారులలో అబ్దుల్లాః, ఉబైదుల్లా ఆసిము యొక్క సంతానములు వృద్ధిపొందెను. వారు ముగ్గురువిద్యను బట్టియు ఇతర సుగుణములను బట్టియు చాల ప్రఖ్యాతిగాంచిరి. హజ్రత్ ఉమరుగారు పరలోకము చేరునపుడు ఇస్లాము ప్రభుత్వములోనుండిన రాష్ట్రములకు అధికారులుగా నియమింపఁబడియుండిన వారిపేర్లు ఈలాగున్నవి:—

| రాష్ట్రములు | అధికార్ల పేరు |
|---|---|
| మక్కా | నాఫేబిన్ అబిల్ హారిస్ |

| | |
|---|---|
| తాయిఫ్ | సుఫ్యాన్ బిన్ అబ్దుల్లాః |
| కూఫా | ముగైరాబిన్ షూబా |
| బసరా | అబూమూసాఅష్అరీ |
| ఈజిప్టు (మిసర్) | అమరుబిన్ ఆస్ |
| దమస్కు | మఆవియాబిన్ అబీసుఫ్యాన్ |
| హిమ్మస్ | ఉమైర్ బిన్ సాద్ |
| బహరైన్ | ఉస్మాన్ బిన్ అబీఆస్ |

జైద్ బిన్ సాబిత్ గారు హజ్రత్ ఉమరుగారికి లేఖరిగా నుండిరి. బైతుల్ మాల్ (ప్రభుత్వఖజానా)కు అబ్దుల్లాఃబిన్ అర్ ఖమ్ పెద్దగానుండెను. యర్ఫా అను బానిసీఁడు హజ్రత్ ఉమరుగారికి ద్వారపాలకుఁడుగా నుండెను.

—: హజ్రత్ ఉమరుగారి మరణశాసనము (వసీయత్) :—

హజ్రత్ ఉమరుగారికిఁ దగిలిన తీవ్రగాయముల వలన వారి జీవితమునుగూర్చి ముసల్మానులకు నిరాశగలిగెను. అపుడు కొందఱు ముసల్మానులు "ఓఅమీరల్ మూమినీన్! మీ పిమ్మట ముసల్మానులకుఁగాను ఒకప్రతినిధిని నియమించినచో బాగు" అని హజ్రత్ ఉమరుగారితో విన్నవించిరి. అపుడు "నేను ఒకరిని ఖలీఫాగా నియమించిన నియమింప వచ్చును. అందేలాటి దోషములేదు. ఎందుకన హజ్రత్ అబూబకరు గారు అట్లు చేసియున్నారు. నేను ఖలీఫాగా ఒకరిని నియమింపనిచో అందేలాటి దోషముకూడలేదు. ఎందుకన హజ్రత్ ముహమ్మద్ రసూలువారు తమ ప్రతినిధిని నియమింపకయే పరలోకము చేరిరి." అని హజ్రత్ ఉమరుగారు పలికిరి. అపుడు ముసల్మానులు ఏమియు పలుకక యూరకయుండిరి. ఆపిదప

రెండవసారి ముసల్మానులు ప్రతిసభనిగూర్చి హజ్రత్ ఉమరు గారితో విన్నవింపఁగా "నేను పరలోకమునకు బోవుచున్నాను, నాజీవిత కాలము వహించినట్టి భారమును బాధ్యతను ఒకరిని నియమించి మరణించిన తరువాత ఆబాధ్యతను వహింపజాలను కావున అలీ, ఉస్మాను, అబ్దుల్ రహ్మాన్ బిన్ ఔఫ్, సాద్ బిన్ అబీవఖాస్ జుబైరుబిన్ అవామ్ తలహాబిన్ ఉబైదుల్లాః అను ఆఱుగురుచేరి నెవ్వనినైన ఒకనిని అధికారిగా నెన్నుకొనవలెను" అని సెలవిచ్చిరి. ఆపిదప మిఖ్దాద్ బిన్ అస్వదును రప్పించి "ఓమిఖ్దాద్! మీరు ఈ ఆఱుగురిని ఒకగృహములో సమావేశపఱుపవలెను. మూఁడు దినములలోపల వారు (ఆఱుగురు) తమలో నొక్కనిని ఖలీఫా (అధికారి)గా నెన్నుకొన వలెను. ఒక వేళ ఏకగ్రీవముగా నెవరైన ఒకరు ఎన్నుకొనఁబడనిచో ఎవని పక్షమున నెక్కువ అభిప్రాయము లుండునో ఆతఁడు అధికారి కావలెను. అభిప్రాయములు సరిసమానముగా నున్నచో నా కుమారుఁడగు అబ్దుల్లాఃను దాని గూర్చి పెద్దచేసి ఆయన ఎవని పక్షమున తన అభిప్రాయమిచ్చునో ఆతఁడు ఖలీఫా కావలెను. అబ్దుల్లాఃకు మాత్రము ఖిలాఫత్ లో నేలాంటి హక్కుండదుసుమా! ఒక వేళ తీర్మానమునకు పెద్దగా అబ్దుల్లాః కానిచో అబ్దుర్ రహ్మానుబినుఔఫ్ ఎవరి పక్షముననుండునో ఆతఁడు అధికారి కావలెను. అందఱు తీర్మానించి ఒకనిని అధికారిగా నియమించుకొన్న పిదప నెవఁడు ఖలీఫాకువిరుద్ధముచేసి ముసల్మానులలో విప్లవము(తిరుగుబాటు) గలిగింపఁబూనునో వానినివధింపుము" అని సెలవిచ్చిరి. హజ్రత్ ఉమరుగారి మరణశాసనముకుబట్టి వారు మరణించిన పిదప

ఆ ఆఱుగురిలో హజ్రత్ ఉస్మాను గనీగారు ఖలీఫాగా ఎన్ను కొనఁబడిరి. ఈ విషయము మూఁడవ ఖలీఫా హజ్రత్ ఉస్మాన్ గనీగారి చరిత్రములో వ్రాయుదుము. ఇఁక హజ్రత్ ఉమరుగారు తమ ప్రభుత్వకాలములో గావించిన ఘనకార్యములును, వారి సుగుణములును, వారి శీలమును వివరింతుము. ఇందు ప్రభుత్వముచేయు ప్రతి అధికారికి గుణపాఠముగలదు. అందఱు ప్రభువులును అధికారులును హజ్రత్ ఉమరుగారి ప్రభుత్వ పద్ధతిని అనుసరించి వారి సుగుణములు వహించినచో లోకమంతటను శాంతమును న్యాయమును నెలకొనును.

## —: హజ్రత్ ఉమరుగారి ఘనకార్యములు :—

యుద్ధకాలములలో న్యాయము పాటించుట:- హజ్రత్ ఉమరుగారి ప్రభుత్వకాలములో అనేక దేశములను ముసల్మానులు జయించిరి. ఆవిజయములను గూర్చి వివరముగా ముందు వ్రాసియున్నాము ముసల్మానులు గొప్ప యుత్సాహముతోను ధైర్యముతోను స్థిరము గాయుద్ధరంగములందు నిలిచి రోమను రాజ్యమును, పారసీక ప్రభుత్వమును తల్లకిందులుగఁజేసి వేసిరి. ఇట్లు దీనికి పూర్వము సంభవించి యుండలేదు. లోక చరిత్రములో దీనికి ఉదాహరణము దొరకనేరదు. ఎడారిలో నివసించుచున్న కొందఱు అరబ్బులు కొద్దికాలములోనే యింతటి గొప్ప మార్పును లోకములో కలిగించుట గొప్ప విషయముగదా! అలెగ్జాండరు, చింగీజు, తైమూరు అనువారు దేశములపై దండెత్తి లోకమును తల్లక్రిందులుఁగఁజేసి వేసిరి. కాని హజ్రత్ ఉమరుగారు దండయాత్రలుగావించి పొందిన జయములకును వారి జయములకును చాలతారతమ్యముగలదు.

అలెగ్జాండరు మొదలగువారు ఒక గొప్ప తుపానువలెలేచి దేశములను నాశముచేయుచు హత్యలు గావించుచు అన్యాయములు చేయుచు ఒక మూలనుండి మఱొక మూలకు పోయి చేరిరి. తైమూరు, గావించిన హత్యల విషయము అందఱకు తెలిసియే యున్నది. చంగీజుఅను వాఁడు హిందూదేశముపై పలుమార్లు దాడి సలిపి అందలి పురవాసులను వధించి దోపిడిలు గావించి అన్యాయముగా పెక్కుహింసలు గావించి రైతులకు కష్ట పెట్టెను.

అలెగ్జాండరు సిరియాదేశములో సూరుఅను పట్టణము ను జయించి ఒక వేయిమంది పురవాసుల తలలను నఱకి కోటగోడపై వ్రేలాడఁగట్టెను. నేరములేనట్టి ముప్పదివేల మంది స్త్రీపురుషులను బానిసలుగాఁజేసి యితరులకు అమ్మి వేసెను. ఇటులే ఈరాను (పారసీక) దేశములో అస్తఖరు పురమునుజయించి అందలి పురుషులందఱిని నేరములేకయే వధించెను. దీనికి వ్యతిరేకముగా హజ్రత్ ఉమరుగారు జయించిన దేశములో నిట్టి హత్యలు, అన్యాయములుగల యొకయుదాహరణముకూడ లభింపనేరదు. "బిడ్డలను, స్త్రీలను, వృద్ధులను వధింపఁగూడదు. వారిజోలికి పోఁగూడదు. ఎవరు యుద్ధము చేయుదురో వారినేమాత్రము వధింపవలెను. యుద్ధములో పాల్గొనని సామాన్యపురవాసులను వధింపఁగూడదు. వారిజోలికి పోఁగూడదు, చెట్లనుకూడ నఱకఁగూడదు" అని హజ్రత్ ఉమరుగారు తమసైనికులకు కఠినముగా నుత్తరవు చేయుచుండిరి. ముసల్మాను అధికారులుకూడ తమకులోఁబడినరైతులయెడల చాల న్యాయము పాటించుచు వారియెడ

చాల మర్యాదగలిగియుండిరి. కావుననే రైతులు, ముసల్మానుల యధికారులయెడ చాల విధేయత, భక్తిగలిగి యుండిరి. రైతులు ఇస్లాము ప్రభుత్వమును దేవుని యనుగ్రహము అని దలంచుచుండిరి. ఇంతేకాక రైతులు ముసల్మానులయెడ తమ కృతజ్ఞతచూపుచు వారికి తోడుపడు చుండిరి. గొప్ప శాంతి తోనుండుచుండిరి. ముసల్మానులు సిరియా దేశముపై దండెత్తి నపుడు అచ్చటి రైతులే ముసల్మానుల సుగుణములను న్యాయ మునుచూచి తమ దేశములోని రహస్యములను ముసల్మానుల కుఁదెలుపుచు గూఢచారులుగఁ బనిచేసి చాల తోడుపడిరి. ముసల్మానులు ఈజిప్టు (మిసరు) దేశముపై దండెత్తి నపుడు అచ్చటి పురవాసులు (ఖిబ్తీలు) ముసల్మానుల సైన్యమునకు ముందు పోవుచు మార్గములను సవరించుచుండిరి. ఇటులే ఇరాకు దేశములోఁగూడ అచ్చటి పురవాసులు ముసల్మానుల సైన్యములకు తోడుపడి వంతెనలుకట్టి శత్రువుల రహస్య ములను వారికిఁదెలుపుచుండిరి.

అలెగ్జాండరు, చింగీజు తమ తమ దండయాత్రిలలో గావించిన అన్యాయముల వలనను ఘోరహత్యల వలనను దేశవిజయములు వారికి లభించెను. కాని అన్యాయములపై పునాదివేసిన ప్రభుత్వమునకు నిలకడయుండదు గదా! అది కొన్నాళ్లలోనే వినాశమొందును గదా! కావుననే వారి ప్రభుత్వములు నీటి బుడుగలవలెనాశమై పోయెను. దీనికి విరుద్ధముగా హజ్రత్ ఉమరుగారు స్థాపించిన ప్రభుత్వము యొక్క పునాది న్యాయముపై శాంతముపై చేయఁబడెను. కావున అది స్థిరముగానున్నది. వారు పరలోకముచేరి ఇప్పటికి

(10-10-1950) 1350 సంవత్సరములాయెను. వారు జయించిన దేశములు, ముసల్మానుల చేతులలోనే యున్నవి.

రోమను, పారసీక సామ్రాజ్యములు కొలఁదికాలములోనే ముసల్మానులయెదుట నిలువలేక ఓడిపోవుటకు గొప్ప కారణములు, ఇస్లామ్మతమునందుఁగల ప్రభుత్వపద్ధతియును, ఖలీఫాయొక్క న్యాయపరిపాసమును.

—: ప్రభుత్వ పద్ధతి :—

ఇస్లాములోధర్మ ప్రభుత్వము (ఖిలాఫత్) హజ్రత్ అబూబకరుగారి కాలములోనే ప్రారంభమాయెను. వారి ప్రభుత్వముకొలఁది కాలముండినను గొప్ప గొప్ప కార్యములు నెఱవేఱెను. కాని అన్ని విధములుగ ప్రభుత్వనియమములును శాఖలును హజ్రత్ ఉమరుగారు తమప్రభుత్వ కాలములో ఏర్పఱచి రోమను పారసీక దేశములను ఇస్లాము రాజ్యలోచేర్చిరి. వారు ప్రభుత్వమునకు కావలసిన అన్ని యేర్పాటులు గావించిరి.

—: సలహా గైకొనుట :—

హజ్రత్ ఉమరుగారు సాంఘిక దేశీయ విషయములన్నిటిని గూర్చి గొప్ప గొప్ప నాయకుల సభగావించి వారి అభిప్రాయము గైకొని ఏకగ్రీవముగా తీర్మానించఁబడినవిషయములను అమలుపఱచుచుండిరి. సొంతముగా నెద్దియును చేయకుండిరి. సాధారణమైన కార్యములను గూర్చి ప్రతిదినము సలహా పుచ్చుకొనుటకు ప్రత్యేకముగా కొందఱనాయకులసభ నిర్మింపఁబడియుండెను. ఆసభలో, హజ్రత్ ఉస్మాను, హజ్రత్ అలీ, హజ్రత్ అబ్దుర్రహ్మన్ బిన్ఔఫ్, హజ్రత్ మఆజు బిన్

జల్, హాజ్రిత్ ఉబై బిన్ కాబు హాజ్రిత్ జైద్ బిన్ సాబిత్ అను వారు ముఖ్యసభ్యులుగా నుండిరి. ఈప్రత్యేకమైన సభగాక ఏదైన గొప్ప విషయము సంభవించినచో దానిఁగూర్చి చర్చించి సలహా పుచ్చుకొనుటకు సర్వసామాన్యమైన సభ (జనరల్ మీటింగ్) జరుగుచుండెను. అందు మహాజిరులను అన్సార్లను అన్నికుటుంబముల నాయకులును పాల్గొనుచుండిరి. ఒకపుడు ప్రత్యేకముగా ముహాజిర్ల సభగావించి వారితో సలహాగైకొనఁబడుచుండును. హాజ్రిత్ ఉమరుగారు సభగావింపఁదలఁచు కొన్నపుడు మదీనాపురములో తిరిగి చాటించుటకుఁ గాను ఒకని నియమింతురు. ఆతఁడు వీధులకుఁబోయి అస్సలా తుజామిఅతున్ అని పలుకుచు పోవును. వినినవారందఱు మసీదులో వచ్చికూడుదురు. అపుడు హాజ్రిత్ ఉమరుగారు రెండు రకాతులు నమాజుచేసి తాము ఉద్దేశించియున్న కార్యమును గూర్చి గొప్ప ఉపన్యాసముగావింతురు. ఆపిదప దానిఁగూర్చి ఒక్కొక్కని యభిప్రాయము అడుగుదురు. ఆ విషయము ఏకగ్రీవముగా సమ్మతింపఁబడిన పిదప దానిని చేయుదురు. ఖిలాఫత్ (ధర్మప్రభుత్వము)లో ప్రతి మనుజునకును ప్రాణ, మాన, ధనరక్షణ హక్కులును, వాక్కు స్వాతంత్ర్యమునుండును. ఖలీఫాయొక్క అధికారములు మితముగా నుండును. ప్రతి మనుష్యునకును ఖలీఫా చేయుకార్యములను గూర్చి విమర్శించుటకు హక్కుగలదు. ఇవన్నియు సంపూర్ణముగ హాజ్రత్ ఉమరుగారి ఖిలాఫత్ లో నుండెను. కావున ప్రతి మనుజుఁడును నిర్భయముగా తన హక్కులను గూర్చి వారిని నడుగుచుండెను. మఱియుహాజ్రిత్ ఉమరుగారు అనేక సమ

యములలో ఖలీఫాయొక్క అధికారములను గూర్చి స్పష్టముగాఁదెలిపి యున్నారు. వారుగావించియున్న నొక యుపన్యాసముయొక్క కొన్ని వాక్యముల తర్జుమా ఇచ్చట వ్రాయుదుము. దీనివలన ఖలీఫా పదవినిబట్టి వారి కెంత అధికారముండెనో తెలియనగును.

"ఓ ప్రజలారా! అనాధశిశువుల పోషకునివలె నేను మీకున్నాఁడను. వారి సొత్తులో పోషకునికెంత హక్కుగలదో అంతేనాకును మీసొత్తు (ప్రభుత్వధనము)లో హక్కుగలదు. నేను ధనికుఁడనైనచో ఏమియు పుచ్చుకొనను. బీదవాఁడనైనచో నాయక్కఱ కొలఁది మితముగాఁదీసి కొందును. ఓ జనులార! నాపై మీహక్కులు గలవు. మీరు వానిని గూర్చి నన్ను ప్రశ్నింపవచ్చును. నేను పన్నులరాఁబడిని విజయధనమును సేకరించి వృథాగానిలువఁబెట్ట గూడదు. మఱియు నా యొద్దకు వచ్చినప్రభుత్వ ధనమును నేను వృథాగాఖర్చు చేయఁగూడదు. మఱి మీ వేతనములను నేను హెచ్చింపవలెను. మఱి దేశసరిహద్దులను కాపాడవలెను. మఱియు మిమ్ము వినాశములకు పాలుచేయఁగూడదు."

హజ్రత్ ఉమరుగారు తాముగావించిన ఉపన్యాసమును చాలకఠినముగా అనుసరించిరి. వట్టి డంబాలు పలుకలేదు. దీనిఁగూర్చి దెలుపుకొన్ని విషయములనిందు వ్రాయుదుము:-

ఒకసారి హజ్రత్ ఉమరుగారు మసీదులో గొప్ప సభ గావించి యుపన్యాసమిచ్చుచుండిరి. అపుడు ఒకఁడులేచి "ఓఉమరు! నీఉపన్యాసమును చాలింపుము. మేము నీమాటవినము" అని పలికెను, అప్పుడు హజ్రత్ ఉమరుగారు దానికి కారణ

మేమని అడిగిరి. అపుడాతఁడు "నిన్నటి దినము విజయధనము లో యమనునుండి కొన్ని దుప్పట్లు వచ్చియుండెను. అందు ఒక్కొక్కనికి ఒక్కొక్క దుప్పటి లభించెను. నీవుధరించి యున్న ఈపొడగాటి చొక్కాయ ఒక దుప్పటిలో కాఁజా లదు. కావున నీవు నీభాగముకంటె నెక్కువ పుచ్చుకొన్నావు. కావున నీమాట మేము వినము"అని పలికెను. అపుడు హజ్రత్ ఉమరుగారు "నాకుమారుఁడగు అబ్దుల్లాః దీనికి సమాధాన మిచ్చును"అని పలికిరి. అపుడు అబ్దుల్లాఃగారు లేచి "అమీరుల్ మూమినీన్ గారికి చొక్కాయ లేకుండెను. వారి పొడగాటి దేహమునకు ఒక దుప్పటిలో చొక్కాయ కాకుం డెను. అపుడు నాభాగమునకు వచ్చిన నాదుప్పటిని వారికి నొసంగితిని"అని పలుకఁగా ప్రశ్నించిన యాతఁడు సరే! ఇపుడు మేము నీమాట వినుదుము అని పలికి కూర్చుండెను.

ఒకసారి హజ్రత్ ఉమరుగారి యొద్దకు విజయధనము వచ్చెను. వారి కుమార్తె బీబీ హఫసా (హజ్రత్ పైగంబరుల వారి ధర్మపత్ని) వారి యొద్దకువచ్చి "అమీరుల్ మూమినీన్ నేను పైగంబరులవారి బంధువులలో చేరిన యామెను. కావున నాకు కూడ ఈవిజయధనములో కొంత నొసంగుఁడు "అని విన్నవించెను. అపుడు హజ్రత్ ఉమరుగారు" ఓ నాకుమారీ! నాసొంత సొత్తులో నీకు తప్పక భాగము గలదు. కాని ఈధ నము ముసల్మాను లందఱకు చేరవలసినది. నీవు నీతండ్రిని మోసపుచ్చ నెంచితివా! ఇది చాల విచార్యము"అనిపలుకఁగా బీబీహఫసా తలవంచుకొని వెళ్ళిపోయెను.

ఒకసారి హజ్రత్ ఉమరుగారు జబ్బుపడిరి. వారికి మందులో తేనె కావలసి యుండెను. ఎచ్చట దొరకలేదు. బైతుల్ మాలు (ప్రభుత్వ ఖజానా)లో తేనెయుండెను. స్వయముగా ప్రజల సెలవు లేనిది తీసికొనలేరు. కావున మసీదులో పోయి ముసల్మానులతో "మీరు సెలవిచ్చినచో కొంచెము తేనె తీసుకొందును"అని అడిగిరి. అపుడు ప్రజలు "మీరు తీసికొన వచ్చును"అని సెలవు నొసంగగా తేనె దీసికొనిరి. చూచితిరా! చిన్న చిన్న విషయములోకూడ హజ్రత్ ఉమరుగారు ఎంత జాగ్రత్తగా నుండుచుండిరి. ఇఁక గొప్పగొప్ప విషయములలో నెట్లు ధర్మమును సత్యమును న్యాయమును అనుసరించుచుండిరో పాఠకులే యూహింపవలెను. "అధికారులు ఏదైన పొరపాటు చేసినచో వారిని ఆక్షేపింప వచ్చును" అని హజ్రత్ ఉమరుగారు ప్రజలకు అధికారము నొసంగియుండిరి. కావున అధికారులు చాల జాగ్రత్తతో న్యాయముగ ప్రవర్తించుచుండిరి. అధికారులు అటుండనిండు హజ్రత్ ఉమరుగారినే ప్రజలు నిర్భయముగా ఆక్షేపించుచుండిరి. వారు ప్రజలయాక్షేపణములను గొప్పసహనముతో విని వారికి సమాధానమిచ్చుచుండిరి. ఒక సమయమందు గొప్ప సభలో ఒకఁడు అనేక పర్యాయములు హజ్రత్ ఉమరుగారితో "ఇత్-తఖిల్లాహా-యాఉమర్ అనగా ఓఉమరు దేవునికిభయముపడుము" అని పలికెను. ఆసభలో ఒకరు అతని మందలింప నుద్దేశించిరి. కాని హజ్రత్ ఉమరుగారు "మీరుమందలింప వలదు. ఆతని పలుకనింకు. వీరు ఆక్షేపింపనిచో వీరుఁడియు ఫలములేదు. మేము వినవనిచో మేముండియు ఫలములేదు" అని పలికిరి. పురు

షులేకాక స్త్రీలుకూడ ఖలీఫాను ఆక్షేపించుచుండిరి. ఒకసారి హజ్రత్ ఉమరుగారు మహరు (స్త్రీధనము)నుగూర్చి ప్రజలకు బోధించుచు "ప్రజలు స్త్రీలకు చాల ధనము (మహరు) ఇచ్చుచున్నారు. ఎక్కువ మహరు ఇచ్చుటలో గౌరవమున్నచో హజ్రత్ పైగంబరులవారు ఎక్కువ మహరు ఇచ్చియుందురు. కావున తక్కువ మహరు ఇయ్యవలెను" అని పలికిరి. అప్పుడు ఒక వృద్ధురాలులేచి "ఓఉమరు దేవునికి భయపడుము. దేవుఁడే ఖురానెషరీఫులో స్త్రీల మహరునుగూర్చి పురుషులు మహరులో స్త్రీలకు బంగారు కుప్పనిచ్చినను తిరిగి తీసికొనకూడదు అని యుపదేశించి యున్నాఁడు దీనివలన శక్తియున్న చాల మహరుకూడ నియ్యవచ్చును. అని తెలియుచున్నది. కావున నీవెట్లు స్త్రీల హక్కును తగ్గింపఁగలవు"అని ఆక్షేపించెను. అప్పుడు హజ్రత్ ఉమరుగారు "ఒక వృద్ధరాలకు ఉమరుకంటె నెక్కువ తెలిసియున్నది"అని పలికి తమ పొరపాటును ఒప్పుకొనిరి. ఇట్లు ప్రజలకు వాక్కు స్వాతంత్ర్యమును సమానత్వము నుండుట వలననే హజ్రత్ ఉమరుగారి ప్రభుత్వము చాల ప్రకాశించి వృద్ధిపొందెను. ప్రజలుకూడ మహాభక్తితోను ధైర్యసాహసములతోను ప్రభుత్వకార్యములలో ఖలీఫాకు తోడుపడుచు త్యాగమూర్తులై యుండిరి.

—: హజ్రత్ ఉమరుగారి యేర్పాట్లు :—

హజ్రత్ ఉమరుగారు ఇస్లామునకు లోఁబడిన దేశములను రాష్ట్రములుగను, జిల్లాలుగను విభజించిరి. అవి మక్కా-మదీనా, సిరియా, బహరైను, బస్రా, కూఫా, మిసరు(ఈజిప్టు) దమష్కు అను ఎనిమిది రాష్ట్రములు. ప్రతి రాష్ట్రములోను

గొప్పగొప్ప అధికారులుండు చుండిరి. అందు, రాష్ట్రమునకు అధికారియగు గవర్నరును, ప్రభుత్వ కార్యములను వ్రాసి యుంచునట్టి హెడ్‌క్లార్కును, సైన్యశాఖకు సంబంధించిన విషయములనువ్రాయు హెడ్‌క్లార్కును, పన్ను వసూలుచేయు కలక్టరును, పోలీసు అధికారియును ప్రభుత్వ ఖజానా అధికారియును, ఖాజీ తగవులను తీర్పుచేయు న్యాయాధికారియును ఉండుచుండిరి.

హజ్రత్ ఉమరుగారు గొప్పగొప్ప అధికారులను నియమించునపుడు సలహా సభయందు సభ్యుల అభిప్రాయము గైకొని యెన్నుకొనుచుండిరి. హజ్రత్ ఉమరుగారు ప్రజల స్వభావమును వారి యోగ్యతను బాగుగా నెఱింగియుండిరి. కావున వారు తమ అనుభవమునుబట్టి ఒక పనికిగాను ఒకని పేరును సభలో తెలుపుదురు. సభ్యులుకూడ దానిని ఏకగ్రీవముగా సమ్మతింతురు. ఇటులే నహావందుపై దాడిసలుపుటకై నూమాను సేనాధిపతిగా ఎన్నుకొనఁబడెను. దీనిగూర్చిముందు వ్రాసియున్నాము.

అధికారుల గుణశీలనములను వారి కార్యములను పరిశీలించుచుండుటయును ప్రజలు దూరాచారములలోను దుర్గుణములలోను పడకుండ చూచుచుండుటయును ప్రతిఖలీఫా యొక్కవిధి. దీనిఁగూర్చి హజ్రత్ ఉమరుగారు చాల శ్రద్ధవహించుచుండిరి. తాము నియమించు ప్రతి యధికారితో "తుర్కీ గుఱ్ఱముపై సవారి చేయకూడదనియు, సన్నని వస్త్రములు ధరింపఁగూడదనియు, పిండి జల్లెడపట్టి రొట్టెచేసికొనఁ గూడదనియు, ద్వారపాలకులుంచ కూడదనియు, అక్కఱగల

వారికిఁగాను ఎల్లపుడు తలుపులు తెఱచి యుంచవలెననియు"
వాగ్దానము పుచ్చుకొనుచుండిరి. అధికారిని పంపునపుడు వాని
కెంత ఆస్తియును సొమ్మునుగలదో దాని పట్టిక తయారుచేసి
బద్రముగా నుంచుచుండిరి. ఒకవేళ అధికారియొద్ద ఎక్కువ
ధనము చేకూరినచో దానిని పరిశీలించి అందు సగము ప్రభు
త్వఖజానాలో చేర్చుచుండిరి. ఒకసారి చాలమంది అధికారుల
సొమ్మును రాఁబట్టి ఖజానాలో చేర్చిరి. కాబాయాత్రికొఱకు
అన్ని రాష్ట్రములనుండి అనేకులు వచ్చుచుండిరి. ఎవరికైన
ఏయధికారియైన అన్యాయము చేసియున్నచో దానిఁగూర్చి
తమకుఁ దెలుపవలెను అని హజ్రత్ ఉమరుగారు చాటించు
చుండిరి. దానిఁబట్టి ప్రజలు తమకు అధికారుల వలన గలుగు
చిన్న చిన్న కష్టములను కూడ హజ్రత్ ఉమరుగారికిఁ దెలుపు
చుండిరి. తత్క్షణము హజ్రత్ ఉమరుగారు విచారించి న్యాయ
మువిధించుచుండిరి. ఒకసారి ఒకఁడువచ్చి "ఓఅమీరుల్ మూమి
నీన్! ఫలాని అధికారి అన్యాయముగ నన్నువంద కొరడాదెబ్బ
లుకొట్టెను" అని విన్నవించెను. తత్క్షణమే హజ్రత్ ఉమరుగా
రువిచారించి ఆయధికారిని వందకొరడా దెబ్బలు అందఱి యెదు
ట వాది కొట్టవలెను అని తీర్మానించిరి. అపుడు అమరుబిన్
ఆసుగారు "ఓ అమీరుల్ మూమినీన్! ఇట్లుచేయుట అధికారు
లకు చాలభారముగా దోఁచును" అని విన్నవింపఁగా అట్లు
కానేరదు. నేను నేరస్థుని శిక్షింపక వదలను అని పలికిరి.
అపుడు అమరుబిన్ ఆసుగారు వాదినిబ్రతిమాలి ఒక్కొక్క
దెబ్బకు బదులుగ రెండు సవరములు పుచ్చుకొనిక్షమింప వలె
నని వేడుకొనిరి. అపుడు ఆవాది దీనికి సమ్మతించి సవరములు

తీసికొని క్షమించెను. హజ్రత్ ఖాలిద్ బిన్ వలీదుగారు గొప్ప యుద్ధ వీరులుగదా! వారు ఇస్లామునకుఁగావించిన సేవచాల గొప్పది గాదా! ఒకసారి వారు ఒక కవికి గొప్ప బహుమానము నిచ్చిరి. అది హజ్రత్ ఉమరుగారికిఁదెలిసి సర్వసేనాధిపతియగు అబూఉబైదాగారికిట్లు వ్రాసిరి:—

"ఖాలిద్ ఆ బహుమానము తన సొంత సొత్తునుండి యిచ్చినచో వృథాఖర్చు చేసెను. లేక ప్రభుత్వఖజానానుండి యిచ్చినచో నమ్మికద్రోహముచేసెను. కావున ఆతనిని పదవి నుండి తొలఁగింపవలసినది." ఆపిదప ఖాలిద్‌గారు వారి గొప్ప పదవినుండి తొలగింపఁబడిరి.

అబూమూసా అష్అరీగారు బస్రాకు గవర్నరుగా నుండిరి. ప్రజలు వారిపై మూఁడు నిందలు మోపిరి. ఒకటి, యుద్ధఖైదీలనుండి అరువదిమందిగొప్పవంశమునకు చేరిన వారిని తమ కొఱకు ప్రత్యేకించుకొని యున్నారు. రెండవది వారు ప్రభుత్వకార్యము లన్నియు జియాద్ బిన్ సుఫ్యానుపై వదలి పెట్టియున్నారు. మూఁడవది వారియొద్ద ఒక బానిసస్త్రీగలదు. సర్వసాధారణముగ ముసల్మానులకు లభింపనిమంచి యాహారము ఆమెకీయ్యఁబడుచున్నది. హజ్రత్ ఉమరుగారు ఆ నిందలను గూర్చి అబూమూసాగారితో విచారింపఁగా మొదటి రెండునిందలకు సరియైన సమాధానము నొసంగిరి. కాని మూఁడవదానికి సరియైన సమాధానమియ్యలేక పోయిరి. కావున ఆబానిస స్త్రీ వారినుండి తీసికొనఁబడెను.

హజ్రత్ సాద్ బిన్ వఖాసుగారు కూఫాలో నొక మహలు కట్టించిరి. దానికి నొక ముఖ్యద్వారము నిర్మించిరి. అది

హాజ్రత్ ఉమరుగారికిఁ దెలిసి అక్కడగలవారికిది ఆటంకము
గుండునేమో అని దానిని తగులఁబెట్టవలసినది అని ఆజ్ఞా
పించి ముహమ్మద్ బిన్ ముస్లిమాను కూఫాకుపంపిరి. ఆయనపో
యిఆముఖ్య ద్వారమును కాల్చివేసెను. సాదుగారు ఊరకనిల
బిచూచుండిరి.

అయాజుబిన్ గనమ్ ఈజిప్టునకు అధికారిగా నుండెను.
ఆయన సన్నని వస్త్రములు ధరించుచున్నాఁడు. మఱియు
ద్వారపాలకుల నియమించియున్నాఁడు అను విషయము హాజ్ర
త్ ఉమరు గారికిఁ దెలిసిదానిని విచారించుటకై ముహమ్మద్ బి
న్ ముస్లిమాను నియమించిరి. ముహమ్మద్ బిన్ ముస్లిమా ఈజి
ప్టునకుఁబోయి చూడఁగా ఆతనిని గృహము నొద్ద ద్వారపాల
కులుండి. మఱియు ఆయన సన్నని వస్త్రములు ధరించియుం
డెను. తత్క్షణమే ముహమ్మద్ బిన్ ముస్లిమా ఆతని ఆస్థితి
లోనే మదీనాకుఁ దీసికొనివచ్చెను. అపుడు హాజ్రత్ ఉమరు
గారు అయాజుధరించి యున్నసన్నని వస్త్రములు దీయించి
రోమముల చొక్కాయతొడగించి మేఁకలను మేఁపవలెనని
ఆజ్ఞాపించిరి. అయాజు ఖలీఫాయాజ్ఞకు లోఁబడిఅటులే చేసెను.
కాని దీనికంటె చావుమేలు అని మాటిమాటికి పలుకుచుం
డెను. అపుడు హాజ్రత్ ఉమరుగారు "నీవెందులకు సిగ్గుపడె
దవు. ఇది నీపెద్దల వృత్తి కాదా" అని ఖండలించిరి. తుదకు
అయాజుమనః పూర్వకముగా తనబుద్ధిని మార్చుకొని మన్నన
వేఁడి తన పదవిధర్మములను బాగుగా నెఱవేర్చసాగెను.

హాజ్రత్ ఉమరుగారు అధికారుల గుణములను సవరిం
చుటయేగాక ప్రజల గుణశీలములను సవరించుటలో చాల

శ్రద్ధ వహించుచుండిరి. అధికారులును రైతులును మంచి గుణములు గలిగియున్నపుడేగదా రాజ్యముబాగుపడి శాంతమును న్యాయమును నెలకొనును. హజ్రత్ ఉమరుగారు ఇస్లాముబోధించునట్టి ధర్మములననుసరించుచు సుగుణ శీలములను ఎట్లుతాము వహించియుండిరో అటులే ప్రజలందఱు ఇస్లాము ధర్మములకు విధేయులై సుగుణములు గలిగియుండవలెనని ప్రయత్నించుచుండిరి. అరబ్బులకు వంశగర్వము చాలయుండెను. ఇతరులను లెక్కపెట్టకుండిరి. కాని హజ్రత్ ఉమరుగారు వారి గర్వమును అణఁచివేసిరి. కావున, రాజు, భటుఁడు అనియు యజమానుఁడు సేవకుఁడు అనియు భేదములేకుండెను. అందఱును సమానగౌరవము గలిగియుండిరి. ఒకసారి సఫ్వాను తబకులో ఆహారము తెచ్చి హజ్రత్ ఉమరుగారి యెదుటనుంచెను. అపుడు హజ్రత్ ఉమరుగారు తమతోఁబాటు సేవకులను బానిసలను కూర్చుండఁబెట్టుకొని ఆహారము భుజించుచు "ఎవరు బానిసలతోఁబాటు కూర్చుండి భుజించుటలో అవమానమని తలంతురో దేవుఁడు వారినిశపించుగాత!" అని యుపదేశించిరి.

హజ్రత్ ఉబైబిన్ కాబుగారు చాలఘనత గలవారు. ఒకదినము వారుసభనుండి లేచిపోవసాగిరి. అపుడు ప్రజలు వారి గౌరవార్థమువారి వెనుక గుమికూడి పోవుచుండిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు వచ్చుట తటస్థించెను. అది చూచివారు ఉబైగారిని ఒకకొరడా దెబ్బకొట్టఁగా ఉబైగారికిచాల ఆశ్చర్యమాయెను. ఉబైగారు "ఇదేమిచేసితిరి" అని అడుగఁగా "ఏమి ఇట్లుపోవుటవలన ముందు నడచు వానికి అహంకారమువలని

అపాయమును వెంబడించు వారికి అగౌరవమును గలుగుట మీరు గ్రహించుటలేదా!" అని హజ్రత్ ఉమరుగారు ఉపదేశించిరి.

సామాన్యముగా అరబ్బులు పరులను దూషించుచు కవిత్వము చేయుచుండిరి. హజ్రత్ ఉమరుగారు దానినిచాలకఠినముగా నిషేధించిరి. హతయ్యాఅను కవి నిందకవిత్వముచేయుటలో చాలప్రసిద్ధి కెక్కియుండెను. హజ్రత్ ఉమరుగారు, ఆతనిని చెఱశాలలోనుంచిరి. తుదకు "పరులను నిందింపఁగూడదు" అను షరత్తుపై వానిని చెఱనుండి వదలిపెట్టిరి. కవులు తమ కవిత్వములో శృంగారమును వర్ణించు నపుడు స్త్రీల పేర్లు తీసికొనఁగూడదని కఠినముగా నిషేధించిరి. ప్రజలు వృథాపనులును, అసహ్యకార్యములను చేయకూడదు అని శాసించిరి. మద్యపానము చేయువారికిశిక్ష నలువది కొరడా దెబ్బలు కొట్టుటయుండెను. ఆశిక్షను హెచ్చించి ఎనుబది కొరడాదెబ్బలు కొట్టవలెనని విధించిరి.

ప్రజలు లోక సౌఖ్యములలో పడఁగూడదు అని హజ్రత్ ఉమరుగారు చాల పాటుపడుచుండిరి. ప్రజలుప్రతి కార్యములో సాధారణత్వమును వదలకూడదనియు, సాధారణ దుస్తులుధరించి సాధారణమైన యాహారము భుజింపవలసినది అని యాజ్ఞాపించుచుండిరి. అందులకే పారసీకులు, నస్రానీలు ధరించునట్టి దుస్తులు అధికారులు ధరింపకూడదు అని విధించిరి. ఎందుకన పారసీకులును నస్రానీలును విలువైన పట్టువస్త్రములు ధరించుచుండిరి.

హజ్రత్ ఉమరుగారు, ప్రజల దుర్గుణములను మాన్పించు

నట్లు సుగుణములును కూడ వారికి అలవాటుపడునట్లు చేయు చుండిరి. ప్రజలకు స్వాతంత్ర్యమును, సమానత్వమును, ఆత్మ గౌరవమును లభించునట్లు చేయుచుండిరి. అధికారులు "అన్యాయముగా ప్రజలను కొట్టి వారిని అవమానపఱుపఁ గూడదు" అని శాసించిరి.

—: భూముల యేర్పాట్లు :—

ముసల్మానులు సిరియా, ఈరాను దేశములను జయించి నపుడు అచ్చటి భూములు ఎవరి వసములో నుండవలెనను చర్చజరిగెను. అందు కొందఱు భూములు సేనాధిపతులకు జాగీరుగా నొసంగఁబడవలెను. ఎవరు జయించిరో వారు ఆ భూములను తమస్వాధీనములోఁ జేసుకొనుటకు వారికి హక్కు గలదు అని వాదించిరి. దీనిఁగూర్చి హజ్రత్ బిలాలుగారు చాల పట్టుపట్టిరి. కాని హజ్రత్ ఉమరుగారు దానిని వ్యతిరేకించి భూములు రైతులస్వాధీనములో నుండవలెను. అచ్చటి నివాసులే దానికి హక్కుదారులు అని అభిప్రాయపడిరి. హజ్రత్ అలీ, హజ్రత్ ఉస్మాను, హజ్రత్ తలహాకూడ హజ్రత్ ఉమరుగారి అభిప్రాయముతో ఏకీభవించిరి. తుదకు దానిఁగూర్చి చర్చించుటకై యొక గొప్పసభ గావింపఁబడెను. ఆసభలో చాలవఱకు దానిఁగూర్చి చర్చజరిగి తుదకు హజ్రత్ ఉమరుగారి యభిప్రాయమే ఏకగ్రీవముగా సమ్మతింపఁబడెను. హజ్రత్ ఉమరుగారు భూములను కొలిపించి సేద్యమునకుఁ దగిన భూములను గూర్చి ఏర్పాటులు చేయించిరి. భూములపై పన్ను విధించిరి. పన్నులను వసూలుచేయు పద్ధతులను నియ

మించిరి. ఇటులే సిరియా, ఈజిప్టు దేశములలోఁగూడ భూము లకుఁ దగినట్లు పన్ను విధించిరి.

—: వ్యాపారపన్ను :—

ముసల్మానులు వ్యాపారమునకు పరదేశములకుఁబోవు చుండిరి. అచ్చటి ప్రభుత్వము ముసల్మానులతో నూరింట పదిరూపాయలు వంతున పన్ను పుచ్చుకొనుచుండెను. ఈ విషయము హజ్రత్ ఉమరుగారికిఁ దెలిసి పరదేశములనుండి వచ్చిన వ్యాపారులుకూడ నూరింట పదిరూపాయలు పన్ను ఇయ్యవలసినది అని విధించిరి. ముందు స్వారికిఁగాను వ్యాపారమునకుఁగానుండు గుఱ్ఱములకు జకాతుపన్ను లేకుండెను. కాని హజ్రత్ ఉమరుగారు, వ్యాపారమునకుఁగానుండు గుఱ్ఱములపై జకాతు పన్ను (నలుబదింట ఒక భాగము) విధించిరి.

హజ్రత్ ఉమరుగారు దేశమంతటనున్న ప్రజల లెక్క చేయించిరి.

—: న్యాయము :—

హజ్రత్ ఉమరుగారు తమ దేశములో న్యాయమును నెలకొల్పుటకు చాల కృషిసలుపుచుండిరి. దానిఁగూర్చి చాల యేర్పాట్లు చేసిరి. వారి కాలములో న్యాయము విధించుటలో ధనవంతుఁడు, బీదవాఁడు, రాజు, బంటు అను భేదము లేకుండెను. అందఱకు ఒకే న్యాయముండెను. అందఱకు ఒకే న్యాయ పద్ధతియును ధర్మమును ఉండెను. అందేలాటి వ్యత్యాసము లేకుండెను. ఒకదినము అమరుబిన్ ఆసుయొక్క కుమారుఁడు అబ్దుల్లాః అన్యాయముగా నొకని గొట్టెను. అపుడు హజ్రత్

ఉమరుగారు అబ్దుల్లాను రప్పించి అతని తండ్రి యెదుటనే దెబ్బలు తిన్నవాఁడు అబ్దుల్లాను కొట్టవలెనని న్యాయము విధించిరి. అమరుగారి యెదుటనే దెబ్బలు తిన్నవాఁడు అబ్దుల్లాను కొట్టెను. అమరుగారు తన పుత్రుని గతి చూచియు ఏమియు చెప్పక యూరక కూర్చుండియుండిరి. సిరియా దేశమునకు అధికారిగా నుండిన జబలా అను నాతఁడు ఇస్లాములో చేరెను. ఆతఁడు మక్కాకు వచ్చి కాబామసీదును ప్రదక్షిణించునపుడు ఒక ముసల్మానునకు చెంపకాయ వేసెను. దానికి బదులుగ ఆచెంపకాయ తినినవాఁడుకూడ జబలాకు నొక చెంపకాయ వేసెను. అపుడు జబలా మండిపడి నేను గొప్పవాఁడనుగదా! నన్ను ఈతఁడు కొట్టువాఁడా అని తలఁచి తత్క్షణమే హజ్రత్ ఉమరుగారి యొద్దకుపోయి ఆవిషయము వారికిఁ దెలిపెను. అపుడు హజ్రత్ ఉమరుగారు, వాఁడు కొట్టినది న్యాయమే. నీవెట్లు చేసితివో అటులే అనుభవించితివి అని పలికిరి. వారి జవాబు విని జబలా ఆశ్చర్యపడి ఏమిరా! ఇచ్చట గొప్పవారు బీదవారు అను భేదములేదే. ఛీ నేనిచ్చట నుండుట ఉచితము గాదురా! అని తలఁచి మతభ్రష్టుఁడై ఖుస్తుంతున్యా (ముసల్మానుల శత్రువుల దేశమున)కుపాఱిపోయి రోమనురాజుతో కలిసికొనెను. హజ్రత్ ఉమరుగారు అందఱకు వేతనములు నియమించిరి. వారు తమ కుమారుఁడగు అబ్దుల్లాకు నియమించిన కంటె నెక్కువ ఉసామాకు నియమించిరి. ముందు ఉసామా బానిసగానుండెను. అందులకు అబ్దుల్లా ''ఓనాయనా! ఉసామా నాకుమించినవాఁడుకాఁడుగదా'' అనివిన్నవించెను. అపుడు హజ్రత్ ఉమరుగారు సరే! కాని హజ్రత్ పైగంబ

రులవారు ఉసామాను నీకంటె నెక్కువగా ప్రేమించుచుం డిరిగదా! అని పలికి సమాధాన మిచ్చిరి.

హజ్రత్ ఉమరుగారు న్యాయము చేయుటలో పక్షపాతములేక ముసల్మానులను, యూదులను, క్రైస్తవులను, ఇతర మతస్థులను సరిసమానముగా చూచుచుండిరి. ఒకసారి బకరుబిన్‌వాయిల్ కుటుంబమునకు చేరిన ఒక ముసల్మానుఁడు ఒక క్రైస్తవుని వధించెను. హజ్రత్ ఉమరుగారికి అది తెలిసి హత్యగావించిన వానిని చంపుటకై వధింపఁబడిన వాని వారసులకు హత్యగావించిన వాని నప్పగింపవలెను అని ఉత్తరువు చేసిరి. దాని ప్రకారము హత్యగావించినవాఁడు వధింపఁబడెను. ఒకసారి హజ్రత్ ఉమరుగారు ఒక ముసలివానిని వీథిలో బిక్షమెత్తుచుండఁగచూచి "నీవెందులకు బిక్షమెత్తుచున్నావు" అని అడిగిరి. అపుడు ఆతఁడు 'నేను చాలబీదవాఁడను. నాయొద్ద పైకములేదు. నేను పన్ను చెల్లింపవలసియున్నది''అని విన్నవింపఁగా హజ్రత్ ఉమరుగారు ఆతని తమ యింటికిఁ దీసికొని వచ్చి వానికి కొంత పైకమునిచ్చి వానికి వేతనము నియమించిరి. జిమ్మీమ్మరైతులలో పనిచేయలేని ముసలి వారికి వేతనములు నియమింపవలెనని ఖజానా అధికారులకు ఉత్తరువు చేసిరి. అరబ్ సూనులోనున్న క్రైస్తవులు పలుమార్లు తిరుగుబాట్లు చేయుచు దేశశాంతికి భంగము కలిగించుచుండిరి. అందుచే వారికి దేశభ్రష్ఠులుగా చేయవలసి వచ్చెను. అపుడు క్రైస్తవులకుఁగల పూర్తి యాస్తికి రెండింతలువెల వారికిచ్చి మర్యాదగా దేశమునుండి సాగనంపిరి. ఇటులే నజరానులో నున్న క్రైస్తవులతో గావింపఁబడెను.

—: న్యాయశాఖ :—

ప్రజల తగవులను తీర్చుట ఖలీఫాయొక్క విధులలో నొకవిధి. దీనికిఁగాను ఖలీఫా తన తరఫున కొందఱు ప్రతినిధులను నియమింపవచ్చును. హజ్రత్ అబూబకరుగారి కాలములో కలెక్టర్లును, గవర్నర్లును, న్యాయాధికారులుగా పనిచేయుచుండిరి. కాని హజ్రత్ ఉమరుగారి కాలములో కలెక్టర్లకు, గవర్నర్లకుపని యెక్కువఆయెను. వారికి న్యాయముచేయుటకు తీఱిక లేకుండెను. కావున హజ్రత్ ఉమరుగారు న్యాయశాఖను ప్రత్యేకముగాఁజేసి దానికిఁగాను ఖాజీ (న్యాయాధికారు)లను నియమించిరి. వారు ఖాజీలను నియమించునపుడు వారి యోగ్యతనుగూర్చి చాల పరిశీలించుచుండిరి. ఖురానును హజ్రత్ పైగంబరులవారి హదీసు (ఉపదేశము)లను బాగుగ నెఱింగి భయభక్తులు న్యాయముగల విద్వాంసులను నియమించుచుండిరి. ఖాజీలు లంచము పుచ్చుకొనక యుండుటకు హజ్రత్ ఉమరుగారు వారికి గొప్ప గొప్ప జీతములు ఒసంగుచుండిరి. తఱచుగ ధనికులను గౌరవముగల పెద్దమనుష్యులను నియమించుచుండిరి. ఇట్లు చేయుటవలన ఖాజీలు ధనాసలేకన్యాయము చేయుదురుగదా! ఒకసారి హజ్రత్ ఉమరుగారు దమష్ఖు యొక్క ఖాజీతో “జగడములు తీర్చుటలో మీరేపద్ధతిని ననుసరించుచున్నారు” అని ప్రశ్నింపఁగా ఖాజీ “మొట్టమొదట నేను ఖురాను గ్రంథములో దానిఁగూర్చి గల ధర్మములను చూచెదను, ఆపిదప హజ్రత్ పైగంబరులవారి యుపదేశములను చూచెదను. అందు స్పష్టముగా దానిఁగూర్చి ధర్మము లేనిచో దానివంటి జగడములలోఁగలతీర్పును యోచింతును.

మఱియు ఇతర విద్వాంసులతో దానిఁగూర్చి చర్చించి వారి సలహాను అనుసరించి తీర్పుచేయుఁదును" అని విన్నవించెను. అపుడు హజ్రత్ ఉమరుగారు "మీాపద్ధతి సరిగానే యున్నది. అయిన మీారు తీర్పుగావించుటకు న్యాయకూటమునందు కూర్చుండు నపుడు దేవునితో ఓ దేవా! నేను జ్ఞానముగలిగి సరియైన ధర్మములు ప్రజలకుఁదెలుపునట్లును, ఖురాను గ్రంథమును పైగంబరులవారి యుపదేశముల ననుసరించి తీర్పు చేయునట్లు నాకు బుద్ధినొసంగుము. ఓ దేవా! నేనుకోపముతో నున్నపుడును, సంతోషముతో నున్నపుడును న్యాయనియమములను మీాఱిపోకుండ నన్ను అనుగ్రహింపుము అని వేఁడుకొనుచుండుఁడు" అని యుపదేశించిరి.

న్యాయాధికారులు వీలైనంత వఱకు వారి [ప్రతివాదుల] మధ్య రాజీకుదుర్చుటకు ప్రయత్నింపవలెను అని హజ్రత్ ఉమరుగారు ఆజ్ఞాపించి యుండిరి. ఖాజీలుచేయు తీర్పువలన జగడములు పోయినను వాది ప్రతివాదుల మనస్సులు కుదురవుగదా! అందులకే రాజీకుదుర్పవలెనని హజ్రత్ ఉమరుగారు ఆజ్ఞాపించుచుండిరి.

ఖాజీలు వాది ప్రతివాదులయందు సమాన భావము గలిగి ఏలాటి పక్షపాతము వహింపఁగూడదు అని చాల కఠినముగా హజ్రత్ ఉమరుగారు శాసించిరి. ఒకసారి హజ్రత్ ఉమరుగారు ప్రతివాదిగా ఖాజీగానున్న జైదుగారి యొద్దకు పోవలసి వచ్చెను. అపుడు జైదుగారు ప్రత్యేకముగా హజ్రత్ ఉమరుగారిని గౌరవింపఁదలఁచిరి. కాని హజ్రత్ ఉమరుగారు చాలకోపపడి అట్లు చేయకూడదు అని యుపదేశించిరి. ప్రతిపట్ట

ణములోను కొందఱు పండితులును విద్వాంసులు నుండుచుం డిరి. చిక్కుగల వ్యాజ్యములను తీర్చుటలో ఖాజీలకు సలహా నొసంగి తోడుపడుచుండిరి. ఇంతవఱకు హజ్రత్ పైగంబరుల వారి యుపదేశములు గ్రంథములలో వ్రాయఁబడలేదు. హజ్రత్ రసూలువారి శిష్యులు అచ్చటచ్చటపోయి పట్టణము లలో నివసించుచుండిరి. ఉపదేశములు వారికిఁదెలిసియుండెను. తెలిసిన ధర్మములు వారు ప్రజలకు బోధించుచుండిరి. అందు వలన ఒకపుడు వేర్వేఱు పట్టణములలోనుండు ఖాజీలతీర్పులు కూడ పలువిధములగ నుండుచుండెను.

మత విద్వాంసులు ఉచితముగా ప్రజలకు మతధర్మ ములు బోధించుట వారి విధిగానుండెను. కావున ప్రజలు విద్యను గ్రహించుటకై దూరదూర దేశములనుండి వచ్చుచుం డిరి. ఆవిధమున అనేకులు విద్యను గ్రహించి మత ధర్మముల ననుసరించుచుండిరి.

న్యాయము తీర్చుట ఖలీఫాయొక్క ముఖ్యవిధిగా నుం డెను. దీని కొఱకు ప్రజలకు ఏలాటిధనము ఖర్చుచేయవలసిన అక్కఱ లేకుండెను. కోర్టులఫీసుగాని, వకీళ్ళఫీసులుగాని చెల్లిం పవలసినట్టి అక్కఱ ప్రజలకు లేకుండెను. న్యాయముపొందుట చాల సుళువుగా నుండెను. సాధారణముగ మసీదులలోనే న్యాయము జరుగుచుండెను. వాది ఏలాటి కష్టములేకుండ నేరుగా న్యాయాధికారి యొద్దకుపోయి తనదావా(వ్యాజ్యము) ప్రవేశపెట్టుచుండెను. ఖాజీ ప్రతివాదిని రప్పించి సాక్షుల సాక్ష్యమునువిని ధర్మప్రకారముగా తీర్పుచేయుచుండెను. ఆతీర్పువిని వాది ప్రతివాదులు దానిని తమంట తామే అను

సరించుచుండిరి. ప్రభుత్వమునకు తన బంటులను నియమించి తీర్పును అమలుపఱుప వలసినట్టి అక్కఱలేకుండెను. అపుడు ప్రజలు న్యాయము, సత్యము దెలిసికొనుటకు న్యాయాధికారి యొద్దకువచ్చి న్యాయము దెలిసిన పిదప దాని ప్రకారము నడచుకొనుచుండిరి. ఇప్పటి కాలములో న్యాయముపొందుటకు ఎన్ని కష్టములకు పాలుపడి ఎంత ధనము ఖర్చుచేయవలసి వచ్చుచున్నదో చదువరులకుఁ దెలిసియే యున్నది.

## —: పోలీసు శాఖ :—

హాజ్రత్ ఉమరుగారు దేశములో శాంతము నెలకొల్పి నేరములు జరుగకుండుటకై పోలీసుశాఖను ప్రత్యేకముగా ఏర్పఱచిరి. వ్యాపారులు కొలఁతలలోను తూనికలలోను మోసముచేయకుండునట్లును జంతువులపై నెక్కువబరువు వేయకుండునట్లును సారాయి బహిరంగముగా అమ్మఁబడకుండుటకును రాజబాటలలో నెవరును కట్టడములు కట్టకుండయుండునట్లును చూచుట పోలీసువారి విధిగానుండెను.

అరేబియా దేశములో ముందు చెఱశాలలు లేకుండెను. హాజ్రత్ ఉమరుగారు మొట్టమొదట చెఱశాలలు నియమించిరి. మక్కాపట్టణములోను ఇతరపట్టణములలో చెఱశాలలుండెను. వారు కొన్ని నేరములుచేసిన వారిని దేశభ్రష్టులుగావించుచుండిరి. మిహాజనెసఖపీ మాటిమాటికి సారాయి త్రాగు నేరములో పట్టుపడుచుండెను. తుదకు ఆతనికి ఆతని జన్మదేశమునుండి వెలివేసి ఒకద్వీపకల్పములో నుండునట్లుగ శిక్షవిధించిరి.

—: రక్షణశాఖ :—

రోమను, ఈరాను రాజ్యములు ఇస్లామ్ ప్రభుత్వములో చేరెను. ఇస్లామ్ప్రభుత్వపు సరిహద్దులు చాలవిశాల మాయెను. శత్రువులదాడి నుండి దేశమును కాపాడి రక్షించుట చాల అవసరమాయెను. అందుకుకావలసిన సైన్యము సరిహద్దుల లోనియమింపవలసి వచ్చెను. సైన్యములను సమకూర్చివానికి దగినవసతులును, నియమములను కల్పింపవలసి వచ్చెను. అందులకు హజ్రత్ ఉమరుగారు దేశములోనున్న వారందఱిని నిర్బంధముగా సైన్యములో చేర్పవలెనని తలఁచిరి. కాని అది వీలుకాదని తలఁచిముందు అందఱు ఖురైషులును అన్సారులును సైనికులుగా కావలెనని విధించి అందఱి నామములను రిజిస్టర్లలో వ్రాయించునట్లు ఏర్పాటుగావించిరి. మఱి వారి వారి యోగ్యతను బట్టి వేతనములు నియమించిరి. మఱి వారి భార్య బిడ్డలకుఁగూడ వేతనములు నియమించిరి. బిడ్డపుట్టగానే వాని ఖర్చులకుఁగాను వేతనము నియమించిరి. అట్లు ప్రతి శిశువు పుట్టఁగానే ప్రభుత్వ సైనికుఁడు అని యేర్పడెను. కొన్నాళ్లపిమ్మట అరబ్బులందఱికిని ఈయేర్పాటే జరిగెను. అందఱి సంఖ్య లెక్కింపఁబడి వారివారికిఁదగిన వేతనములు నియమింపఁబడెను.

ప్రతి సిపాయికి జీతమేకాక భోజనమును దుస్తులును లభించుచుండెను. పదిమంది సిపాయిలపై నొక నాయకు డుండెను. ఆనాయకుల మూలముననే సిపాయిలందఱకు జీత ములులభించుచుండెను. అరబ్బులుకాని యితర ముసల్మానులు సైన్యములో చేరవలసినది అని నిర్బంధము లేకుండెను. వారు

ఇష్టపడినచో సైన్యములో చేరవచ్చును. లేనిచో వారి యిష్టము. ఏలాటి బలాత్కారము లేకుండెను.

హజ్రత్ పైగంబరుల వారి కాలములోను హజ్రత్ అబూబకరుగారి కాలములోను సైనికులకు జీతములు లేకుండెను. అక్కఅవసడినపుడు యుద్ధమునకు రావలసినది అని చాటింపఁబడుచుండెను. శక్తిగలవారు యుద్ధములో పాలుగొను చుండిరి. యుద్ధములో జయముగలిగి విజయధనము లభించి నపుడు ఆధనము యుద్ధములో పాలుగొన్నవారికి పంచఁబడు చుండెను. కాలిబంటులకు ఒక భాగమును, స్వారిబంటులకు మూఁడు భాగములును లభించుచుండెను. కాని హజ్రత్ ఉమరు గారికాలములో పైవిధముగ సైనికులకు నియమముగా జీత ములు నియమింపఁబడెను.

## —: యుద్ధ పద్ధతి :—

ఇస్లామునకు పూర్వము మల్ల యుద్ధము జరుగు చుండెను. రెండు పక్షములవారును ఒక మైదానములో నిలుచు చుండిరి. రెండు పక్షముల నుండి ఒక్కొక్క యుద్ధవీరుఁడు మైదానము లోనికివచ్చి తన తన శౌర్యము చూపుచుండెను. అట్లు కొంతసేపుజరుగుచుండెను. ఆపిదప రెండుపక్షములవారు ఒకరిపై నొకరుపడి యుద్ధము సలుపుచుండిరి. ఒకపుడు వెనుకకు పాఱిపోవుచు మఱొకపుడు ముందుకువచ్చి మారొక్కను చుండిరి.

ఇస్లాములో పై పద్ధతి అనుసరింపఁబడలేదు. సైనికులు పంక్తులలో వరుసగానిలిచి యుద్ధము సలుపుచుండిరి. హజ్రత్ ఖాలిద్ గారి సలహాప్రకారము హజ్రత్ ఉమరుగారి కాల

ములో యుద్ధపద్ధతి యీలాగుండెను:-కొందఱుసైనికులు ముం దుగాపోయి యుద్ధమునకుఁదగిన వసతులు చూచుచుండిరి. మఱి కొందఱు సైన్యమునకు ముందు నిలుచుచుండిరి. కొందఱు సైనికులు మధ్యలోనిలుచుచుండిరి. ఇందుసేనాధిపతి యుండు చుండెను. కుడిప్రక్కనను ఎడమప్రక్కనను కొందఱు సైని కులు నిలుచుచుండిరి. కొందఱుసైనికులు వెనుకనిలుచుచుండిరి. సైన్యమునకుకట్టకడపట సహాయసైన్యముండు చుండెడిది. సైన్యములో కొందఱు నీటివసతులును మేఁత ఏర్పాటులును చేయుచుండిరి. నియమములేని కొందఱు సైనికులుండు చుండిరి. కొంత సైన్యము ఒంటెలపై సవారి చేయునదియును మఱి కొంత సైన్యము గుఱ్ఱములపై సవారి చేయునదియు నుండు చుండెడిది. మఱి కొందఱు కాలిబంటులును మఱి కొందఱు బాణములు వేయువారునుండుచుండిరి. సేనాధిపతులు వరుసగా సైన్యములో ఈలాగుండుచుండిరి:- సైన్యమున కంతటికి నొక సర్వసేనాధిపతి యుండును. వానికిలోఁబడి యొక సేనాధిపతి యుండును. వానితరువాత కుడి యెడ ప్రక్కల యందుండు సేనలపై అధికారులుందురు. వారికి తరువాత చిన్నచిన్న అధి కారులుందురు. ఒకవేయిమంది సిపాయులపై నొక అధికారి యును వందమంది సైనికులపై నొక అధికారియునుండును. ప్రతి శాఖకుచేరిన వారిపై నొక్కొక్క నాయకుడుండును. ఈ అధి కారులేకాక సైన్యమువెంట, ఖజానాధికారి, వైద్యులు, ఖాజీలు, బోధకులు, పరిచారకులు, గూఢచారులు ద్విభా షలు, లేఖకులుండుదురు.

—: ఆయుధములు :—

హజ్రత్ ఉమరుగారి కాలమునందు యుద్ధమునకు కావలసిన ఆయుధములలో చాల వృద్ధిగలిగెను. పూర్వము అరబ్బులు ఖడ్గములతోను బల్లెములతోను, బాణములతోనుయుద్ధము సలుపుచుండిరి. ఈఆయుధములుకూడ అంత బాగుగా లేకుండెను. ఖాదసి యాయుద్ధములో ఈరానీయులు ముసల్మానుల బాణములనుచూచి ఇవి రాట్నపుకదుళ్లుఅని పలికియుండిరి గదా! కానిరోమనులును ఈరానీయులునుయుద్ధములలోమంచి ఆయుధములనుపయోగించుచుండిరి. ముసల్మానులు కూడ అట్టి ఆయుధములను ఉపయోగింపసాగిరి. కావున ముసల్మానులు దమస్కు యుద్ధములో రాళ్లను విసరివేయునట్టి సాధమునమును, కోట గోడలపై నెక్కు త్రాటినిచ్చెనలను చెక్కతో చేసిన టాంకులను ప్రయోగించిరి. ఆయాకాలమునకుఁదగిన ఆయుధములు ప్రయోగించుటయే యుక్తముగదా!

—: యుద్ధ మండలినేర్పు :—

అరబ్బులు పూర్వము నుండియు చాల యుద్ధప్రియులు. కాని ఇస్లామునకు పూర్వము వారి బలమంతయు పరస్పరము జగడములును హత్యలును గావించుటలో వృథాపోవుచుండెను. ఇస్లామువలన వారిమధ్య ఐక్యమతమును, సోదర భావమును గలిగెను. మఱి పరలోక జీవితమునకు పాటుపడవలెనను ముఖ్యాంసము ఇస్లాము బోధించెను. ఈ యుద్దేశముతో ముసల్మానులు పరదేశములకుఁబోసాగిరి. అట్టి సమయమున హజ్రత్ ఉమరు వంటివారి నాయకత్వము వారికి లభించెను. లభింపవలసిన ఫలితము ముసల్మానులకు లభించెను. రోమను,

ఈరానువంటి గొప్ప రాజ్యములను మార్కొని గొప్ప విజయ ములు ముసల్మానులు గాంచిరి. అందు ముసల్మానులు తమ గొప్ప యుద్ధ సామర్థ్యమును నేర్పును శూరత్వమును చూపిరి. దీనికి ఉదాహరణము ఏచరిత్రములో కూడను దొరకనేఱదు. ఈసందర్భమున కొన్నిముఖ్యవిషయము లిందు వ్రాయుదుము.

మొట్టమొదట ముసల్మానులు తమ దేశమునకుచుట్టు పట్లనున్న ప్రాంతములపై దండెత్తి పోవుచుండిరి. దైవికముగ ఒకవేళ అపజయము గలిగినచో తత్క్షణము సురక్షితముగా తమదేశములో ప్రవేశింపవచ్చును. శత్రువు వెంబడించి వచ్చు టకు సాహసింపఁడు అను భావముతో అట్లు చేయుచుండిరి. యుద్ధప్రారంభము కాఁగానే శత్రువుభీతిల్లునట్లుగ గొప్ప శౌర్య ముతో యుద్ధము సలుపుచుండిరి. శత్రువులు యుద్ధరంగములో నిలువలేక వెనుకంజవేసి పోవును. దానికి యర్మూకు, ఖాది సియా యుద్ధములే సాక్షులు. ఈయుద్ధమునందలి జయములే సిరియా, పారసీక దేశములు ముసల్మానులకు లోఁబడునట్లు చేసినవి.

ముసల్మానులు శత్రువుల దేశముపై దండెత్తి పోవు నపుడు తమ వెనుక ఒక సహాయసైన్యము నియమించి సమ యము పడినపుడు వెనుకకు మరలిపోవుటకు మార్గముండు నట్లు ఏర్పాటులు చేయుదురు. శత్రువు తమ వెనుకనుండివచ్చి పైఁబడునట్లు అవకాశము లేకుండ ఏర్పాటులు చేయుదురు. ఇట్టి యేర్పాటులుచేసియే యర్మూకు యుద్ధముసలుపఁబడెను.

శత్రువుల పురమును ముట్టడించునపుడు శత్రువులకు బయటినుండి యేలాటిసహాయము రాకుండ చేయుదురు. పుర

ములోపల నున్న శత్రువుకును ఇతరపురముల వారి కేలాటి సం బంధము లేకుండ చేయుదురు. అబూఉబై దాగారు దమష్కును జయించినపుడు దానికిచుట్టు పట్లనున్న ఫహాలు, హిమ్సును, ఫాల స్తీన పట్టణముల మార్గములందు సైన్యములను నియ మించిరి.

ముసల్మానులు జయించిన దేశముపై శత్రువులు దండెత్తివచ్చెదరు అను భీతియున్నచో ముసల్మానులు తమ బలమంతయు ఒకచోటికి సమకూర్చరు. సరిహద్దులందు అచ్చ టచ్చ ముఖ్యస్థానములందు శత్రువును మార్కొనుటకు సైన్య ములు నియమింతురు. కావున ఇరాకు దేశమునందు అటులే చేయఁబడెను.

శత్రువులను జయించుటకెట్టి మంచి అవకాశము దొర కినను దానిని బోఁగొట్టరు. దాని వలన లాభముపొందుటకు ప్రియత్నింతురు. కావున దమస్కును జయించుటలో ఖాలిద్ బిన్ వలీదుగారు చూపిన ధైర్యసాసహములు ముందు వ్రాసి యున్నాము. శత్రువులను జయించుటకు కావలసిన యత్న ములు చేయుదురు. కావున ఆమరుబిన్ ఆసుగారు రాయబారి వేషము ధరించి అర్తబూను సైన్యములోఁబోయి కావలసిన విషయములు దెలిసికొనివచ్చిరి. లాజఖియాను జయించినపుడు ఉబాదాబిన్ సామితుగారు తమ సైన్యమును అగడ్తలోదాఁచి పెట్టి పాఱిపోయినట్లు నటించి శత్రువు భ్రమపడు నట్లుచేసి దానిని జయించిరి.

ముసల్మానులు, శత్రువులు గావించు ప్రతి ప్రయత్న మును దెలిసికొనుటకు చాల శ్రద్ధవహింతురు. దానికిఁగావల

సిన యేర్పాటులు గావింతురు. అవసరముపడి నపుడు దేశ మంతటనున్న ముసల్మానుల సమస్త సైన్యములును ఒక మిషీనువలెపనిచేయును. కావున హిర్ఖలురాజు ముసల్మానుల పై దండెత్తుటకు నుద్దేశించినపుడు తత్క్షణమే ఒక వైపునుండి సిరియాలోనున్న ముసల్మానుల సైన్యమును మఱొక వైపునుండి ఇరాకులోన్ను ముసల్మానుల సైన్యమును బయలు దేఱి హిర్ఖలురాజు పన్నినకుట్రను నిష్ఫలముగావించినది. ముసల్మానులు శత్రువును ఒకేచోటనిలిచి మార్కొ్కనరు. పలుచోట్ల యుద్ధమునకు సిద్ధమగుదురు. దాని వలనశత్రుబలము ఒకేచోట నుండక చీలిపోయి అనేకస్థలములకు పోవలసి వచ్చును. శత్రువులబలము తగ్గిపోవును. శత్రువులు పరస్పరము సహాయము పొందలేక పోవుదురు. కావున హిర్ఖలురాజు హిమ్మసుపై దండెత్తినపుడు జజీరావారితో సహాయముకోరెను. తత్క్షణమే ఇరాకులో నున్న ముసల్మానులసైన్యము జజీరాపై దండెత్తెను. అందుచే జజీరావారు హిర్ఖలునకు సహాయము చేయలేక పోయిరి.

ముసల్మానులు శత్రువులబలమును తెంపుటకు ప్రయత్నింతురు. శత్రువుల మనుష్యులనే గూఢచారులుగా నియమించి కాలవసిన విషయములు దెలిసికొనుదురు. కావున తక్రీతు మూసలు యుద్ధములో ఈరానీయులకు విరోధముగ అచ్చటి క్రైస్తవ అరబ్బులను తమ వైపునజేసికొని ముసల్మానులు జయముగాంచిరి. తస్తరుపట్టణము కూడ ఒక ఈరానీ గావించిన యత్నమువలననే జయింపఁబడెను. దానిఁగూర్చి ముందు వ్రాసియున్నాము.

—: అర్థికశాఖ :—

హజ్రత్ పైగంబరులవారి కాలమందును, హజ్రత్ అబూబకరుగారి కాలమందును వచ్చురాఁబడిని అప్పటప్పటికి ప్రజలకును అక్కఱగలవారికి పంచఁబడుచుండెను. కాని హజ్రత్ ఉమరుగారి కాలములో రాఁబడి చాల హెచ్చెను. ప్రభుత్వము చాలవ్యాపించెను. కావున రాఁబడినినిలువఁబెట్టుటకు ఆర్థిక శాఖ నియమింపఁబడి సర్కారు ఖజానా ఏర్పాటు చేయఁబడెను. హిజ్రీ 15వ సంవత్సరము బహరైనునుండి ఐదు లక్షలు దిర్హములు వచ్చెను. దానిని ఖర్చుచేయుటను గూర్చి సలహా పుచ్చుకొనుటకు హజ్రత్ ఉమరుగారు సభగావించిరి. ప్రభుత్వపురాఁబడిని నిలువఁబెట్టి అక్కఱపడినపుడెల్ల ఖర్చు చేయవలెను. రాఁబడిఖర్చుల లెక్కకుఁగాను రిజస్టర్లు ఏర్పాటు చేయవలెను. పైకము పుచ్చుకొనువారి పేర్లరికార్డు ఉండవలెను. వానికిఁగాను ఖజానాధికార్లు నియమింపఁబడవలెను. మదీనపురములో దాని ప్రధానాధికారియును ఆఫీసునుండవలెను అని తీర్మానింపఁబడెను. ప్రభుత్వమునందలి ముఖ్య పట్టణములలో కూడ ఆర్థిక శాఖలు నియమింపఁబడెను. ఆయా పురముల వారి సౌకర్యమునకుఁగాను ఆయా దేశభాషలలో రికార్డు ఉండునట్లు ఏర్పాట్లుజరిగెను. పూర్వమునుండి పని చేయుచుండినవారే ఆఉద్యమములో నియమింపఁబడిరి.

—: రాఁబడి వివరములు :—

ముసల్మానులనుండియు ముసల్మానులు కాని వారినుండియు ప్రభుత్వమునకు రాఁబడి గలుగుచుండెను. ముసల్మానులు కానివారికిసంభంధించిన రాఁబడివివరము ఈలాగున్నది:-

ఖరాజుపన్ను:— ముసల్మానులు యుద్ధముచేసి జయించిన దేశములోని భూములను అచ్చటి నివాసులకే యొసంగఁబడెను. ఆభూములలోఁ గలుగు పైరుపంటలకుఁ దగినట్లు కొంతపన్ను విధింపఁబడెను. దాఁదాపు, గోధుమలు పండు భూములపై ఒక యెకరమునకు ఒక్కరూపాయిపన్ను సంవత్సరమునకుఁగాను విధింపబఁడెను. ఇతరపంటలుపండు భూమిపై ఎకరమునకు ఎనిమిది అణాలు మాత్రము విధింపఁబడెను. ఖర్జూరపుపండ్లకు పన్ను లేకుండెను. ఇరాకునుండి 2½ కోట్ల రూపాయలుపన్ను వసూలు అగుచుండెను. తిరుగుబాటుచేసి పాఱిపోయిన విప్లవకార్ల భూములు ప్రభుత్వ ఆధీనములోనుండెను. దాని ఆదాయము 17 లక్షలు రూపాయలు గలుగుచుండెను. ఈ పైకము ప్రజల సౌకర్యములకు ఖర్చుచేయఁబడుచుండెను.

(2) జిజ్యాపన్ను:- ముసల్మానులు జయించిన దేశములలోనున్న ప్రజలు ఇస్లాములో చేరనిచో వారిని జిమ్మీ అనుదురు. జిమ్మీ అనఁగా ఒకరి రక్షణలోనుండు వారలు. జిమ్మీల ధనము ప్రాణము, మానము కాపాడుట ఇస్లాము ప్రభుత్వముయొక్క విధిఅగును. ఆరక్షణకు బదులుగ సంవత్సరమునకు కొంత పన్ను జిమ్మీ రైతులు ఇయ్యవలసి వచ్చును. దీనినే జిజ్యాపన్ను అనుదురు. ఆపన్ను సైన్యములోచేర శక్తిగలిగియు చేరనివారినుండి సైన్యసేవకుబదులుగ పుచ్చుకొనఁబడును. కావున ఇరువదియేండ్ల వయస్సునుండి ఏఁబదియేండ్ల వఱకు వయస్సు గలిగిన పురుషులనుండియే జిజ్యాపన్ను వసూలు చేయఁబడును. ముదసలివారి నుండియు

బాలురనుండియు స్త్రీలనుండియు, కుంటి గుడ్డి మొదలగు అంగహీనుల నుండియు జిజ్యాపన్ను వసూలు చేయఁబడదు. సైన్యసేవకుఁ దగినవారుకూడ నిరుపేదలైనచో వారినుండి జిజ్యాపన్ను గ్రహింపఁబడదు. జిమ్మీరైతులలో నెవరైన స్వాయముగా సైన్యసేవఁ జేయఁదలఁచినచో వారినుండికూడ జిజ్యాపన్ను గ్రహింపఁబడదు. కావున ముసల్మానులు అర్మీనియాను జయించినపుడు అచ్చటి వారలు మేము సైన్యసేవ చేయుదుము. జిజ్యాపన్ను ఇయ్యము అని సంధి చేసికొనిరి. దానిఁగూర్చి ముందు వ్రాసియున్నాము.

ఒకవేళ ముసల్మానులు ఏదైన కారణముచే జిమ్మీరైతులను శత్రువులనుండి రక్షింపలేక పోయినచో ముసల్మానులు జిమ్మీలనుండి జిజ్యాపన్ను తీసికొనరు. తీసికొని యుండిన పక్షమునతిరిగి యిచ్చివేయుదురు. దానిఁబట్టియే హజ్రత్ ఉమరుగారి కాలములో యుద్ధకారణముల వలన ముసల్మానులు హిమ్మ్సును వదలిపోవు నపుడు జిమ్మీరైతులనుండి వసూలు చేసియున్న జిజ్యాపన్ను తిరిగి రైతులకిచ్చివేసిరి.

విజయధనము:-యుద్ధములలో ముసల్మానులకులభించు ధనము గనీమత్ (విజయధనము) అనఁబడును. విజయ ధనములో అయిదింట నొకభాగము సర్కారు ఖజానాలో చేర్పఁబడుచుండెను. మిగత నాలుగు భాగములు యుద్ధవీరుల మధ్య పంచఁబడు చుండెను.

ముసల్మాలకు సంబంధించిన పన్నులు ఈలాగున్నవి:-

జకాతు:- ముసల్మానుల ధనములోను వ్యాపారములోను, పశువులలోను నలుబదింట నొకభాగము పన్ను ప్రతి

సంవత్సరము వసూలు చేయఁబడును. దీని నే జకాతుఅనుదురు. దీని వివరము ఫిఖా గ్రంథములలోఁ గలదు. (మేము వ్రాసి ప్రకటించిన జగత్ ప్రపత్తులోను, అహ్కాముల్ ఇస్లాము లోను గలదు.)

ఉష్ర్: ముసల్మానుల భూములపై పన్నులు విధించుటకు బదులుగా అందు గలుగు పైరులో పదింట నొక భాగము ప్రభుత్వము తీసికొనును. దీనిని ఉష్ర్ అనుదురు. ఇది ప్రతి పంటకుఁ దీసికొనఁబడును.

సదఖాత్ :- ప్రతి రమజాను పండుగ దినమున ముస ల్మానులు కొంత ధనము ఒసంగవలెను. దీనిని సదఖయేఫితర్ అనుదురు. ముసల్మానులు ప్రతి సంవత్సరము బకరీదు పండుగ నాఁడు ఖుర్బానీచేయుదురు. పాపపరిహారములకుఁగాను కొంత ధనము ఖర్చుచేయుదురు. దాని వివరము ఫిఖాగ్రంథములోఁ గలదు. అక్కఱ పడినపుడు ముసల్మానులు గొప్పగొప్ప చందాలు ఒసంగి ప్రభుత్వ కార్యములకు తోడుపడుదురు. ప్రభుత్వమునకు పైని వివరింపఁబడిన ఆదాయమేగాక పరదేశస్థులు ఇస్లామ్ రాజ్యములో వ్యాపారసామగ్రి దెచ్చినచో దానిపై కొంతపన్ను విధింపఁబడుచుండెను. ముసల్మానుల వ్యాపారులు పన్ను ఇతర దేశములకు పోయినచో నెంత ఆదేశము లోని ప్రభుత్వము ముసల్మానులనుండి తీసికొనుచుండెనో అంతయే ఇస్లామ్ ప్రభుత్వము తీసికొనుచుండెను. రెండువందల దిరహములకంటె తక్కువ విలువగలసామగ్రి యున్నచో దానిపన్ను తీసికొనఁబడదు. సంవత్సరములో నొకసారి మాత్రము పన్ను తీసికొనఁబడును.

## —: పన్నువసూలు చేయుటలో జాగరూకత: —

పన్నుల పట్టికను గమనించి చూచినచో ఇస్లామ్ ప్రభుత్వములో ముసల్మానులు కానట్టివారికంటె నెక్కువగా ముసల్మానులే ప్రభుత్వమునకు పన్ను చెల్లింపవలసియున్నది. జిమ్మీరైతులనుండి పన్నువసూలు చేయునపుడు చాల న్యాయముపాటించి కొంచెమైనను బలాత్కారము చేయఁగూడదని హజ్రత్ ఉమరుగారు అధికారులకు కఠినముగా నుత్తరువుగావించి యుండిరి. ఇరాకునుండి పన్నువసూలు అయి మదీనాపురమునకు తేఁబడునప్పుడు కూఫా, బస్రాపురముల నుండి పదిపదిమంది పెద్దనాయకులను రప్పించివారితో శపథముగైకొని పన్నువసూలు చేయుటలో రైతులపై నేలాటి అన్యాయము జరిగినదా అని ప్రశ్నింతురు. అపుడు వారందఱు పన్నున్యాయముగానే వసూలుచేయఁబడినది. ఏలాటిఅన్యాయము జరుగలేదు అని శపథముచేసి సాక్ష్యమిత్తురు. హజ్రత్ ఉమరుగారు పరలోకముచేరుటకు నాలుగుదినముల ముందు, హుజైఫాగారితోను ఉస్మానుబిన్ హనీఫ్‌గారితోనుఓయయ్యా! మీరు ఇరాకులో పన్నుఏవిధముగా వసూలుచేయుచున్నారు నియమింపఁబడిన దానికంటె నెక్కువవసూలు చేయుచున్నారేమోఅని నాకు భయముగలదు అని చింతతో పలుకఁగా "ఓమహానుభావా! అట్లు కానేరదు" అని వారిద్దఱు విన్నవించిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు "నేను బ్రతికియున్నచో ఇరాకుదేశములోనున్న విధవస్త్రీలందఱును సురక్షితముగా తమజీవితము గడపునట్లు ఏర్పాటులు చేయుదును" అని పలికిరి.

కానిదీనికి నాలుగుదినముల పిమ్మట దైవవశమున వారు వధింపఁబడి పరలోకముచేరిరి.

—: మతసేవ :—

మతసేవలో చాల ముఖ్యమైనది మత ప్రచారము. దానిఁగూర్చి హజ్రత్ ఉమరుగారు చాలశ్రద్ధ వహించి పాటు పడుచుండిరి. కత్తిబలముతో నెవరినికూడ ఇస్లామ్‌మతములో చేరునట్లు చేయలేదు. కాని మతబోధచేయుచు తమ సుగుణముల మూలమున ప్రజలు ఇస్లామ్‌లోచేరునట్లు చేయుచుండిరి. వారు తమయొద్ద నున్న బానిసను ఇస్లామును గూర్చి చాల బోధచేసి ప్రోత్సాహపఱచిరి. కాని అతఁడు ఇస్లాములో చేర లేదు. అపుడు వారు లా-ఇక్రాహ-ఫిద్‌దీన్ (ఇస్లామును స్వీకరించుటలో నేలాటి బలాత్కారము లేదు.) అని పలికి ఊరకుండిరి. యుద్ధమునకు ముందు ఇతరమతస్థులకు ఇస్లాము లోగల మేళ్లను దాని మహిమములను తెలుపవలెను అని అధికారులకు వారు ఉత్తరువుచేసి యుండిరి. మఱియుఅండఱు ముసల్మానులకును సుగుణములను గూర్చి హజ్రత్ ఉమరుగారు చాలశిక్షణ ఒసంగి యుండిరి. దానిబట్టి ముసల్మానులు గొప్ప సుగుణములు గలిగియుండిరి. ఇతర మతస్థులు ముసల్మానుల సుగుణములను వారి భక్తినిచూచి తమంతటతామే ఇస్లాములో చేరుచుండిరి. ఒకసారి రోమనుల రాయబారి ముసల్మానుల సేనాధిపతి యొద్దకువచ్చెను. ఆరాయబారి సేనాధిపతి యందున్న సుగుణములను భక్తిని, సాధారణత్వమును చూచి ఇస్లామ్ మతములోనున్న మహిమలను గ్రహించి ఇస్లామును స్వీకరించెను. ఈజిప్టులోనున్న ఒక జమీందారుఁడు ముసల్మా

నుల విషయములనువిని ఇస్లామునుగూర్చి చాలభక్తి వహిం చెను. తుదకు రెండువేలమంది జనులతోఁబాటు తానుకూడ ఇస్లాములోచేరెను. సిరియా, ఇరాకు దేశములలో పూర్వము నుండి అరబ్బుల కుటుంబములవారు నివసించుచుండిరి. హజ్రత్ ఉమరుగారు వారియందు మతప్రచారము చేయుటకు చాల శ్రద్ధవహించిరి. దేవునిఅనుగ్రహమువలన, అనేకులు చాల సుళువుగానే ఇస్లాములోచేరిరి. అనేకులు ముసల్మానుల విజయ ములను చూచిచాలఆశ్చర్యపడుచు ఇస్లాములో సత్యముగలదు అని నిశ్చయింపసాగిరి. కావుననే ఖాదిసియా యుద్ధసమయ ములో నాలుగువేల మంది సైనికులుమనః పూర్వకముగా ఇస్లాములోచేరిరి. అటులే జలోలాజయింపఁబడిన పిమ్మట అనే కులు జమీందారులు, గొప్పగొప్ప అధికారులు మనఃపూర్వ కముగా ఇస్లామును స్వీకరించిరి. ఇరాకులో ప్రజలు ఇస్లా ములో చేరినట్లు సిరియా ఈజిప్టుదేశముల వారలుకూడ అనే కులు స్వయముగానే ఇస్లామును స్వీకరించిరి. క్రొత్తగా ఇస్లా ములోచేరిన వారికొఱకు ఫుస్తాతుపురములో ఒక గొప్పవీధి నిర్మింపఁబడెను. హజ్రత్ ఉమరుగారి కాలములో ఇస్లాము మతము చాల వ్యాపించెను. వారు దానిప్రచారమునకుఁగాను చాల సౌకర్యములు కల్పించిరి. అందు విద్యాసేవ విద్యా ప్రచారము చాల ముఖ్యమైనది. మత విద్యను వ్యాపింపఁ జేయుటలో వారు చాల పాటుపడిరి. హజ్రత్ అబూబకరు గారి కాలములో హజ్రత్ ఉమరుగారి ప్రోత్సాహము వల ననే ఖురానెషరీఫ్ ఒకచోట చేర్పఁబడి యొక గ్రంథముగా నేర్పడెను. (దానిగూర్చి ముందు వ్రాసియున్నాము.) ఆపిదప

హాజ్రత్ ఉమరుగారు తమకాలములో ప్రజలకు ఖురాను గ్రంథము నేర్పుటకు ఏర్పాటులుచేసిరి. ఉపాధ్యాయులకును, ఖురాను గ్రంథము కంఠపాఠము చేయువారికిని, మసీదులలో నమాజుచేయించు ఇమాములకును, నమాజుకొఱకు పిలుచుము అజ్జినులకును వేతనములు నియమించిరి. హాజ్రత్ ఉమరుగారు సిరియాలో ప్రజలకు ఖురానుగ్రంథము నేర్పుటకుగాను హాజ్రత్ ఉబాదాగారిని, హజ్రత్ మఆజుగారిని హాజ్రత్ అబూదర్దాగారిని నియమించిరి. హజ్రత్ ఉమరుగారి ప్రయత్నములవలన ఖురాను విద్య దేశమంతటను వ్యాపించెను. అనేకులు గొప్పగొప్ప పండితులును హాఫిజులును కాఁగలిగిరి. ఖురానెషరీఫును నేర్పు ఉపాధ్యాయులకే కాక విద్యార్థులకుఁ గూడ హజ్రత్ ఉమరుగారు వేతనములు నియమించిరి. దాని వలన వందలకొలఁది విద్యార్థులు ఖురానేషరీఫును నేర్చుకొనుటకు సిద్ధమైరి. దానివలన మసీదులును, పాఠశాలలును విద్యార్థులతో నిండిపోయెను. దిమష్ఖులోనున్న ఒక్క జుమా మసీదులోనే పదునారువందలమంది విద్యార్థులు ఖురానును నేర్చుకొనుచుండిరి. ఇఁక దేశమంతటనున్న మసీదులలోను పాఠశాలలోను ఎందఱు విద్యాభ్యాసము చేయుచుండిరో చదువరులే యూహింపవలెను.

—: హదీసుసేవ: —

ఖురానెషరీఫునకు తరువాత హదీసులు (హజ్రత్ పైగంబరులవారి యుపదేశములు) ఇస్లామ్ మత ధర్మములకు ముఖ్యాధారములు. హజ్రత్ పైగంబరులవారి శిష్యులు హదీసులనువిని గ్రహించి కంఠపాఠము చేయుచుండిరి. హాజ్రత్

రసూలువారి పిమ్మట వారిశిష్యులు ప్రజలకు హదీసులను ఉప దేశింపసాగిరి. హజ్రత్ ఉమరుగారు హజ్రత్ రసూలువారి యుపదేశములను వ్రాయించి దేశములోనున్న ముఖ్యపట్టణములకుపంపి వానిని ప్రచారముచేసిరి. దానిగూర్చి గొప్ప గొప్ప పండితులను నియమించిరి. కావున సిరియా, ఇరాఖు, బసారిపురములలో గొప్పగొప్ప పాఠశాలలు ఏర్పడెను. క్రొత్తగా ఇస్లాములోచేరినవారు మహాభక్తితో ఖురానుగ్రంథము ను హదీసును నేర్చుకొనుటలో చాల శ్రద్ధవహించిరి. ముసల్మానులు ఒక్కొక్క హదీసును నేర్చుకొనుటకు వందలకొలంది మైళ్ళదూరము ప్రయాణము చేయుచుండిరి. తుదకు హదీసులు గొప్పగొప్ప గ్రంథములలో వ్రాయఁబడెను. ఇప్పటికిని బుఖారీషరీఫు ముస్లిమ్షరీఫు మొదలగు హదీసు గ్రంథములు ముసల్మానులుపఠించి యందలి ధర్మములను అనుసరించుచున్నారు.

## —: విద్యాపరిశోధనము: —

హజ్రత్ ఉమరుగారు హదీసుల విషయము చాల శ్రద్ధ వహించి యుండిరి. ఎవరైన ఒక హదీసు వారికి తెలిపినచో దానిగూర్చి పరిశోధింతురు. ఒకపుడు దానిగూర్చి సాక్ష్యమూలమున రుజువు చేయవలెను ఆజ్ఞాపింతురు. ఒకసారి హజ్రత్ ఉమరుగారు తమయింటిలో నేదోఒకపనిలో నిమగ్నులై యుండిరి. అబూమూసా అష్అరీగారువచ్చి మూఁడుసార్లు సలాముచేసి జవాబురానందున మరలిపోయిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు తమపనిని పూర్తిచేసిన పిమ్మట అబూమూసా అష్అరీగారినిరప్పించిమీరెందులకు మరలిపోయితిరి అనిప్రశ్నింపగా "మూఁడుసార్లు సలాము చేసి సెలవు అడుగవలెను. ఇంటి

వారు సెలవిచ్చినచో నింటిలోపోవలెను. లేనిచో మరలిపోవలెను అని హజ్రిత్ రసూలువారు ఉపదేశించియున్నారు. కావున దానిననుసరించి నేనట్లు చేసితిని" అని అబూమూసాగారు విన్నవించిరి. అపుడు "ఇట్లు హజ్రిత్ రసూలువారు ఉపదేశించియున్నారు. అని రుజువుచేయవలెను. లేనిచో మిమ్ము శిక్షింతును" అని పలికిరి. అపుడు అబూమూసాగారు సఈదుగారిని పిలుచుకొనివచ్చి దానిగూర్చి సాక్ష్యమిప్పించిరి. సఈదుగారి సాక్ష్యమువిని హజ్రిత్ ఉమరుగారు సమ్మతించిరి. అట్లు పరిశోధన చేయనిచో ప్రజలు తమయిష్టముచొప్పున హదీసులు కల్పింతురుగదా! హజ్రిత్ ఉమరుగారి పరిశోధనవలన ప్రజలు హదీసుల విషయము చాల జాగరూకత వహించి యుండిరి.

—: ఫిఖాసేవ :—

ఖురానెషరీఫునుండియు హదీసులనుండియు వివరముగా ధర్మములను గ్రహించుట ఫిఖాఅనఁబడును. దానిగూర్చి కూడ హజ్రిత్ ఉమరుగారు చాల శ్రద్ధవహించిరి. ప్రజల సమక్షమున ఉపన్యాసమిచ్చునపుడు ధర్మములను ప్రజలకు నుపదేశింతురు. చిక్కుగల ధర్మములలో గొప్పగొప్ప పండితు (సహాబా)లను సమావేశపఱచి చర్చించి ఏకగ్రీవముగా తీర్మానింపఁబడిన ధర్మములను అమలు పఱతురు. మతధర్మములను ప్రజలకుఁ దెల్పుటకు గొప్పగొప్ప పండితులను నియమించి వారికిఁగాను గొప్పగొప్ప వేతనములు ఒసంగుచుండిరి.

—: సాహిత్యసేవ :—

ఇస్లామునకు పూర్వము అరబ్బులు అరబీసాహిత్యము

నందు చాల సామర్థ్యముగలిగి యుండిరి. ఆకాలములో గొప్ప గొప్ప కవులుండిరి. అరబీభాషలో ననేకులు సహజ కవులుండిరి. హజ్రత్ ఉమరుగారు, అరబీభాషను, కవిత్వమును నేర్చుకొనవలెను ప్రజలకు చాల ప్రోత్సాహ పఱచుచుండిరి. అరబీ భాష, కవిత్వము దెలిసినవారే ఖురానును ప్రజలకు నేర్పవలెను. ఇతరులు నేర్పకూడదు అని విధించిరి. హజ్రత్ ఉమరుగారు తమ ప్రభుత్వకాలములో విద్యయొక్క అన్ని శాఖలలో చాల శ్రద్ధవహించి విద్యాభివృద్ధికి చాల పాటుపడిరి. విద్యావ్యాప్తి వలననేగదా ప్రజల మూర్ఖత్వమునసించి దేశాభివృద్ధిగలిగి ప్రజలు మానవులుగా తమజీవయాత్ర గడుపుదురు. లేనిచో పశుప్రాయు లగుదురుగదా?

—: గృహనిర్మాణము :—

హజ్రత్ ఉమరుగారి కాలములో గొప్పగొప్ప మసీదులును, సైనికుల నివాసముకొఱకు గృహములును, కోటలును, కొత్తపురములును, జనుల సౌకర్యముకొఱకు రోడ్డులును, నీటికాలువలును, వంతెనలును, బావులును, మేంత పొలములును, ప్రభుత్వకార్యముల కొఱకు గృహములును నిర్మింపఁబడెను. దాని వివరము ఈలాగున్నది:- హజ్రత్ ఉమరుగారి కాలములో జయింపబఁడిన పట్టణము లన్నిటిలోను జుమామసీదులు నిర్మింపఁబడెను. అట్లు దాఁదాపు నాలుగు వేల మసీదులు కట్టఁబడెను. ముసల్మానులసంఖ్య దినదినము హెచ్చుగుచుండెను. కావున హజ్రత్ ఉమరుగారు కాబామసీదునకు చుట్టుపట్లనున్న యిండ్లను వెలకు తీసుకొని మసీదును చాల విశాలముగాఁజేసిరి. అటులే మదీనాలో హజ్రత్

పైగంబరులవారు తమ దివ్యహస్తములతో కట్టిన మసీదును హజ్రత్ ఉమరుగారు చాల విశాలముగాఁజేసి పలుపులు వేయించి దీపముల ఏర్పాటులు గావించిరి.

హజ్రత్ ఉమరుగారి కాలములో సైనికులకొఱకు కూఫా, బసరా, ఫుస్తాతు, జీజా, మూసలుఅను క్రొత్తపుర ములు నిర్మింపఁబడెను. దాని వివరము ముఁదువ్రాసియు న్నాము. సైన్యముల స్థావరములో కోటలు సైనికుల గృహ ములు కట్టఁబడెను. పర్గణాల ముఖ్యపట్టణములలో ప్రభుత్వా లయము (గర్నమెంటు వశాసులును) దీవాన్ కచ్చేరి (సెక్రి టేరేట్ లును) సర్కారు ఖజానా నిలయములును పెద్దచెఱశాల లును నిర్మింపబఁడెను.

హజ్రత్ ఉమరుగారు ప్రజల సౌకర్యముల కొఱకు చాల పాటుపడుచుండిరి. కావున పెద్దపెద్ద రోడ్లును, కాలువ లును, బావులును వంతెనలును, మేఁతపాలములును, అధి తులవసతి కొఱకు గృహములును, నిర్మింపఁబడెను. హజ్రత్ ఉమరుగారు త్రవ్వించిన కాలువలలో నహరెమూఖల్, నహ రెఅబీమూసా, నహరెసాదు, నహరెఅమీరుల్ మూమినీన్, చాల ముఖ్యములైనవి. నైలునదినుండి ఫుస్తాతుపురము మీఁ దుగా 69 మైళ్ళ పొడవు కాలువత్రవ్వించి దాని నెఱ్ఱసము ద్రములో కలిపిరి. దానినే నహరెఅమీరుల్ మూమినీన్ అనుదురు. అది చాల వెడల్పుగానుండెను. అందు పెద్దపెద్ద యోడలు సుళువుగా పోవుచుండునవి.

—: నాణెములు :—

ఇస్లామునకు పూర్వము అరేబియా దేశములో పార

సీకలుల, రోమనుల నాణెములు చెల్లుచుండెను. అరబ్బుల నాణెములు లేకుండెను. హజ్రత్ ఉమరుగారు, హి॥శ॥ 18 వ యేట ఇస్లామ్ నాణెములు చేయించిరి, దిరహము (పావులా)లు తయారుచేయించి దేశములో చలామణిచేయించిరి. అందు కొన్ని నాణెములపై అరబీ అక్షరములలో అల్‌హమ్దులిల్లాహి, అనియు మఱికొన్నిటిపై లాఇలాహ ఇల్‌ల్లాహు అనియు మఱి కొన్నిటిపై మహమ్మద్ రసూలుల్లాహ్ అనియు ముద్రించిరి. హజ్రత్ ఉస్మానుగారి ప్రభుత్వకాలములో నాణెములపై అల్లాహుఅక్బర్ అని ముద్రింపఁబడెను.

—: టపాలశాఖ :—

ఇస్లామ్‌లో మొట్టమొదట హజ్రత్ ఉమరుగారు జాబులు రవానాచేయుటకు ఏర్పాటుచేసి దానికొఱకు నొకఅధికారిని నియమించిరి. ఒకపురమునుండి మఱొకపురమునకు లేఖలు తీసికొని పోవుటకు మంచియేర్పాటులు చేసిరి.

—: హిజ్రీశకము :—

అరబ్బులలో ఇస్లామునకు పూర్వము గొప్ప గొప్ప విషయములు సంభవించిన దినమునుండి శకముఏర్పడి యుండెను. మొట్టమొదట కాబుబిన్‌లూాయీ చనిపోయిన దినము నుండి శకముప్రారంభమాయెను. ఆపిదప ఏనుఁగుల సైన్యము కాబామసీదుపై దాడివెడలివచ్చిన సంవత్సరమునుండి ఆమ్ముల్ ఫీల్ (ఏనుగులశకము) ఏర్పడెను. అటుపిమ్మట అరబ్బులలో జరిగిన ఫిజారు యుద్ధమునుండి ఆమ్ముల్ ఫిజారు శకము ప్రారంభమాయెను. ప్రారంభములో ఇస్లాములోకూడ శకమునుగూర్చి పురాతన పద్ధతియే అనుసరింపఁబడెను. కాని హజ్రత్ ఉమరు

గారి కాలములోఁ కచ్చేరీలు, రాఁబడికర్చుల, లెక్కలు రిజిస్టర్లు నియమింపఁబడి నపుడు ఇస్లాముయొక్క శకము ఏర్పాటుచేయ వలసిన అక్కఱగలిగెను. దానికిఁగాను హాజ్రిత్ ఉమరుగారు గొప్ప సభసుగావించి అందుదాని గూర్చి చర్చించిరి. సభ లోననేకులు అనేక సలహాలనిచ్చిరి. "హాజ్రత్ రసూలు వారు మక్కాపురమునువదలి మదీనాపురమును చేరినసంవత్స రము చాలముఖ్యమైనది. అప్పటినుండియే ఇస్లామ్ చరిత్ర ములో చాలముఖ్యమైన మార్పులుగలిగినవి. కావున దానిని ఇస్లామ్‌శకముగా నేర్పఱుపవలెనను" అని హాజ్రిత్ అలీగారు సలహానిచ్చిరి. వారి సలహాను సభవారందఱును సమ్మతించిరి. వలసపోవుటకు అరబీలో హిజ్రత్ అనుదురు. దాని ననుసరించి యే హిజ్రీశకము ఏర్పడెను. అప్పటినుండి ఇప్పటికిని ముసల్మా నులు హిజ్రీశకమును వాడుదురు.

—: పాండిత్యము :—

ఇస్లామునకుఁబూర్వము అరేబియాలో చదువుచాల తక్కువగా నుండెను. హాజ్రత్ ముహమ్మదువారు ప్రవక్తగా వచ్చినకాలములో ఖురైషులలో పదియేడు మంది మాత్రము చదువను వ్రాయను తెలిసిన వారుండురి. హాజ్రిత్ ఉమరుగారు కూడ ఆకాలములోనే విద్యను నేర్చుకొనియుండిరి. హాజ్రత్ ఉమరుగారు తమప్రభుత్వకాలములో వ్రాసిన ఉత్తరువులను, ఫర్మానాలును, వారిచ్చిన ఉపన్యాసములును ఇప్పటి వఱకును పుస్తకములలో వ్రాయఁబడియున్నవి. వానిని చూచినచో వారికి అరబీభాషయందుఁగల పాండిత్యమును, వ్రాఁత సామర్థ్య మును, ఉపన్యాసప్రాబల్యమును బాగుగఁదెలియనగును. వారు

ప్రభుత్వము (ఖిలాఫత్) స్వీకరించిన పిదప ఇచ్చిన ఉపన్యాసము యొక్క వాక్యములు ఈలాగున్నవి.

అల్లాహుమ్మ-ఇన్నీ-గలీజున్-ఫ-లయ్యి న్-నీ-అల్లాహుమ్మ-ఇన్నీ జఈఫున్- ఫఖవ్వినీఅలా-వ-ఇన్నల్-అరబ-జమలున్-ఆనిఫున్ - వ-ఖద్-ఊతీ-తు - ఖితామ:హూ-అలా-వ ఇన్నీ హామి-లుహూ-అలల్-హుదా

"ఓ దేవా! నేను కఠినుఁడను నన్ను మృదుచిత్తునిగాఁ జేయుము. ఓ దేవా! నేను బలహీనుఁనును. నాకుబలమునొసంగుము. మఱి అరబ్బులు పొగరుగల యొంటెవలెనున్నారు. వారిముక్కుత్రాడు నా చేతిలో నొంసగఁబడినది. తప్పక వారిని సన్మార్గమునందు నడపించితీరుదును?

హజ్రత్ ఉమరుగారు అబూమూసా అష్అరీగారికివ్రాసిన లేఖను చూచినచో వారికి వ్రాఁతయందుఁగల సామర్థ్యము తెలియనగును. అందలికొన్ని వాక్యములు ఈలాగున్నవి.

అమ్మాబాదు-ఫ-ఇన్నల్-ఖువ్వత - ఫిల్ అమలి-అన్-లా-తు-అఖ్ఖిరూ-అమల్ - యామి-లి-గదిన్-ఫ-ఇన్నకుమ్-ఇజా-ఫ-అల్-తుమ్-జాలిక-తదా - రకత్ -అలైకుమ్-అ తే-మా-లుకుమ్ ఫలమ్ తద్ రూ-అయ్యూహా-తా-ఖుజూన-ఫ-అ-జితే-తుమ్.

"ఈ దినమునందలి పనిని రేపటికి వదలకుఁడు. ఇందు కార్యబలము గలదు. అట్లు చేయనిచో చాలపనులు మీయొద్ద కూడిపోవును. అపుడు మీరు చాలసంకట పడుదురు. ఏది చేయవలెను. ఏదివదల వలయును అను చింతలోపడుదురు. అట్లు ఎద్దియును కానేరదు." హజ్రత్ ఉమరుగారికి కవిత్వములో

చాల పాండిత్యముండెను. వారికి కవిత్వ విమర్శనమునందు చాల సామర్థ్యముండెను. గొప్ప గొప్ప కవుల కవిత్వమును గూర్చి విమర్శించుచు దాని గూర్చి తమ అభిప్రాయము తెలుపుచుండిరి. అరబ్బులలో గడచిన కవులలో జుహైరుఅను కవియొక్క పద్యములను వారు చాలపొగడుచుండిరి. వారు కూడ కవిత్వము చెప్పుచుండిరి. కాని దానియందు వారికి అంతగా శ్రద్ధ లేకుండెను.

హజ్రత్ ఉమరుగారి వచనములు, శబ్దాలంకారముతోను అర్థాలంకారముతోను నిండియుండును. వారి వచనములు అరబ్బీభాషకు ప్రాణమువంటివి. అరబ్బులలో వంశగోత్రములు తెలిసిన వారు చాల గొప్పగా నెన్నఁబడుదురు. అందుకూడ హజ్రత్ ఉమరుగారికి చాల పాండిత్యము గలిగియుండెను. హజ్రత్ ఉమరుగారు మదీనాపురము చేరిన పిమ్మట యూదులభాషయగు హిబ్రూ (ఇబ్రానీ) చాలవఱకు నేర్చుకొనిరి.

హజ్రత్ ఉమరుగారు సహజముగ చాల తెలివియును బుద్ధి, బలమును, తీర్మానశక్తియును గలిగియుండిరి. మఱి వారు అభిప్రాయపడినట్లు అనేక ధర్మములు విధింపఁబడెను. అజాను పద్ధతివారి అభిప్రాయము ననుసరించియే హజ్రత్ పైగంబరుల వారుకూడ అభిప్రాయపడి నియమించిరి. బదరు యుద్ధములో పట్టుబడిన ఖైదీలను వధింపవలెనని హజ్రత్ ఉమరుగారు అభిప్రాయమిచ్చిరి. కాని హజ్రత్ పైగంబరులవారు ధనమును బదులుగా పుచ్చుకొని ఖైదీలను విడదల గావించిరి. దాని

గూర్చి ఖురానెషరీఫులో హజ్రత్ ఉమరుగారు అభిప్రాయ మిచ్చినట్లు దేవుని సందేశము వచ్చెను. దానివలన హజ్రత్ ఉమరుగారి అభిప్రాయము వాస్తవమని తెలియనాయెను. దాని వివరము సూరయేఅన్ఫాలు.....చూచునది. మద్యపానము సంపూర్ణముగా నిషేధింపఁబడవలెనని హజ్రత్ ఉమరుగారు కోరుచుండిరి. హజ్రత్ పైగంబరువారి ధర్మపత్నులు గోషా యుండవలెనని కోరుచుండిరి. హజ్రత్ ఇబ్రాహీము ప్రవక్త నిలిచి కాబామసీదును కట్టినచోటులో నమాజుచేయ వలెనని హజ్రత్ ఉమరుగారు అభిప్రాయపడిరి. హజ్రత్ ఉమరుగారు కోరినట్లు పై విషయములు విధింపఁబడెను.

హజ్రత్ ఉమరుగారు హజ్రత్ పైగంబరులవారి సానిధ్యమున తఱచుగ నుండిచుండిరి. అందుచే హజ్రత్ రసూలు వారితో అనేక మతధర్మములనుగూర్చి ప్రశ్నించి తెలిసి కొనుటకు వారికి వీలుగలుగుచుండెను. వారు హజ్రత్ రసూలు వారి కాలములోఁగూడ మతధర్మములనుగూర్చి చాల యోచించుచు చిక్కుగల విషయములను హజ్రత్ రసూలువారితో విచారించి తెలిసికొనుచుండిరి. బోధపడని విషయమును పలుమార్లు ప్రశ్నించి తెలిసికొను చుండిరి. అందేలాటి జంకుగాని వారికి లేకుండెను. వారు ఖురానెషరీఫును చాల యోచించి పఠించి అందలి ధర్మములను గ్రహించుచుండిరి. ఇతరులతోను కూడ దానిగూర్చి చర్చించుచుండిరి. ఇతరులకుఁ దెలియని విషయములు వారు దెలుపుచుండిరి. ఏదైన చిక్కుగల విషయము వచ్చిపడినచో దానిగూర్చి ఖురానునుండి ప్రమాణములు తీసిచూపుటలో వారికి చాల సామర్థ్యముండెను.

హజ్రత్ రసూలువారి యుపదేశములు ఉమరుగారికి చాల దెలిసియుండెను. వారు తమ ప్రభుత్వకాలములో శాసించిన ధర్మములన్నియు హజ్రత్ రసూలు వారి యుపదేశముల ననుసరించియే యున్నవి.

ఖురానెషరీఫును, హజ్రత్ రసూలువారి యుపదేశములను బాగుగ యోచించి ధర్మములు కనిపెట్టుటలో హజ్రత్ ఉమరుగారికి చాల సామర్థ్యముండెను. అట్లు ఏర్పడిన ధర్మములను ఫిఖా అనుదురు. ఫిఖా ధర్మములనుగూర్చి గావించిన కృషియే వారి తరువాత వారికి మార్గము చూపెను.

—: హజ్రత్ ఉమరుగారి సుగుణములు: —

హజ్రత్ రసూలువారు లోకులకు సుగుణములు నేర్చుటకుఁగాను ప్రవక్తగా దేవునిచేనియమింపఁబడిరి. బు-ఇస్‌తు-లి-ఉతమ్ మిమ-మకారిమల్-అఖ్‌లాఖ- (నేను సుగుణశీలములను పరిపూర్ణము, గావించుటకు ప్రవక్తగా నియమింపఁబడితిని) అని హజ్రత్ పైగంబరులవారు ఉపదేశించియున్నారు. హజ్రత్ రసూలు వారిశిష్యు (సహాబా)లు పైగంబరుల వారి సాన్నిధ్యమున నుండి బాగుగ శిక్షణపొంది రసూలు వారి సుగుణములు గ్రహించి లోకమునకు మార్గదర్శకులైరి. అందు హజ్రత్ ఉమరుగారు చాలముఖ్యులు. వారికి హజ్రత్ రసూలు వారి సమ్ముఖమున చాలసామిప్యము లభించియుండెను. దానిచే హజ్రత్ రసూలువారి దివ్యసహవాసమువలన హజ్రత్ ఉమరుగారికి గొప్పసుగుణములు అలవడెను. హజ్రత్ ఉమరుగారి దైవభక్తి, ఇహలోకమునందలి వైరాగ్యము, సత్యము వచించుట, సుభాషితము, అడంకువ, సాధారణత్వము, నిరా

డంబరము, మొదలగు సుగుణములు నెలకొనెను. ఆగుణములు వారి యందేకాక వారి సహవాసము సందున్నవారికిఁ గూడ అలవడుచుండెను. అందులకే వారి ప్రభుత్వకాలములోనున్న అధికారులయందుకూడ ఆసుగుణములుండెను. యథారాజా తథాప్రజా అనునది అనుభవ సిద్ధముగదా!

—: దైవభీతి :—

సుగుణ శీలములు స్థిరపడుటకు దైవభీతియును భక్తియును దేవుని మహిమయందుఁగల గొప్పవిశ్వాసమును ముఖ్య కారణములు. దైవభీతియును భక్తియును విశ్వాసమును లేని హృదయము మాంసపుకండతో సరిసమానము. దాని కేలాటి గౌరవములేదు. కావున హజ్రత్ ఉమరుగారికి దైవభీతియు భక్తి విశ్వాసములును చాలయుండెను. అందుచేవారు పూర్తి రాత్రి భయభక్తులతో (నమాజు) సలుపుచుండిరి. వారు తెల్లవారుచుండఁగానే తమయింటి వారిని నమాజుకొఱకు మేలు కొల్పుచుండిరి. నమాజులో పునరుత్థానదినమును గూర్చిగల ఖురానువాక్యములను పఠించి భయభక్తులతో వారు కన్నీరు విడుచుచు చాల యేడ్చుచుండిరి. ఖురాను వాక్యములందలి భావములువిని వారి హృదయముచాల మెత్తపడుచుండెను. వారు తీర్పుదినమునందలి కర్మలతీర్పునుస్మరించి చాలభయపడుచుండిరి. తాముగావించిన పుణ్యకార్యములకు ఫలితముగ నరకము తప్పిపోయినచాలును అని వారు పలుమార్లు నొక్కి పలుకుచుండిరి. ఒకదినము గడ్డిపోఁచను చేతిలోనెత్తికొని "నేను గడ్డినైయుంటినేని బాగుండునే! నేనుపుట్టకయుండిన బాగుండునే! నాతల్లినన్ను కనకయుండిన బాగుండునే! అని (కర్మల

తీర్పుభీతిచే) పలుకసాగిరి. ''ఒకఁడు దప్పఅందఱు స్వర్గములో ప్రవేశింతురు అని ఆకాశవాణి వచ్చినచో బహుశః ఆస్వర్గములో ప్రవేశింపనివాఁడు నేనేకావచ్చును అని నాకు భీతి గలదు అని పలికిరి.

హజ్రత్ రసూలువారియందలిభక్తి:- ఆత్మశుద్ధికినిసుగుణములు అలవడుటకును ప్రతి ముసల్మానుఁడు హజ్రత్ రసూలు వారి యందుగొప్ప భక్తి ప్రేమలు గలిగి యుండవలెను. మఱి మనః పూర్వకముగా హజ్రత్ రసూలు వారిపద్ధతి ననుసరింపవలెను. అట్లుకానిచో ఉభయలోకముల మేళ్లు ముసల్మానులకు లభింపనేరవు. కాఁబట్టియే హజ్రత్ ఉమరుగారికి హజ్రత్ రసూలువారియందు చెప్పరాని భక్తి ప్రేమలుండెను. వారు తమ ప్రాణముకంటె నెక్కువగా హజ్రత్ రసూలు వారిని ప్రేమించుచుండిరి. హజ్రత్ ఉమరుగారు, హజ్రత్ రసూలు వారి ప్రేమమార్గమందు తమప్రాణమును సంతానమును, ధనమును సర్వమును త్యాగము చేయుటకు వెనుదీయరు. బదరు యుద్ధములో హజ్రత్ ఉమరుగారి మామఅగు ఆసీఅనువాఁడు హజ్రత్ పైగంబరుల వారికి విరోధముగా యుద్ధములో శత్రువుల పక్షముచేరి యుండెను. అపుడు హజ్రత్ ఉమరుగారు యుద్ధములో ఆతనిని తమచేతులార వధించిరి. తమ మామఅని వదలలేదు. ఒకసారి హజ్రత్ పైగంబరులవారు తమ సంసార విషయములో తమ ధర్మపత్నులపై కోపపడి వేఱుగానుండిరి. హజ్రత్ ఉమరుగారు చాలదుఃఖపడి హజ్రత్ రసూలు వారి దర్శనార్థము సెలవునడిగిరి. కాని సెలవుదొరకలేదు. అపుడు హజ్రత్ ఉమరుగారు బిగ్గరగా హజ్రత్ రసూలువారు విను

నట్లుగా నేను నాకుమార్తె బీబీహాఫసా యొక్క సిఫారసు చేయుటకు రాలేదు. హజ్రత్ రసూలువారు సెలవిచ్చినచో ఆమెను నఱికి వేయుదును అని పలికిరి. హజ్రత్ ఉమరుగారి కుమార్తె బీబీహాఫసా హజ్రత్ పైగంబరులవారి ధర్మపత్ని. చూచితిరా హజ్రత్ ఉమరుగారు తమకుంగల హజ్రత్ రసూలు వారి భక్తి, ప్రేమలవలన కుమార్తె ప్రేమనుగూడ లెక్క చేయ లేదు. హజ్రత్ పైగంబరులవారు పరలోకముచేరిన విషయము విని హజ్రత్ ఉమరుగారు నమ్మలేదు. ఎవరు అట్లుపలుకుదురో వారిని వధింతును అని పలుకసాగిరి. ఉమరుగారికి హజ్రత్ రసూలువారి యందున్న భక్తి, ప్రేమల వలన అట్లు సంభవిం చెను. హజ్రత్ పైగంబరులవారి కాలము జ్ఞప్తికి వచ్చినప్పు డెల్ల హజ్రత్ ఉమరుగారు చాల దుఃఖించి కన్నీరు విడుతురు. ఒకసారి హజ్రత్ ఉమరుగారు సిరియాపోయి యున్నప్పుడు అచ్చటి మసీదులో హజ్రత్ బిలాలుగారు అజాను (నమాజు పిలుపు) ఇయ్యంగా హజ్రత్ రసూలువారి కాలము జ్ఞప్తికివచ్చి హజ్రత్ ఉమరుగారు చాల దుఃఖపడి కన్నీరు విడవసాగిరి.

తన ప్రియుని ప్రియుఁడు తనకు ప్రియుఁడుఅగునుగదా! దాని ననుసరించి, హజ్రత్ రసూలువారు ఎవరిని చాల ప్రేమించుచుండిరో వారిని హజ్రత్ ఉమరుగారుకూడ చాల ప్రేమించుచుండిరి. హజ్రత్ రసూలువారు ఉసామాబిన్ జైదును, హజ్రత్ హసనును, హజ్రత్ హుసైనును తమ జీవితకాలములో చాల ప్రేమించుచుండిరి. అందులకు హజ్రత్ ఉమరుగారు వారినికూడ చాల ప్రేమించి తన కుమారుని కంటె నెక్కువ వారికి వేతనములు నియమించిరి.

హజ్రత్ ఉమరుగారు హజ్రత్ రసూలువారి ధర్మ పత్నులను చాల గౌరవించుచు వారి కొఱకు అన్నివిధముల సౌకర్యముల యేర్పాటులుచేసి ఒక్కొక్క యామెకు పండ్రెండు వేల దిర్హముల వేతనము నియమించిరి.

హజ్రత్ ఉమరుగారు తమజీవితముయొక్క ప్రతి విషయము లోను హజ్రత్ రసూలువారి యాచారము ననుసరించుచుండిరి. దుస్తులు ధరించుటలోను, భోజనము చేయుటలోను నడచుట లోను, ప్రతి విషయములోను హజ్రత్ పైగంబరులవారి పద్ధతిని ననుసరించుచుండిరి. హజ్రత్ రసూలువారు ప్రజల సౌకర్యముల కొఱకు తమ సౌకర్యమును త్యజించి తఱచుగ ఆఁకలిని సహించుచుండిరి. కడుపునిండుగ భోజనము చేయక సాధారణమైన ఆహారమును భుజించుచుండిరి. అటులే రోమను, పారసీక రాజ్యములు హజ్రత్ ఉమరుగారి ప్రభుత్వములో చేరి ధనమునకు మితము లేకుండినను, హజ్రత్ ఉమరుగారు సాధారణమైన దుస్తులు ధరించి సాధారణమైన భోజనముకూడ కడుపునిండుగ భుజింపక తఱచుగ ఆఁకటిబాధ సహించుచుండిరి. ఒకసారి బీబీహఫసాగారు "ఓనాయనా! దేవుని యనుగ్రహమువలన ఇపుడు చాల సౌకర్యములు లభించినవిగదా! ఇఁక నైనమీరు మంచిదుస్తులు ధరించి మంచియాహారము భుజింపకూడదా! అని పలుకఁగా హజ్రత్ ఉమరుగారు "ఓబిడ్డా! ఏమి నీవు హజ్రత్ పైగంబరులవారి కష్టజీవితమును మఱచి పోతివా! దేవుని సాక్షి! నేను నాప్రియులైన హజ్రత్ రసూలు వారి జీవితపద్ధతిని వదలను. ఇహలోక తుచ్ఛసౌఖ్యములకంటె పరలోక నిత్యజీవిత సౌఖ్యములు పాటింపదగినవి" అని పలు

కఁగా బీబీహాహసాగారు కన్నీరు విడవసాగిరి.

దేవుని మతచిహ్నములను గౌరవించుటనుగూర్చి ఇస్లాములో ధర్మముగలదు. దాని ననుసరించి హజ్రత్ పైగంబరులవారు హజ్ రెఅస్వదునకు (కాబామసీదు గోడలోనున్న నల్లరాతికి) ముద్దిడిరి. హజ్రత్ ఉమరుగారు తమ ప్రభుత్వకాలములో కాబాయాత్రకు పోయియుండిరి. ఆసమయమందు హజ్ రెఅస్వదునకు ముద్దిడవలసివచ్చెను. అరాతిలో దేవుని మహిమగలదేమో అని ప్రజలు భ్రమపడకుండుటకై "అక్ -లము-అన్నక-హజరున్-వఅన్నకలా-తజురు్రా-వలా - తన్-ఫఉ-వ-లౌలా-అన్నీ-రఐతు-రసూలల్లాహి-యుఖబ్బి-బిలుక-మా-ఖబ్-బల్తుక నీవు ఒక రాతిబండవు, అనియు, నీవులాభముగాని నష్టముగాని జేయఁజాలవు అనియు నాకు బాగుగఁ దెలియును. మఱి హజ్రత్ రసూలువారు నీకు ముద్దిడుచుండుట నేను చూచియుండనిచో నీకు నేను ముద్దుచేసియుండను అని స్పష్టముగా దానియెదుట నిలిచి పలికిరి.

## —: తృప్తి :—

పేరాస అన్ని దుర్గుణములకు మూలము. కావున హజ్రత్ ఉమరుగారు దానిని చాల అసహించుచుండిరి. వారు తమకు లభించినదానితోనే తృప్తి చెందుచుండిరి. ధనమందు వారికి ఆసయేలేకుండెను. హజ్రత్ రసూలువారు అనేకపర్యాయములు హజ్రత్ ఉమరుగారికి ధనము నొసంగకోరిరి, కాని "నాకంటె నెక్కువ అక్కఱగల వారలున్నారు. వారికి నొసంగుఁడు" అని వారు హజ్రత్ రసూలువారితో విన్నవించిరి. అపుడు హజ్రత్ రసూలువారు "మీరు పుచ్చుకొనుఁడు, ఆ

పిదప మీాయిష్టమువచ్చినచో దానము చేయవచ్చును. లేదా మీారు ఖర్చుచేసికొనవచ్చును. యాచింపక లభించిన దానిని పుచ్చుకొనవలెను” అని పలికిరి.

హజ్రత్ ఉమరుగారు మంచివిలువగల సన్నని దుస్తులు ధరించి యెఱుఁగరు. పండ్రెండేసి అతుకులుగల అంగీయును చినిఁగిన తలపాగయును, చినిఁగిన చెప్పులును ధరించుచుండిరి. అట్టి స్థితిలోనే రోమను, పారసీకరాజుల యొద్దనుండి వచ్చిన రాయబారులను తమ రాజ కూటమునకు రప్పించివారికి దర్శన మిచ్చుచుండిరి. ముసల్మానులు చాలసిగ్గుపడుచుండిరి. కాని హజ్రత్ ఉమరుగారితో దుస్తులఁగూర్చి ఒక్కమాటయైనను పలుకలేకుండిరి. అట్టి సాధారణమైనస్థితిలోను ప్రజలు హజ్రత్ ఉమరుగారిని చూచిచాల భయపడుచుండిరి. ఒకసారి, బీబీ ఆయిషాగారు బీబీహాఫసాగారు హజ్రత్ ఉమరుగారితో “ఓ అమీారుల్ మూమినీన్ ఇపుడు దేవుఁడు సర్వవిధముల సౌకర్యముల నొసంగియున్నాఁడుగదా! మఱేల పరదేశరాజుల యొద్దనుండి వచ్చురాయబారులకు మీారు దర్శనము నొసంగునపుడు మంచి దుస్తులు ధరింప కూడదు” అని పలికిరి, అపుడు హజ్రత్ ఉమరుగారు “మీారు హజ్రత్ రసూలువారి ధర్మపత్నులయ్యు ఇట్లు పలుకుచున్నారు గదా! నాకుచాల చింతగానున్నది. ఓ ఆయిషా! ఏమి మీారు హజ్రత్ రసూలువారి జీవితమును స్థితినిమఱచి పోయితిరా! మీాయింటిలో నొక వస్త్రము మాత్రముండెను. పగటి పూఁట దానిని పఱచుచుంటిరి. మఱిరాత్రి వేళదానినే కప్పుకొనుచుంటిరి గదా! ఓ హాఫసా! మీాకు జ్ఞప్తిలేదా! ఒకరాత్రి మీారు పఱుపును

రెండు మడతలుగావించి పఱచినపుడు హజ్రత్ రసూలువారు రాత్రియంతయు నిద్రపోయి అజాను పిలుపువిని మేలుకొని ఓయీహాఫసా! మీరేమిచేసితిరి! పఱుపును మడతలుచేసి మెత్తగానుండునట్లు చేసితిరి. దానిచే నేనురాత్రి యంతయు నిద్రపోయితిని. రాత్రిప్రార్థన (తహజ్జదు)కు లేవలేక పోయితిని గదా! ఇహలోక సౌఖ్యములతోనాకేమి సంబంధము. మీరు పఱుపును మెత్తగాగావించి నన్నేల అజాగ్రత్తా పఱచితిరి అని మీతో పలుకలేదా "అని పలికిరి. హజ్రత్ ఉమరుగారు సహజముగ వేసవికాలములో కొత్త వస్త్రములు చేయించు కొందురు. అవిచినిఁగి పోయినచో అతుకులువేసి ధరింతురు. ఒకసారిదానిగూర్చి బీబీహఫసాగారు వారితో సంభాషింపఁగా నాకు ముసల్మానుల సొత్తులోదానికంటె నెక్కువహక్కు లేదు అనిపలికిరి. ఒకసారి వారు తమ యింటిలో చాలకాలముండి బయటికి వచ్చిరి. అపుడు ప్రజలువారికొఱకు బయట వేచి యుండిరి. విచారింపఁగా ధరించుటకు దుస్తులులేనందున మాసినదుస్తులనే ఉతికి అవియెండిన పిమ్మట ధరించి బయటికి వచ్చిరి అని తెలియనాయెను. హజ్రత్ ఉమరుగారి యాహార ముచాలసాధారణమైనది. తఱచుగా రొట్టె, జైతూను (ఆలవి) నూనె భుజించుచుండిరి. గోధుమపిండి జల్లెడపట్టకయే రొట్టె చేయించుచుండిరి. అథితులు, రాయబారులు వచ్చినపుడు కూడ ఆయాహారమే తినవలసివచ్చుచుండెను. అందుచే అథితులకును, రాయబారులకును అలవాటులేనందున వారికి కష్టమగుచుండెను.

తఱచుగ హాఫస్ బిన్ అబిల్ ఆస్, హజ్రత్ ఉమరుగారు

భోజనచేయు సమయమున వచ్చుచుండిరి. కాని భోజనము చేయకుండిరి. అపుడు ఎందులకు మీరు నాయొద్ద భోజనము చేయరు అని హజ్రత్ ఉమరుగారు వారిని ప్రశ్నింపఁగా "మీ భోజనము చాల సాధారణమైనది. మేము చాల విలువైన భోజనము చేయుదుము" అని హాఫసు పలికెను. అపుడు హజ్రత్ ఉమరుగారు "దేవునిసాక్షి! నేను శక్తిలేక అట్టిభోజనము చేయుటలేదు. కాని నాకుతీర్పు దినమునందు భయముగలదు. ఆభయము లేనిచో నేనుకూడ మీవలె ఇహలోక భోగములలో నిమగ్నుఁడనై యుందును" అని యుపదేశించిరి.

హజ్రత్ ఉమరుగారు ఖిలాఫత్ స్వీకరించిన తరువాత కూడ కొన్నిసంవత్సరములవఱకు తమసొంత పైకమునే ఖర్చుచేసి కొనుచుండిరి. ఒకపైసాకూడ ప్రభుత్వమునుండి తీసికొనలేదు. తుదకు వారియొద్ద సొంతపైకము లేనందున వారికి కష్టము కలుగసాగెను. అపుడు ముసల్మానులు వారి ఖర్చుకుఁగాను కొంత వేతనము నియమించిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు నా ధనస్థితి బాగుపడినపుడు ప్రభుత్వవేతనము తీసికొనను అని షరతుచేసి దానిని సమ్మతించిరి.

హజ్రత్ ఉమరుగారు చాల మెలఁకువతో ప్రభుత్వకార్యములు నడపించుచుండిరి. వారు తమబంధువులకు ప్రభుత్వమునందు నుద్యోగముల నొసంగలేదు. అట్లు చేయుటలో పక్షపాత దోషముకలుగునని వారు తలఁచుచుండిరి. ఒకవేళ అధికారులు కానుకలు పంపినచో వారిని కఠినముగా మందలించి ఆకానుకలను అంగీకరింపక వాపసుచేయుచుండిరి. ఒకసారి హజ్రత్ ఉమరుగారి ధర్మపత్ని బీబీఉమ్మెకుల్సూము,

కైసరురాణియొద్ద అత్తరుసీసాలను బహుమానముగానంపెను. ఆరాణి సీసాలనిండుగ వజ్రములు బీబీఉమ్మెకుల్సూము యొద్దకు పంపెను. ఆ విషయము హజ్రత్ ఉమరుగారికిఁదెలిసి, రాణి యొద్దకు బహుమానములు దీసికొనిపోయిన రాయబారి ప్రభుత్వముయొక్క ఖర్చులతో పోయెను. కావున వజ్రములహక్కు ప్రభుత్వమునకుఁగలదు అని పలికి యావజ్రములను ప్రభుత్వ ఖజానాలోచేర్చి బీబీగారు బహుమానముగ పంపిన అత్తరు నకుబదులు కొంత ధనము ప్రభుత్వమునుండి యొసంగిరి.

ఒకసారి హజ్రత్ ఉమరుగారు బజారులో నొక బలసిన యొంటె అమ్మఁబడుచుండఁగా చూచి దానిగూర్చి విచారించిరి. అది వారికుమారుఁడగు అబ్దుల్లాగారిసొత్తు అని తెలియనాయెను. దానిగూర్చి అబ్దుల్లాతో విచారింపఁగా అది నా యొంటె. అది నేనుకొనినపుడు చాల చిక్కిపోయియుండెను. దానిని ప్రభుత్వముయొక్క మేఁతపొలములలో వదలితిని. అచ్చట బాగుగ మేసిబలసినది. దానిని అమ్ముచున్నాను అని పలికెను. అపుడు హజ్రత్ ఉమరుగారు దాని అసలువెల పుచ్చుకొనుటకు మాత్రము నీకు హక్కుగలదు. దానిపై వచ్చిన లాభము ప్రభుత్వమునకు చేరవలెను అని పలికి ఆ పైకమును ఖజానాలో దాఖలుచేసిరి.

హజ్రత్ ఉమరుగారు తమ ప్రభుత్వకాలములోకూడ వ్యాపారము చేయుచుండిరి. ఒకసారి సిరియాదేశమునకు వ్యాపారసామగ్రి పంపుటకు పైకము కావలసివచ్చెను. అపుడు హజ్రత్ అబ్దుల్ రహ్మానుగారితో అప్పునడగఁగా మీరు

ప్రభుత్వ ఖజానానుండి అప్పుతీసికొనవచ్చును అని అబ్దుల్ రహ్మానుగారు పలికిరి. "దానిని నేను సమ్మతింపను. ప్రభుత్వ ఖజానానుండి అప్పుతీసికొనిన అప్పుచెల్లింపక పూర్వమే నేను మరణించినచో ముసల్మానులు నాఆస్తినుండి అప్పువసూలు చేయరు. దానివలన ప్రభుత్వమునకు నష్టమగును. ఇతరులతో తీసికొన్నచో వారుతప్పక నాఆస్తినుండి తమఅప్పు పుచ్చుకొందురు" అని పలికిరి. అట్లు హజ్రత్ ఉమరుగారు ప్రతివిషయములోను చాల మెలఁకువతో నడచుకొనుచుండిరి.

—: అడంకువ :—

హజ్రత్ ఉమరుగారి పేరువినియే రోమను, పారసీక రాజులు భయపడుచుండిరి. అట్లు వారిప్రఖ్యాతి లోకములో నుండియు వారు చాల అడంకువ, వినయముగలిగి యుండిరి. వారు విధవల యిండ్లకు నీటితిత్తులను తమభుజములపై మోసికొనిపోయి వారికి నీటివసతి కల్పించుచుండిరి. యుద్ధమునకు వెడలిపోయిన యుద్ధవీరుల యిండ్లకు స్వయముగ బజారునుండి కూరగాయలు మొదలగు వంటవస్తువులు తెచ్చి యిచ్చుచుండిరి. అట్లు పనిచేసి అలసిపోయి మసీదులోని ఒకమూలలో నేలపైననే పరుండుచుండిరి.

ఒకసారి వారు తమప్రభుత్వకాలములో మదీనా పురమునకు బయటపోయి తిరిగివచ్చునపుడు చాల అలసిపోయిరి. అపుడు ఒకబానిస గాడిదపై నెక్కి పోవుచుండెను. ఆతనితో "నన్నుకూడ గాడిదెపై నెక్కించుకొనుము" అని పలుకఁగా ఆతఁడు మహాసంతోషముతోదిగి "మీరు ఎక్కిపొండు. నేను నడచివచ్చెదను" అని హజ్రత్ ఉమరుగారితో పలుకఁగా అట్లు

కానేరదు. నేనునీ వెనుక కూర్చుండెదను అనిపలికి వాని వెనుకనే కూర్చుండి మదీనాపురములోని వీధులలోనుండి పోసాగిరి. ప్రజలు చాల ఆశ్చర్యపడిరి. వారియందు గర్వముఅనుమాటయే లేకుండెను. వారు ఒకసారి జకాతులోవచ్చిన యొంటెలకు నూనెరుద్దుచుండిరి. ఒకరు అదిచూచి "ఓ అమీరుల్ మూమినీన్! ఈ పనిమీరేల చేయుచున్నారు. ఎవనినైన ఒక బానిసను నియమించిన చేసియుండునే" అని విన్నవింపఁగా నాకంటెఎక్కువ ఎవఁడు బానిసగలఁడు. నేను ప్రజల బానిసను. ఎవఁడు ప్రజల ప్రభువుఅగునో వాఁడు ప్రజల సేవకుఁడు అని యుపదేశించిరి.

కఠినత్వమును, కనికరమును:—ఎవరైన ధర్మమునకును న్యాయమునకును విరుద్ధము గావించినచో హజ్రత్ ఉమరుగారు వారియందు చాల కఠినముగా వర్తింతురు. వారిని కఠినముగా మందలింతురు. ఎవరికైన కష్టముకలిగినచో వారియందు చాల కనికరముచూపి వారికి తోడుపడుదురు. బానిసల దుర్గతిని చూచి, వారు చాల కనికరించి వారికి చాల తోడుపడుచుండిరి. సిఱు పేదలందును అనాథశిశువులందును వారికి చాల కనికరముండెను. వారిసౌకర్యముల కొఱకు చాల పాటుపడుచుండిరి.

—: క్షమించుట :—

ఎవరైన హజ్రత్ ఉమరుగారి విషయమేమైన అధర్మ వాక్యము పలికినను క్షమించుచుండిరి. ఒకసారి హజ్రరుబిన్ ఖైస్, ఉయినా అను వారిద్దఱు హజ్రత్ ఉమరుగారి సమ్ముఖమునకు వచ్చిరి. ఉయినా అను నాతఁడు "ఓ ఉమరు! న్యాయముగా ప్రభుత్వముచేయుము" అని పలికెను. దానికి హజ్రత్ ఉమరుగారికి

కోపమువచ్చెను. అపుడు హుర్రు" క్షమింపుము, ధర్మమును గూర్చి ఆజ్ఞాపింపుము, మూఢులనుండి ముఖము త్రిప్పుకొనుము. అని ఖురానెషరీఫులో గలదుగదా! అని పలుకఁగా హజ్రత్ ఉమరుగారు తమకోపమునువదలి క్షమించిరి.

—: ప్రజాసేవ :—

ప్రజల సౌకర్యములను పాటించుట ప్రభువుయొక్క ముఖ్యధర్మములలో నొకటి. హజ్రత్ ఉమరుగారు తమప్రభుత్వకాలములో ప్రజల సౌకర్యములనుగూర్చి యెంతశ్రద్ధ వుచ్చుకొనిచుండిరో వివరముగా ముందువ్రాసి యున్నాము. ప్రభుత్వధర్మములకు సంబంధింపని విషయములలోకూడ స్వయముగా మహాసంతోషముతో హజ్రత్ ఉమరుగారు ప్రజాసేవ గావించుచుండిరి. అందలికొన్ని విషయములను మాత్రమిచ్చట వ్రాయుదుము. యుద్ధమునకుఁగాను వెడలిన యుద్ధవీరుల యిండ్లకు హజ్రత్ ఉమరుగారు వారిగృహస్థుల క్షేమము విచారించుచు వారికి కావలసిన వంటసామగ్రి బజారునుండి స్వయముగా మోసికొని తెచ్చి యిచ్చుచుండిరి. వారుసైనికులు యుద్ధరంగమునుండి తమయిండ్లకు వ్రాసిపంపిన లేఖలను స్వయముగాఁ దీసికొనిపోయి యిచ్చుచు వ్రాయను చదువను రాని వారిలేఖలను తామేవినిపించి తిరిగిబదులు వ్రాయుచుండిరి. వారు తఱచుగా రాత్రులలో మదీనాపురముల వీథులలో తిరిగి జనుల విషయములను విచారించి తెలిసికొనుచుండిరి. ఒక రాత్రి హజ్రత్ ఉమరుగారు మదీనాలో తిరుగుచు మూఁడు మైళ్ళ దూరముననున్న హరార్ అనుచోటికిపోయి చేరిరి. అచ్చట ఒక స్త్రీ పొయ్యిమీఁద కుండనుబెట్టి వండుచుండెను.

ఆమెచుట్టు ముగ్గురుపిల్లలు కూర్చుండి యేడ్చుచుండిరి. వారు ఆమెనొద్దకుఁబోయి విచారింపఁగా "పిల్లలు ఆఁకటిబాధ సహింపలేక యేడ్చుచున్నారు. వారిని ఊఱడించుటకుఁగాను ఉత్తకుండను పొయ్యిపై నుంచి యున్నాను" అని యామె పలికెను. తత్క్షణమే హజ్రత్ ఉమరుగారు మదీనాపురమునకువచ్చి పిండి, నెయ్యి, మాంసము, ఖర్జూరములు స్వయముగా మోసికొని బయలుదేఱిరి. అపుడు హజ్రత్ ఉమరుగారి బానిసయగు అస్లము "ఓ అమీరుల్ మూమినీన్! నాచేతికియ్యుండి, నేను మోసికొని వచ్చెదను" అని విన్నవింపఁగా" ఓయి అస్లము! తీర్పుదినమునందు నాభారమును నీవు మోయలేవుగదా!" అని పలికి స్వయముగా నెత్తికొని ఆ స్త్రీయొద్దకుఁబోయి చేరిరి. ఆమె ఆవస్తువులను తీసికొని వంటప్రారంభించెను. హజ్రత్ ఉమరుగారు స్వయముగ పొయ్యియూదుచుండిరి. ఆమెపిండి పిసికి రొట్టెలుచేసి కూరవండెను. పిల్లలు కడుపారతిని మహాసంతోషముతో ఆటలాడుచు గంతులు వేయసాగిరి. హజ్రత్ ఉమరుగారు పిల్లల యాటలనుచూచి చాల సంతోషపడిరి.

ఒకసారి మదీనాపురమునకు బయటకొందఱు ప్రయాణికులు దిగియుండిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు "హజ్రత్ అబ్దుల్ రహ్మానుగారితో "ఈరాత్రి మేము ఆప్రయాణికులకు కాఁపుదల చేయుదుము. వారికి దొంగల భయము లేకుండ చేయుదుము, పోవుదమురండు" అని పలికి వెంటఁబెట్టుకొని పోయి రాత్రియంతయు అచ్చట మేలుకొని పారాయుండిరి.

ఒకరాత్రి హజ్రత్ ఉమరుగారు పురములో తిరుగుచుండఁగా ఒక గుడారమునుండి యేడ్పు వినవచ్చెను. అచ్చ

టికిపోయి విచారింపఁగా ఒకపల్లెటూరి వానిభార్యకు కానుపు నొప్పి లేచియున్నది అని తెలియనాయెను. ఆమెవెంట నితర స్త్రీలెవరును లేరు అను విషయముకూడ తెలియనాయెను. తత్క్షణమే హజ్రత్ ఉమరుగారు తమయింటికిపోయి తమభార్య అగు ఉమ్మెకుల్సూమును పిలుచుకొనివచ్చి ఆ స్త్రీయొద్ద వదలిరి. కొంతసేపటికి ఆస్త్రీకి మగబిడ్డ పుట్టెను. "ఓఅమీరుల్ మూమినీన్! మీ స్నేహితునకు మగబిడ్డపుట్టెను అను సంతోషవార్త నొసంగుఁడు"అని ఉమ్మెకుల్సూము గుడారములోపల నుండిపలుకఁగానే ఆపల్లెటూరివాఁడు 'అమీరుల్ మూమినీన్'! అను పదమువినఁగానే హజ్రత్ ఉమరుగారినిగుర్తించి భయపడసాగెను. అపుడు హజ్రత్ ఉమరుగారు "మీరేల భయపడుచున్నారు. భయపడనక్కఱలేదు. ప్రొద్దుననే మీరు నాయొద్దకురండు. నేను మీబిడ్డకుఁగాను వేతనము నియమించెదను" అని పలికిరి. హజ్రత్ ఉమరుగారికి ప్రభుత్వసంబంధమైన పనులవలన తీఱిక లేకున్నను వారు చాల ప్రయత్నించి కుంటి గ్రుడ్డి, బలహీనులు మొదలగువారి సేవకొఱకు కొంతకాలము తీయుచుండిరి. వారికి తామెవరో అను విషయము తెలియపఱుపకయే వారు మహాభక్తితో సేవచేయుచుండిరి. హజ్రత్ తలహాగారు ఒకసారి ప్రాతఃకాలమున ఒకగుడిసెలో హజ్రత్ ఉమరుగారు పోవుటనుజూచి ఇట్టిసమయమున ఎందులకు వారు పోవుచున్నారు అను తలంపుతో వారు విచారింపఁగా ఆగుడిసెలో కన్నులుపోయిన ఒకముసలమ్మయున్నది. ప్రతిదినము ఆమెను విచారించుటకు పోవుచున్నారు అను విషయము వారికి తెలియనాయెను.

—: దానము: —

హజ్రత్ ఉమరుగారికి చాల ధనము లేకున్నను వారు దేవుని ప్రీతికొఱకు తమశక్తికిమించి దానము చేయుచుండిరి. హిజ్రీతొమ్మిదవయేఁట హజ్రత్ పైగంబరులవారు తబూకు యుద్ధమునకుఁగాను సిద్ధమైరి. అపుడు అందఱు ముసల్మానులు తమతమ శక్తికొలఁది చందాలువేసిరి. అపుడు హజ్రత్ ఉమరుగారు తమయాస్తిలోని సగము చందాలోనిచ్చిరి.

బనీహారిసాయూదులనుఁడి హజ్రత్ ఉమరుగారికి మేలైనభూమి లభించెను. వారు దానిని దేవుని ప్రీతికొఱకు బీదలకుఁగాను దానముఁ (వఖఫ్) చేసిరి. అటులే ఖైబరులో వారికి మంచి భూమి లభించెను. వారు హజ్రత్ రసూలువారి సమ్ముఖమునకువచ్చి "నాకు కొంత సారవంతమైన భూమిలభించినది. దానికంటె మేలైనది నాయొద్దలేదు. దానిగూర్చి మీరేమి సెలవిచ్చెదరు" అని విన్నవించిరి. అపుడు "మీరు దానిని దేవుని ప్రీతికొఱకు నిఱుపేదలకు దానముచేయుఁడు అని హజ్రత్ రసూలువారు సెలవిచ్చిరి. తత్క్షణమే హజ్రత్ ఉమరుగారు దానిని, నిఱుపేదలకొఱకు దానము (వఖఫ్) చేసిరి. ఒకసారి యొక బీదవాఁడు దుఃఖకరమైన పద్యములను వినిపించెను. వాని పద్యములువిని హజ్రత్ ఉమరుగారు కన్నీరువిడిచి తాము ధరించియున్న చొక్కాయనుతీసి వానికి నొసంగిరి.

—: సమానభావము :—

హజ్రత్ ఉమరుగారు తమ ప్రభుత్వకాలములో ధనికులను పేదలను బంధువులను పరాయివారిని సమానముగా చూచుచుండిరి. ఏలాటి వ్యత్యాసము వారియొద్ద లేకుండెను. అధి

కారులు సాధారణమైన దుస్తులుధరించి యేలాటి డంబము గాని, వ్యత్యాసమునుగాని చూపకూడదు అని కఠినముగా విధించియుండిరి.

"ప్రజలు కష్టపడుచు జీవనము గడుపుచుండునపుడు నేను సౌఖ్యముగా జీవనము గడుపుకొన్నచో నాకంటె నెక్కుడు దుష్టుఁడు ఎవఁడును లేఁడు" అని తలచుచు హజ్రత్ ఉమరుగారు పలుకుచుండిరి. వారు సిరియాకు పోవునపుడు మార్గ మధ్యమందు కొందఱు మంచిరుచిగల యాహారములు తెచ్చి పెట్టిరి. అపుడు "ఇట్టిఆహారము ప్రతిముసల్మానునకు లభించుచున్నాదా" అని ప్రశ్నింపఁగా ప్రజలు అదెట్లువీలగును" అని విన్నవించిరి. అటులైనచో నాకుఁగూడ అక్కఱలేదు అని ఆ భోజనములనుతినక వదలిపెట్టిరి.

హజ్రత్ ఉమరుగారియొద్దకు రోమను పారసీక రాజుల యొద్దనుండి రాయబారులు వచ్చుచుండిరి. హజ్రత్ ఉమరు గారు ముసల్మానులతోకలిసి కూర్చుండుచుండిరి. కావున రాయబారులు హజ్రత్ ఉమరుగారిని గుర్తింపలేక పోవుదురు. ఎందుకన హజ్రత్ ఉమరుగారి దుస్తులలోను ఇతరముసల్మానుల దుస్తులలోను ఏలాటి వ్యత్యాసము లేకుండెను. అందఱితోఁబాటు హజ్రత్ ఉమరుగారుకూడ సామాన్యమైనదుస్తులు ధరించుచుండిరి. సర్వజనులకు వారు మార్గదర్శులుగా నుండిరి. ప్రజలను పరిపాలించు ప్రభువులకును అధికారులకును హజ్రత్ ఉమరుగారి మార్గము ననుసరించునట్టి మంచిబుద్ధి దేవుడు ఒసంగుగాత! ఆమీన్.

మొదటి భాగము సంపూర్ణము